# నయవిద్య

(సాంఘిక నవల)



By
**Prof. J. SURYANARAYANA**
Emeritus fellow (Telugu)
UNIVERSITY OF HYDERABAD,
Hyderabad-500 134

**1995**

# నయ విద్య

(సాంఘిక నవల)

By

**Prof. J. SURYANARAYANA**

Emeritus fellow (Telugu)

UNIVERSITY OF HYDERABAD,

Hyderabad-500 134

1995

ప్రథమ ముద్రణ : 1995

ప్రతులు : 1000

"తిరుమల తిరుపతి దేవస్థానముల ధార్మిక గ్రంథ ప్రచురణ ఆర్థిక సహాయ పథకం క్రింద ముద్రించబడింది."



వెల రు. 30/-



ప్రతులకు :
జాస్తి. సరోజిని
512, బాలాజీ కాలనీ,
తిరుపతి-517502

ముద్రణ :
లక్ష్మి గ్రాఫిక్స్,
48-బి, రామానుజ అయ్యర్ వీధి,
మద్రాసు-600 021.

# ముందుమాట

నన్ను నవల రచనకు ప్రోత్సహించి నాలో నిద్రాణంగా ఉన్న వచన ప్రబంధ రచనాశక్తిని మేల్కొల్పిన కర్నూలు నగరంలోని మిత్ర మండలికి నేనెంతయు ఋణపడియున్నాను. అంతేగాక నాయీ వ్రాత ప్రతిని సూక్ష్మేక్షికతో పరిశీలించి దీన్ని తీర్చి దిద్దటంలో సూచన లొసంగినవారు నాకు ప్రాతః స్మరణీయులు. ఈ కార్యక్రమంలో కొనియాడదగిన వారు శ్రీ జి. పుల్లారెడ్డిగారు. వీరినుంచి నేను పొందిన ప్రోత్సాహం మరి రెండు నవలల రచనకు నన్ను ప్రక్రమింప జేసింది. ఈ రెండు నవలలు గూడ అచిరకాలంలో ముద్రితములై వెలుగులోకి వస్తాయని నా నమ్మకం.

వర్తమాన సమాజంలో ముఖ్యంగా యువ లోకంలో తలయెత్తు తున్న ఉగ్రభావ పరంపరను మృదువుగా పరామర్శించి వారి తలం పులను మన జాతీయమైన సంస్కృతి వైపు మరల్చి దానికి మూలా ధారమయిన సంస్కృత వాఙ్మయ ప్రాశస్త్యాన్ని గూర్చి యలతిగా చర్చ గావించటం ఇందలి వస్తువు.

ఈ గ్రంథ ముద్రణకు తగిన ఆర్థిక సహాయాన్ని గావించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి, అనతి కాలంలో ముద్రించి వెలుగులోకి తెచ్చిన లక్ష్మి గ్రాఫిక్స్, మదరాసు వారికి నా వందనములు.

ఇట్లు

జె. సూర్యనారాయణ.

తిరుపతి
20-3-1995

# 1

పిల్లా పెద్దలతో మూటాముల్లెతో చేత టిక్కెట్లు పుచ్చుకుని శ్రీవేంకటేశ్వర స్వామి నివాసానికి పోయే బస్సుల్లో సీట్లకోసం వెంపర్లాడే యాత్రీకుల్లా, గుంపులు గుంపులుగా ఉన్న ఈ జనసందోహం ఇక్కడ చేరి ఉండడానిక్కారణం కొత్తవారికి తెలియదు. వీరి చేతుల్లో కూడ Tickets ఉన్నాయి. కొద్దిగా సామూనుంది. మాగన్నుగా ఉన్న పిల్లలు భుజాలపైన, స్పృహలేని పిల్లలు తల్లుల చేతుల్లో కొందరు ఉన్నారు. వీరివెంట మరికొందరు పెద్దలున్నారు. ఈ పిల్లలు స్పృహ కోల్పోయినట్లున్నారు. వీరంతా రేషను కోసం గాని వచ్చారనుకోను వీల్లేదు. కిర్సనాయిలైతే డబ్బాలు, బియ్యమైతే సంచులు ఉండాలి గదా. అలాంటివేం లేవు. రేషనుకొచ్చేవాళ్ళున్నా ఒకరి కిద్దరు రావడం కద్దు. ఇంట్లో ఆలనా పాలన లేనందున పిల్లల్ని తీసుకొనిరావటం గూడ కద్దు. రేషనుకు మగ మహారాజులు రారు. వేరేపని ఉన్నా లేకున్నా రేషనుషాపుకు సీటికూళాయికి రావాలన్నా, ఆ గుంపులో నిలబడాలన్నా సందర్భవశాన గలిగే వాగ్యుద్ధాల ముష్టిఘాతాలకు ఉద్యమించాలన్నా స్త్రీలకు తగును. రేషనుషాపులో లాగ బారులుతీరి నిలబడలేదు వీరు. కొందరు నిరాశతో నిట్టూరుస్తున్నారు. మరికొందరు దిగులుగా కూలబడిపోయారు. అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. వీరంతా తమ ముందున్న వరండాలోని ద్వారబంధం తెరచుకునే మధుర క్షణం కోసం చూస్తున్నారు. వరండాలోను దాని కనుబంధంగా ఉన్న గదుల్లోను ఇలాంటి వారింకా చాలామంది ఉన్న విషయం లోపలకు పరిశీలనగా చూస్తేగాని తెలియరాదు.

బయట నుంచి నర్సు వేషధారిణియైన ఒక నడివయస్సు వనిత ఆ గుంపులోనికి ప్రవేశించింది. ఆమెకు ఆ జనమందరు తమ తమ వినయాన్ని, అదరాన్ని గౌరవభావాన్ని ఇంకా ఇంకా ఎన్నో భంగిమల్లో చూపుతున్నారు. తన చుట్టూ మూగుతున్న జనంపైపామె ఒక నిరాశాజనకమైన చూపు విసరింది. ఆమె చేతికి కింద నుంచి ప్రక్క నుంచి అందించే వారిపై ఆమె కృపాకటాక్ష వీక్షణం ప్రసరిస్తుంది. ఆమెకు ఆ జనంలో సంపన్నులు, త్యాగధనులు అయినవారు ముడుపులను అందచేస్తున్నారనే విషయాన్ని గ్రహించటం కొత్తవారికి, అంత త్వరగా తెలి

యకపోయినా ప్రాత కాపులకతి సామాన్యమైన అంశమే అది. ఆమెపై మరీ మమకారాన్ని, ఆదరాన్ని ధనం మూలంగ వ్యక్తం గావించిన వారికి ఆమె తగు రీతిని సాయం చేస్తుంది. వారి చేతిలో ఉన్న Tickets ను తీసుకొని దానిపై వరుస సంఖ్యను చూచి ఆ సంఖ్యను తారుమారు చేసి మరో సంఖ్య గల కార్డునిస్తుంది. ఈ సందర్భం ఇలా కొనసాగుతుండగా వరండా నుంచి లోపలికి పోయే తలుపులు తెరుసుకున్నాయి. అందుండి మధుర గంభీర స్మితంతో అతి ధీరంగా గుమిగూడిన జనంవైపు చూస్తూ వారి విన్నపాలను వినయ వినమ్ర ప్రమాణాలను స్వీకరిస్తూ తాను గూడా కించిదవనత శిరస్కుతతో, హస్తచాలనాదులతో వారికి ప్రతి నమస్కారం చేస్తున్న రీతిలో ముందుకు సాగిపోయాడు. ఆయన రాకతో ఆ జనంలో నిశ్శబ్దం చోటుచేసుకొంది. దండం దశగుణం అని నమ్మి ఆ విద్యను తరచు ఆచరణపూర్వకం గావించే ప్రాథమికోపాధ్యాయుని రాకతో తరగతి గదిలోని బాల బాలికల్లాగా జనమంతా నిశ్శబ్దాన్నాచరించారు. వ్యథతో ఆధిబాధలతో చిత్తజ్వరంతో సంతాపాన్ని పొందుతున్న పసిబిడ్డలు తల్లులు తక్కినవారు ఎంతగా వివారించినా బతిమాలినా భయపెట్టినా వారు ఆర్తారావాలను మాత్రం మానలేదు.

దీన్నిబట్టి మీ రూహించే ఉంటారు. ఆ భవనం ఒక వైద్యుని నిలయమని, అందే తన చికిత్సాలయమని అతడు చిన్నపిల్లల వైద్యంలో నిపుణుడనిన్నీ.

డాక్టరు కూర్చునే గదిలో కంతకు రెండు నిమిషాలముం దడుగిడిన నర్సు గదిలోని సామానులను సర్దుబాటు గావించి డాక్టరుగారాసీనులయ్యే ఆసనంపైన వెనుక భాగంలో గల దుమ్మును దులుపుతుంది. ఆ గదిలోని సామానులు వాటి అమరికి శస్త్రచికిత్స కవసరమయ్యే పరికరాలు, పిల్లలను పరీక్షించడానికి నిర్దిష్టమైన వేదిక, దానిపై గల వస్త్రంలాంటి రబ్బరు ఎంతో విలువ గలవిగా అందంగా, ఆకర్షణీయంగా ఉన్నాయి గాని పరీక్షావేదిక పరిసరాల్లోని గోడపై గల Oil Paint పై కొన్ని మరకలు కనబడుతున్నాయి. పరీక్షా నిమిత్తం ఆ వేదికపై పరుండబెట్టిన బాలబాలికలు తమ తల్లితండ్రులా పరిసరాల్లో ఉన్నప్పటికీ డాక్టరును చూచినంతనే భయపడి ఒంటికి పోయేవారు రెండికి పోయేవారు తరచు తలపడు తుంటారు. భయభ్రాంత చిత్తంతో వారు గావించిన అల్పాచమనం గోడలను మలినపూరితం గావించినాయని తెలుసుకోవటం కష్టంగాదు.

ఆ చిల్డ్రన్ స్పెషలిస్టు పేరు విశ్వేశ్వరయ్య. అరవయేడు నడుస్తు మించే ఉంటుందాయన వయస్సు. చామనఛాయ శరీరం. మూడొంతులు నెరిసిన కనుబొమ్మలూ ముక్కుకు తాకీ తాకకుండా మీసాలు. దీన్ని కోరమీస మంటారని అనుకుంటాం. ఈ యంశంలో ఈయన కోరవయస్సుకోని వాక్యను తలపిస్తున్నారు. నెత్తిపై కొంత తెల్లదనం ఉన్నా మీసాలు మాత్రం నల్లగా ఉన్నాయి. ముక్కుకు తగిన కన్నులు కనురెప్పలు గూడ నల్లదనాన్ని ఎగజిమ్ముతున్నాయి. తెల్లని పాంటు అపుడే మడత ఊకదీసినట్లున్నాయి దానిపై మడతలు. చాల తెలుపు ఊదారంగు ఆఫ్ హాండ్ షర్టు. కాలికి ధరించిన షూ చాల విలువైంది. ఆయన పాదాన్నలంకరింప నోచుకున్న సాక్సు ఎంతో విలువైనవే అయి ఉంటాయి. వాటిని చూసే వీలు గలుగలేదు. చాల విలువ గల అలంకార ప్రాయమైన పెన్ను షర్టు జేబులో ఉంది.

ఆయన విద్యార్హతలను గూర్చి ముచ్చటించటం అప్రస్తుతం కాదనుకుంటా. ముప్పైఅయిదు సంవత్సరాలనాటి మాట. విశ్వేశ్వరయ్య 1957 లో పన్నెండో తరగతి పాసయినాడు. ఆనాటి ఆయన చదువు మదరాసు నగరంలోని ట్రిప్లికేన్‌లో హిందూ హైస్కూలులో. ఆ రోజులలో విశ్వేశ్వరయ్యగారి తండ్రి కేంద్ర ప్రభుత్వంలో బాధ్యాయతాయుతమైన ఉద్యోగం చేస్తుండేవారు. దేశంలో ఎన్నో ప్రాంతాల్లో తిరిగి విశ్వేశ్వరయ్య హైస్కూలు విద్య ముగియటానికి నాలుగు సంవత్సరాల ముందు నుంచి మదరాసులో ఉండటం జరిగింది. అందువల్ల విశ్వేశ్వరయ్య మదరాసు నగరంలో 12 వ తరగతి ఉన్నత శ్రేణిలో పాసయినాడు. మదరాసులోని పన్నెండో తరగతిలో ఫిజిక్సు, కెమిస్ట్రీ అనే వాటితో పాటు లెక్కలు బయాలజీ కూడా పాఠ్యాలుగా ఉంటాయి. తెలుగుదేశంలో అయితే లెక్కలు గానీ, లేకుంటే బయాలజీ గానీ మొత్తం మూడే ఉంటాయి. అందువల్ల తెలుగునాట చదివినవారికి వృత్తివిద్యల్లో వైద్యశాస్త్రం గానీ, వాస్తుశాస్త్రం గానీ చదవటానికి వీలు గలుగుతుంది. కాని మదరాసులో చదివినందువల్ల విశ్వేశ్వరయ్యకు వాస్తుశాస్త్రంలోను, వైద్య శాస్త్రంలోనూ ప్రవేశానికి యోగ్యత లభించింది. ఇంతలో ఆయన తండ్రి హైదరాబాదు నగరానికి ట్రాన్స్‌ఫర్ అయినాడు. ఆంధ్ర రాష్ట్ర రాజధానిగా రూపుదాల్చిందానాడే. కర్నూలు నుంచి రాజధాని ఇంకా భాగ్య నగరానికి మారుతూ మారుతూ ఉంది. రాష్ట్ర రాజధాని గుంటూరు విజయవాడ తెనాలి అనే నగరత్రయాల నడుమ నిర్మించాలని తలంచిన కొంత మంది తలంపు

పెమ్మయినందుకు పాలకవర్గంలోనే విభేదాలు లోలోపల రగులుతున్నాయి. ఆ నాటి ముఖ్యమంత్రి యెదుట ఎవరును ఈ విషయాన్ని చెప్పలేకపోతున్నారు. ఈ రాజకీయాలలో విశ్వేశ్వరయ్య ఉన్నత విద్యాభ్యాసానికి సంబంధం లేకున్నా ఉస్మానియా యూనివర్సిటీలోనూ అక్కడి వైద్య కళాశాలలోను ఉర్దూ భాష ప్రముఖ స్థానాన్ని ఆక్రమించి ఉంది. విశ్వేశ్వరయ్య తెలుగువాడయినా తెలుగువారి రాజధాని నగరంలో కన్న తమిళరాజ్యంలో ఉన్నత విద్య చదవటం మంచిదనుకున్నాడు. ఆయనకు కొంతకు కొంత అరవం వచ్చుగాని ఉర్దూ అసలు రానేరాదు. తల్లిదండ్రులకు దూరంగా మదరాసులో ఉండి విద్య నభ్యసించటం విశ్వేశ్వరయ్యకు వ్యయప్రయాసలతో గూడిన కార్యమనిపించింది. ఆయన తండ్రి కూడ విశ్వేశ్వరయ్యను ఉన్నత విద్యకై మదరాసు నగరానికి పంప నిచ్చగింపలేదు. అప్పటి తమిళుల కాంధ్రులపై అమితమైన ద్వేషముండేది. భాషాప్రయుక్త రాష్ట్రాలనే పేరుతో తెలుగునాడు తమిళుల నుండి వేరుపడింది. ప్రాంతీయ భేదం వల్ల మదరాసు ప్రెసిడెన్సీ (అంతకు ముందున్న)లో లాగ అరవవారికి తెలుగు నాటి ఉద్యోగాలు రావటం గానీ వ్యాపారం కొనసాగించటం గానీ జరగని పని అని వారు గ్రహించేరు. అంతేగాక మదరాసు ప్రెసిడెన్సీకి కేంద్రంవారు కావించిన అర్థిక సాయాన్నంతటిని మదరాసు నగరాన్ని తక్కిన అరవ ప్రాంతాలను తీర్చి దిద్దుకోవటానికి వాడుకున్నారు. ఈ యంశలో ఆ నాటి తమిళులు చక్కని పాడియావయిన భారతదేశంలోని జనుల నోళ్ళను ఎండగట్టి మాతృభూమిసంపద లన్నింటిని తన స్వార్థానికే వాడుకునే శ్వేతజాతివారికే విధంగాను తక్కువకాని వారు. ఆ యవకాశం ఆంధ్రరాష్ట్రం ఏర్పడడంతో కోల్పోయారు అరవసోదరులు. ఈ ద్వేష భావం వారి రాజ్యంలో ఉండే తెలుగువారిపై ముఖ్యంగా విద్యార్థులపై ప్రసరిస్తుందేమోననే భయం విశ్వేశ్వరయ్య తండ్రి మనసులో చోటు చేసుకుంది. అందువల్ల విశ్వేశ్వరయ్య హైదరాబాదులోనే తనయుని విద్యాభ్యాసానికి నిర్ణయం గావించుకున్నాడు. అయితే వైద్య శాస్త్రంలో చేరటమా లేక వాస్తు శాస్త్రంలో ప్రవేశించటమా అనేది మరో చిక్కు సమస్య విశ్వేశ్వరయ్యకు ఎదురైంది. తన కొడుకు ఇంజనీరు గావటం విశ్వేశ్వరయ్య తల్లి అభిమతం ఆమె మదరాసులో ఉన్నపుడు వారింటి ప్రక్కనే ఉన్న ఇంట్లో ఓ ఇంజనీరు ఉండేవాడు. ఆయన బయట పోవాలంటే 'జీపు' సిద్ధంగా ఉండేది. ఆయన సకుటుంబముగా సినిమాకు గానీ నగరంలో మరే పనులకు గానీ వివాహాద్ధి

శుభ కార్యాలకు పోవాలంటే ప్రభుత్వం వారి వాహనం. దాన్ని నడిపేవానికి జీతాన్ని మాత్రమే గాక ఆ వాహనానికయ్యే పెట్రోలు ఖర్చు రిపేరు మొదలయిన ఖర్చులు "ఇంత" అని ఇంజనీరు సంతకం చేస్తే ప్రభుత్వ ఖజానా నుంచి చెల్లింపబడుతుంది. ఇలాంటి బిల్లుల్లో ఇంజనీరుగారికి మామూళ్ళు అందుతుంటాయి. వివిధ భవనాలు రోడ్లు వేయించే కంట్రాక్టర్ల బిల్లుపై సంతకించినంత మాత్రాన ఆ ఇంజనీరుకు పిరిష్టశాతం సంతోషికంగా అందుతుంది. ఈ వృత్తిలో ఉన్న ఈ విభవం ఆమెకు వాస్తు శాస్త్రం వైపు ఆదరాభిమానాన్ని గలిగించాయనేది వాస్తవం. అంతకన్న ఆమె ఆలోచన హేతువు నాధారంగా చేసుకుని సాగింది గాదనేది స్పష్టం. ఆమె విద్యావంతురాలుగాదు సామాన్యమైన ఆలోచనలుగల వనిత మాత్రమే.

విశ్వేశ్వరయ్య తండ్రికి మాత్రం తన కొడుకు డాక్టరు కావాలని ఉండేది. విద్యావంతుడయినందున ఎంతో అనుభవాన్ని సంతరించినందున తండ్రి మాటను విశ్వేశ్వరయ్య పాటించాడు. అందువల్ల డాక్టరు కోర్సులో ప్రవేశానికి దరఖాస్తును ఉస్మానియా వైద్య కళాశాలకు పంపాడు. తల్లి మాట కాదనలేక ఇంజనీరింగు కళాశాలకు గూడ దరఖాస్తు చేశాడు. రెండు దరఖాస్తులు అందినట్లు కార్డులు వచ్చాయి. కానీ ఎంతకాలం గడచినా Interview రాలేదు. విశ్వేశ్వరయ్య తండ్రి ఉద్యోగం చేస్తున్న కార్యాలయంలోని ఒక ఉద్యోగి కొడుక్కు వైద్యకళాశాలలో ప్రవేశం కోసం Interview వచ్చినట్లు విన్నాడు. అతడు తనకన్న చిన్న ఉద్యోగి అయినందున ఆయన నుండి వివరాలను తెలుసుకోవటానికి విశ్వేశ్వరయ్య తండ్రికి ఇష్టం లేదు. నేడో రేపో తన యింటికీ Interview వస్తుందని ఎదురుచూచాడు. కాని ఆయన అనుకున్నట్లు జరగలేదు. తన ఆఫీసులోని ఉద్యోగి కొడుక్కు వచ్చిన మార్కుల వివరాలను కనుగొన్నాడు విశ్వేశ్వరయ్య తండ్రి. తన కొడుక్కి వచ్చిన మార్కుల కన్న తక్కువ మార్కులు వచ్చాయి. అయితే తన కొడుక్కు Interview రాకుండటానికి కారణమేమిటనే మీమాంస కలిగింది ఆయనకు. ఇంజనీరింగు కాలేజివారైన Interview పంపకున్నందువల్ల విశ్వేశ్వరయ్య తండ్రికి ఆందోళన ఎక్కువయ్యింది. అంతా కొత్త. తాను పెద్ద ఆఫీసరు. తన క్రిందివారి సాయం కోరటానికి మనస్సంగీకరించలేదు. తనకు వైద్యకళాశాల వారిని Phone ద్వారా Contact చేస్తే Interview కు పిలిచిన అభ్యర్థుల్లో

విశ్వేశ్వరయ్య పేరు లేకపోవటానికి వాస్తవాన్ని గ్రహించాడు—పనిగట్టుకుని స్వయంగా వైద్య శాఖాల కార్యాలయానికి పోయి విశ్వేశ్వరయ్య దరఖాస్తు వెదికించటం చాల ప్రయాసతో బాధ పనైనది. ఎలిజిబిలిటి లేని దరఖాస్తుల కట్టలో విశ్వేశ్వరయ్య దరఖాస్తు ఉంది. ఎలిజిబిలిటీ లేకపోవటానికి విశ్వేశ్వరయ్య పాసయిన పన్నెండో తరగతి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంవారు గుర్తించలేదు. అప్పట్లో ఆంధ్రరాష్ట్రంలో పదకొండో తరగతి తరవాత ప్రియూనివర్సిటీ అని ఒక సంవత్సర కాల పరిమితి గల కోర్సుండేది. దానితో విశ్వేశ్వరయ్య పాసయిన పరీక్ష తుల్యంగాదనే విషయం అప్పుడు తెలిసింది. ఈ వాస్తవం విశ్వేశ్వరయ్య తండ్రిని ఎంతగానో క్రుంగదీసింది. ఏమి చెయ్యాను తోచలేదు. ఏమైనా సరే తన కొడుకును మదరాసులో చేర్చాలంటే అసలక్కడకు దరఖాస్తు చేయనేలేదు.

విశ్వేశ్వరయ్య తండ్రికి దిక్కుతోచలేదు. ఆఫీసులోని ఫైళ్ళను విరామమెరుగకుండా కదిలించే ఆయన ఈ దిగులుతో మందకొడిగా అయిపోయాడు. దిగులుతో ఉన్నట్లు ఆఫీసువారందరు గ్రహించారు. కారణం అడగడానికి సాహసం చేసినవారొక్కరూ కూడా లేరు. కాలం గడవటం అతికష్టమయింది. ఈతని విషాదాన్ని భార్య సరస్వతి గుర్తించింది. కాని ఎంతగా అడిగినా మనోగతాన్ని ఆయన వివరించలేదు. తను చేసిన అనుచిత కృత్యానికిది ఫలితమని ఆయన దిగులుపడటం, తన్ను తాను నిందించుకోవటం చేస్తుండేవాడు. కొత్తగా ఏర్పడిన రాష్ట్రం రాజధానికి ప్రయత్నపూర్వకంగా మార్పించుకున్నందుకు మిగుల దుఃఖించాడు. మదరాసులోనే ఉంటే ఇలాంటి సమస్య వచ్చేది కాదు గదా అని తనలో తాను వాపోయాడు. నెమ్మదిగా తండ్రి మధనపడడానికి కారణాన్ని, విశ్వేశ్వరయ్య తెలుసుకున్నాడు. మార్గం లేనందున ఇంక ఈ సంవత్సరానికింతే అని విశ్వేశ్వరయ్య సరిపెట్టుకున్నాడు. కాలం వృథా గావటాన్ని, తాను ప్రయత్నపూర్వకంగా హైదరాబాదుకు మార్పు గావించుకోవటం కారణం గావటాన్ని తలచుకొన్న కొలది విశ్వేశ్వరయ్య తండ్రికి దుఃఖం నివారింపరానిదయింది. కాలం విలువ పసివాడయిన విశ్వేశ్వరయ్యకు తెలియదు గాని ఆయన తండ్రికి బాగా తెలుసు. వృద్ధాప్యంలో ఎక్కువ జీతం వచ్చే కాలంలో ఒక సంవత్సరాన్ని కోల్పోవటం అంటే పన్నెండు నెలల జీతాన్ని పోగొట్టుకోవడం అంటే ఎంత బాధాకరమో విశ్వేశ్వరయ్య తండ్రికి బాగా తెలుసు. అతనికి ఊరట గలగలేదు.

తాను మదరాసు రాక మునుపు ఢిల్లీలో ఉద్యోగం చేశాడు. ఆ నాడు తన పై అధికారి ఇప్పుడు సెంట్రల్ సెక్రటరియేట్‌లో అత్యున్నత పదవిలో ఉన్నట్లు వినియున్నాడు. ఆయనకు ఈ పరిస్థితిని వివరిస్తే ప్రయోజనం ఉంటుందేమో అని లీలగా తోచింది. అయితే ఆయనకు జాబు వ్రాయటమా? జాబుకు జవాబు వచ్చే టప్పటికి కనీసం పదిరోజులు పడుతుంది. ఇప్పటికే కాలం అతీతమయింది. క్రొత్తగా చేరిన విద్యార్థులు రెండు వారాల నుంచి కాలేజికి పోతున్నారు. ఇప్పు డిప్పుడే సీనియర్సుతో పరిచయాన్ని చేసుకుంటూ సీనియర్స్ రాగింగ్ అనే పేరుతో జూనియర్సుకు విధించే శిక్షలను చవిచూస్తు ఇబ్బంది పడుతూ ఉన్నట్లు ఈ రాగింగు అమానుషము పైశాచికకృత్యమూ అని తోటివారికి వివరించటాన్ని ఆయన (విశ్వేశ్వరయ్య తండ్రి కార్యాలయంలో ఉన్న చిరు ఉద్యోగి కొడుకు వైద్యకళాశాలలో చేరినందున) వివరించటం విన్నాడు.

కాలహరణం చేయక వెంటనే ప్రయాణమై ఢిల్లీ పోవాలనుకున్నాడు. అఫిషియల్‌గా పోతే వాయు మార్గంలో పోగల తాహతు గలవాడు ఆయన సొంత డబ్బుతో గాబట్టి రైల్లో స్లీపరులో పోవ నిశ్చయించుకున్నాడు. రాకపోకలకే నాలుగురోజులు పడుతుంది గాబట్టి వారం పాటు శెలవుకు దరఖాస్తు దాఖలు చేశాడు. పార్లమెంటు వర్షాకాలం సమావేశాలు ప్రారంభమయ్యే రోజులవి. M.P.లు వాయు మార్గంలో రాజధాని ఢిల్లీ చేరుకొంటున్నారు. వారి ద్వార తమ తమ పనులను వ్యాపారాదులను సాధించుకోదలంచిన జనులనేకులు రాష్ట్రంలోని నలు మూలల నుండి హైదరాబాదుకు చేరుకొని అక్కడ నుండి ఢిల్లీ పోయే రైల్లో స్లీపరు బర్తు కోసం పడరాని పాట్లు పడుతున్నా జంటనగరాల్లోని Booking Clerks కు అది స్వర్ణయుగం. టికెట్టు కోసం క్యూలో నిలబెట్టి నాలుగయిదు మందికి టిక్కెట్టిచ్చి యనుగ్రహాన్ని చూపి తక్కినవారికి వట్టిచేతులను చూపి తరువాత వారి నుండి ఎక్కువ మూల్యాన్ని తీసుకుని టిక్కెట్టును అనుగ్రహిస్తు న్నారు. ఈ విధంగా అధిక ధనాన్ని టిక్కెట్టు కోసం వ్యయం చేయటానికి ఇష్ట పడనివాడు విశ్వేశ్వరయ్య తండ్రి. తన ఆఫీసులోని గుమాస్తా ద్వారా టికెట్టు తెప్పించుకోవటానికి అయన అంతరాత్మ అంగీకరించదు. విమానంలో ప్రయాణం చేసే తాను మామూలు రైల్లో పోతున్నట్లు తన ఆఫీసువారికి తెలియనీయటం ఆయనకు సమ్మతం గాదు. అతి కష్టంమీద స్లీపరు కోచ్‌లో డెబ్బయ్యో బెర్తను

కుంటా దొరికింది. 70-72 బెర్తులు వాకిలి దగ్గర. వాషు బేసినుకు శౌచాలయానికి అతి సన్నిహితంగా ఉంటాయి. అక్కడ రాత్రంతా దీపం వెలుగుతుంటుంది. అందువల్ల నిద్ర సరిగా రాదు. ఆగిన ప్రతి స్టేషనులోనూ ఎక్కే దిగే జనాలవల్ల రాత్రనక పగలనక రద్దీగా ఉంటుంది. మనసు గట్టి చేసుకొని ప్రయాణానికి సిద్ధపడుతున్నాడు. తాను ప్రయాణం చేయాల్సిన దినమే గాక రైలు బయలుదేరే వేళ రానే వచ్చింది. తన పని ఏమవుతుందోననే ఆలోచనలతో రైళ్ళో సామాన్య ప్రయాణీకుడుగా పోవటానికి అయిష్టంగా ఉన్న మనసును సముదాయించుకుని హైదరాబాదు మహానగరంలో రైల్వేస్టేషనుకు వచ్చాడు.

అపుడు సమయం రాత్రి 8 గంటలు తిది వారాలుగానీ తేదీ గానీ ఆయనకు గుర్తుకు రావటం లేదు. అపుడే ఢిల్లీకి పోయే రైలుతోపాటు బొంబాయి పోయే రైలుగూడ పక్క ప్లాట్‌ఫారం మీదికి వచ్చింది. మొత్తం రెండు రైళ్ళల్లో ప్రయాణించే సంఖ్య రెండు వేలకు లోపుగా ఉంటుందేమో గాని స్టేషన్లో ఉన్న జనం దాదాపు యిరవై వేలుంటారనిపిస్తుంది. అందులో వయోవృద్ధులే గాక పసి పిల్లలు గూడ ఉన్నారు. ఆ జనంతో మగవారికి తీసిపోనంతగా ఆడువారున్నారు. విశ్వేశ్వరయ్య తండ్రి హైదరాబాదు స్టేషను అలా క్రిక్కిరిసిఉన్న జనంతో చూడటం అదే మొదటిసారి. ఆ జనంలో ఘోషా పాటిస్తూ పరదాలో ఉన్న మహమ్మదీయ వనితలు, నడయాడుచున్న చీకటిలాగ ఉన్నారు. రకరకాల టోపీలు దాల్చిన మహమ్మదీయ పురుషులు వివిధ వర్ణాలు గలిగిన పశుసంతతిని తలపిస్తున్నారు. ప్రయాణం సాగిస్తున్న వారిని సాగనంపే మగవారు గాఢంగా ఆలింగన చేసుకుని మహమ్మదీయ పురుషులు వీడ్కోలిస్తున్నారు. పయనించే వ్యక్తికి గల స్తోమత ను బట్టి వీడ్కోలిచ్చే వారి సంఖ్య ఆధారపడి యుంటుందనుకుంటా. నమాజు వేళ అయినందున కొందరు ఆరద్దీలోనే అల్లాను ప్రార్థన గావించటానికి ప్లాట్‌ఫారం పై మందపాటి వస్త్రాన్ని పరిచి దానిపై మోకాళ్ళు శిరస్సు నేలకు తాకునట్లుగ వంగి లేస్తున్నారు కొందరు మహమ్మదీయ పురుషులు. తన్ను వీడి సుదూరం పోతున్న ఆప్తుల శ్రేయస్సును కోరుతూ నుదుటి మీదినుంచి క్రిందికి కుడి ఎడమ భుజాలవైపుకు తన కుడిచేతిని పోనిస్తున్నారు క్రైస్తవులు. తలపై ముసుగు వేసుకొని దేవుని ప్రార్థనకు ఉద్యమిస్తున్నారు క్రైస్తవ వనితలు. దేవునికి స్తోత్రము మొదలయి ప్రార్థనాత్మక వచనలు ఈ మతం వారు తరచుగ ఉచ్చరిస్తున్నారు. ఔన్నత్యంతో పాటు స్థూలకాయం గల సిక్కు స్త్రీ పురుషులు

నడగొండల్లా ప్లాట్‌ఫారం పైన వస్తుంటే పరిసరాలందరి ప్రజలకు వారి శరీర స్థౌల్యం బాధాజనకంగా ఉంది అయినా ఈ యంశాన్ని మాత్రం గమనించవని వీరు పాల సముద్రంలో మంధర పర్వతాల్లా పరిసర ప్రజలకు సంచలనాన్ని కలిగిస్తున్నారు. వీరితో మాట్లాడాలంటే ముఖాన్ని పైకెత్తటం అవసరం. రైలు బోగీకున్న కిటికీలను మించిన దైర్ఘ్యం గలవారు వీరు. అందువల్ల లోపలి వారిని చూడాలంటే వీరు ఆనవత శిరస్కులు గావలసి వస్తుంది.

తనకోసం యింటికి వచ్చే మిత్రులకు తన రాకను గూర్చి ఎవరికి ఎలా చెప్పాలో ప్రయాణం చేయనున్న ఓ భర్త తన భార్యకు చెబుతున్నాడు. ప్రయాణం చేయనున్న ఓ తల్లి తన కూతురుకు వంట విషయంలో ఇంటి విషయంలో కాలేజీకి పోయి వచ్చేటపుడు తీసికోవాల్సిన జాగ్రత్తలను పూస గ్రుచినట్లు చెబుతోంది. కాని ఆమె మాటలను ఆ కూతురంత శ్రద్ధగా వింటు న్నట్లు లేదు. తను ఒంటరిగా బ్రతకటానికి ఇంతగా విషయ వివరణం అవసరం లేదని ఆ యువతి ధీమా కాబోలు. అయినా తల్లి హృదయం ఊరుకోవటం లేదు.

విశ్వేశ్వరయ్య తండ్రి ఈ గందరగోళాన్ని సందడిని పట్టించుకోవటం లేదు. కాలక్షేపానికని దిన వార పత్ర పత్రికలను దేనిని కొనటం లేదు. ఎంత తొందరగా ఢిల్లీ నగరం చేరతామనేది ఆయన మనస్సును కలవరపెడుతుంది. అక్కడకు చేరిన తరువాత ఎవరిని ఎలా అభ్యర్థించాలి. ఎలా తనకు వచ్చిన సమస్యకు పరిష్కారాన్ని కోరాలనేది ఆయనను వ్యాకులిత చిత్తుణ్ణి చేస్తుంది.

రైలు బయలుదేరటానికి ఇంకా ఎంతో సమయం లేదు. మొదటి బెల్లు అయినది. రెండో బెల్లు అయినా బండి కదలలేదు. ఇంతలో బొంబాయి బండి సుదీర్ఘంగా ఆవులించి కొండశిలువలాగ నెమ్మదిగా ముందుకు సాగింది. రెండో గంట ఆ బండికి అయ్యిందని తన బండికి కాదని విశ్వేశ్వరయ్య తండ్రి తెలుసు కోవటానికి ఎంతో సేపు పట్టలేదు. ఆ Platform పైనుంచి జన సందోహం తిరుగుముఖం పడుతోంది. ఇంతలోనే జరుగరాని సంఘటన ఒకటి జరిగింది. అటునుంచి తన బండివైపు విశ్వేశ్వరయ్య తండ్రి ఆఫీసులో ఉద్యోగం చేసే నాల్గో తరగతి ఉద్యోగి ఒకడు వస్తున్నాడు. అత డీయాఫీసరు మామూలు పాసింజరలా స్లీపరు కోచ్‌లో ప్రయాణం చేయటాన్ని చూడనే చూచాడు. ఆ చిరుద్యోగి తన పై అధికారిని ఒళ్ళంత కళ్ళు పెట్టుకుని చూస్తున్నట్లు విశ్వేశ్వ

రయ్య తండ్రి కనిపించింది. ఆ సన్నివేశంలో ఆ ఆఫీసర్‌గారు కాశీవాసు మాటల్లో చెప్పాలంటే సిగ్గుతో చేయనిది ఏమీ లేదు. (కాని కానినచకార లజ్జయా). ఈ విధంగా తాను ప్రయాణం చేయటంలోని చిక్కులకన్న తన్ను తన ఆఫీసులోని వాడు చూడటం తోడికోడలు దెప్పటంలా విశ్వేశ్వరయ్య తండ్రికి మిక్కిలి బాధా జనకం అయింది.

ఇంతలో బండి చలనాన్ని అందుకుంది. గార్డు పచ్చ వెలుగును చూపటం గానీ విజిల్ వినిపించటం గానీ తుదకు రైలింజను కూత వేయటం గానీ విశ్వేశ్వరయ్య తండ్రికి వినిపించనూ లేదు. తెల్లవారేసరికి రైలు నాగపూరు చేరుకున్నది. నాగపూరునుంచి బొంబాయికి, కలకత్తాకి నేరుగా రైలు మార్గాలున్నాయి. దక్షిణాదివారిని ఉత్తరాది రాష్ట్రాలకు ముఖ్యంగా దేశ రాజధాని అయిన ఢిల్లీ నగరానికి అటుతరువాత ఉన్న ఉత్తర భారత రాష్ట్రాలయిన పంజాబుకు భూలోక నందన వనమయిన కాశ్మీరు పోవటానికి Direct గా రైలు మార్గం ఉంది. ఆంధ్ర మహాభారతంలోని నలోపాఖ్యానంలో నలు డరణ్య మధ్యంలో ఉండి దమయంతితో, ఇది దక్షిణా పథంబున కిది విదర్భకు ఇందిదికోసల కిది యుజ్జయినికి తెరువులు అని చెప్పిన ప్రాంతం ఈ నాగపూరేనేమో ననిపిస్తుంది.

ఆనాడాదివారమని నాగపూర నగరంలోని చర్చి గంటలు చెవిని బడినందున విశ్వేశ్వరయ్య తండ్రి కవిపించింది. పరికించి చూడగా మగ ఆడ బాల వృద్ధ అనే తేడాలు లేకుండా క్రైస్తవులంతా పెందలాడే తమ తమ యింటి పనులు ముగించుకుని నల్లని అట్టలమధ్య ఎర్రని అంచులు గల కాగితాల సంపుటిని (బైబిలు) చేతపూని ఉన్నంతలో మంచి వస్త్రాలను ధరించి చర్చికి పోవటాన్ని చూచాడు. ఇంతటి దీక్ష తాదాత్మ్యం హిందువులకు లేకపోవటానికి ఆయన లోలోపల విచారపడ్డాడు. ఆదివారమయినందున నాటి దిన పత్రికలు బరువుగా వెల అధికంగా ఉన్నాయి. ఒక దిన పత్రికను తీసికొని అందులో వారఫలాలను చూచుకున్నాడు. తను పూనికతో ఢిల్లీ నగరానికి పోతున్న పని సఫలమవుతుందో లేదో అనే ఆందోళనకు అందులో సమాధానాన్ని వెదుక ప్రయత్నించాడు. వారఫలితాల్లో పాము చావకుండా కర్ర విరగకుండా అన్న ధోరణిలో తన సాఫల్యాన్ని చూచుకుని ఆశ నిరాశల నడుమ ఊగిసలాడాడు.

ఆదివారం సెలవుగావటం హిందువుల మార్గంగాదు. కార్యాలయాలకు, విద్యాసంస్థలకు ఆదివారాలు మాత్రమే సెలవు దినాలుగావటం తక్కిన దుర్దినాలు సెలవులు గాకపోవటం మన సంప్రదాయానికి విచ్ఛేదకమని తనలోనే అనుకున్నాడు. ఆకాశము మేఘావృతమయి సూర్యుని దీప్తిలోకాని కందనపుడు లోకుల మనస్సు మందకొడిగా పనిచేస్తుంది. అలాటప్పుడు (మేఘాచ్ఛన్నేతు దుర్దినం) ప్రాచీనార్యుల దుర్దినంగా తలంచి అనధ్యయనదినంగా పాటించేవారు. ఇపుడా వ్యవస్థ మారిపోయింది. మనవారు ఆంగ్లేయుల ఆచారాలకు విలువనిస్తూ క్రైస్తవ మానసపుత్రులు గావటానికి వగచాడు.

ఇంతలో రైలు నాగపూరునుండి బయలుదేరింది. త్వరలో వేగాన్నందుకుంది. జొన్న మొక్కలక్కడక్కడ కనిపిస్తున్నాయి. అంతకు మించిన పంట పొలాలంతగా కనబడటం లేదు. కనుచూపుమేర కనుపించేవి కఠినాతికఠిన శిలలు. ఈ శిలలు తీర్చినందునే మహారాష్ట్ర దేశంలో వీరుడుగా పేరుపొంది హైందవ మతాన్ని ఉద్ధరింప దీక్ష పూనిన శివాజీ, అంతగట్టి పట్టుదలతో స్వదేశీ స్వధర్మ రక్షణ కుద్యమించాడని తలంచాడు.

తరువాత చెప్పుకోదగ్గ జంక్షన్ ఇటార్సీ ఇదికూడా నాగపూరు వంటిదే ఖాంత దేశానికి నడిబొడ్డున ఉంది. ఇక్కడ మన మాతృభూమిలోని ప్రధాన నగరాలకు నాల్గింటికి ఇనుప దారులున్నాయి. అప్పటికి ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలయింది. తెల్లవారితే సోమవారం. రేపటి ఉదయం 10 గంటల ప్రాంతానికి దేశ రాజధాని మొఘలాయీలు మొదలయిన చక్రవర్తులకు రాజధాని భారతకాలం నాటి హస్తినాపురి, గజపురి, గజనామధేయపురి, హస్తినగరి, హస్తిపురి, హస్తినావతి, దంతిపురము మొదలయిన వివిధ నామాలతో నన్నయ కాలం నుంచీ అధునిక యుగానికి చెందిన తిరుపతి వేంకటకవుల దాక తెలుగు వాఙ్మయంలో కీర్తింపబడిన రాజధానికి నేటి రూపమే దేహళీ (ఢిల్లీ) నగరం. ఇందులో దేశనేతల సమాధుల నానుకుని పారే యమునా నది మధురా నగరంలో బాలకృష్ణుని లీలావిహారాలను తిలకిస్తూ 'తాజ్‌మహల్' నిర్మాణంలో రాళ్ళెత్తిన, కూలి స్థితిగతులను వారి శిల్ప సంపదను అవగతం చేసుకుని గంగానదివైపు ప్రవహిస్తుంటుంది. నగరానికి చేరువవుతున్న కొలది తను సాధింప దలంచిన కార్యభారాన్ని తలంచుకొన్నందున ఆందోళన అశాంతి అధికమవుతుంది. అశాంతి తొలగించుకొను మనస్సునకు

విశ్రాంతి కలిగించుకొను రామాయణాది పుణ్యకావ్య పారాయణం చేయటం విశ్వేశ్వరయ్య తండ్రికి పితృ పితామహ క్రమంగా సంక్రమించిన విద్య ప్రస్తుతం తను చేస్తున్న ఈ ప్రయాణంలో రాజాజీ రామాయణాన్ని, గోఖలే వ్యాఖ్యానంతో గూడి ఉన్న భగవద్గీతను తెచ్చుకున్నాడు. ఆ గ్రంథాల పఠనంతో పగలు తెలియకుండా గడచిపోయింది. రాత్రి భోజనం ఝాన్సీలో. పద్దెనిమిది వందల యాభై ఏడులో సాగిన ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటాన్ని—స్ఫురణకు తెచ్చే ఈ నగరం చేరినంతనే ఆయనకు భారతనారి అయిన ఝాన్సీరాణి లక్ష్మీబాయి పుత్రుని వీపుకు గట్టుకుని గుర్రంపై పరుగిడుతు యుద్ధం చేసిన నాటి త్యాగదీక్ష ఆత్మార్పణ స్వాతంత్ర్యంపై ఆసక్తి కన్నులయెదుట మెరిసినాయి. నేటికి ఝాన్సీ నెత్తురు మరకలు, కుంపవివోళ్ళ కత్రుమచ్చలు చరిత్రలోన మెరుస్తు ఉంటయ్ అనే పంక్తు లాయన స్మృతిపథంలో ప్రతిధ్వనించినాయి.

తెల్లవారేసరికి ఆగ్రా వచ్చింది. ఇంకా కొలది గంటల్లో గమ్యాన్ని చేరుకోనున్న ఆ ప్రయాణీకుడు ఆగ్రా నగరవైభవాన్ని గూర్చి ఆలోచించటం మాని వేశాడు. ఢిల్లీ నగరంలో తాను చేయవలసిన పని కలయవలసిన అధికారులకు చెప్పవలసిన అంశాలపైన దృష్టి కేంద్రీకృతమైనది. ఈ ఆలోచన పరంపరలో ఉంటగానే ఢిల్లీనగరం రానేవచ్చింది. స్టేషన్నుంచి భవభూతి మార్గంగుండా ప్రయాణం చేసి తాన్సేన్ మార్గంలో గల ఒక మిత్రుని యింటికి చేరుకున్నాడు. ఈతని రాక వివరాలను ముందుగానే ఫోన్ మూలాన విన్నందున ఆ మిత్రుడు ఈ అతిధికి అన్ని విధాల సపర్యలను చేయటానికి తగిన వివరాలను ఆ యింటి పనిమనిషికి తెలియజేసి తమ విధులకు ఆ భార్యాభర్తలు తమ స్కూళ్ళకు వారి పిల్లలు వెళ్ళిపోయారు. ఈ విధంగా పగలంతా గృహాన్ని పనిమనిషి కప్పగించి తమ తమ విధులకు పోవటం సాయంకాలం మరల క్రమంగా యింటికి చేరు కోవటం ఢిల్లీలాంటి నగరాల్లో అతి సామాన్య విషయం విశ్వేశ్వరయ్య ఢిల్లీలో ఉన్నపుడిలాగే జరుగుతుండే సంఘటనలు ఆయనకు స్ఫురణకు వచ్చింది. ఈ రీతిగా తాను ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నపుడు ఇల్లు ఆ పరిసరాలు అక్కడి మనుష్యులు వారి వేషభాషలు వివాహాది శుభకార్యాల్లో వారు పాటించే ఆచార వ్యవహారాలు మొదలయిన వివిధాంశాలు ఆయన మనోనేత్రం ముందు మెదలు తుండగా వాటన్నిటిని అడచివేసుకుని స్నాన భోజనాదులను ముగించుకుని

పదిన్నర గంటల ప్రాంతంలో కేంద్రప్రభుత్వంలోని విద్యాశాఖ గల భవనానికి బయలుదేరాడు.

అక్కడ ఒకరిద్దరు ఆఫీసర్లను కలుసుకుని తన సమస్యకు పరిష్కారం సూచించే సెక్షన్లు వారివల్ల తెలుసుకొని పన్నెండు గంటల ప్రాంతంలో నిర్దిష్ట సెక్షన్లుకు పోయి తనకు వచ్చిన సమస్యను వివరించి పరిష్కారాన్ని కోరాడు. అంతేగాక మదరాసువారి పన్నెండో తరగతిని ఆంధ్రావారు వారి కోర్సుతో కాలం (duration) పాఠ్య గ్రంథాల విషయంలో తక్కువ గాకున్నా దాన్ని తెలుగువారు నిర్లక్ష్యం చేయటం మొదలయిన యంశాలను వివరిస్తూ ఒక అర్జీని తయారుచేసి ఆ యధికారికి సమర్పించాడు. ఆయన చెప్పిన దాన్ని విని ఇచ్చిన దరఖాస్తును వసాధానంగా పరిశీలించి ఏదో స్మృతిపథంలో మెలగగా ఆ యధికారి ఇలా చెప్పారు,

**అధికారి :** మదరాసులోని పన్నెండో తరగతిని తెలుగువారు వారి P.U.C. తో సరిగాదన్నారు. ఇదేగదా మీ సమస్య.

**వి.తంత్రి :** ఔనండీ అదే నేను మదరాసునుంచి కావాలని కోరి హైదరాబాదుకు మారి ఈ సమస్య నెదుర్కొంటున్నాను. నేను మదరాసులోనే ఉంటే ఇలాంటి సమస్య వచ్చేదిగాదు. నేను కోరికోరి కొరివితో తలగోక్కున్నాను. మా వానికి ఒక సంవత్సరకాలం వృథా గావటానికి కారణం నేనే. వాడి భవిష్యత్తును నేనే బుగ్గిపాలు గావించాను. ఇత్యాదిగ ఇంకా ఎంతో దీనంగా తన సమస్యను వివరిస్తుండగా అతన్ని అంతటితో ఆపి అధికారి ఇలా అన్నాడు.

**అధికారి :** అయితే ఈ యంశంలో ఇంత జాప్యం ఎందుకు కావించావు. మదరాసు నుంచి పరిసర రాష్ట్రాలకు బదలీయైన కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు మరి. కొందరీ సమస్య ఇంతకు నెల క్రిందటనే మాకు నివేదించారు.

**వి.తంత్రి :** ఈ యంశం నాకు తెలియ వచ్చి రెండు వారాలు మాత్రమే అయినది. అప్పటినుంచీ ఈ సమస్యకు పరిష్కారంకోసం ఆలోచించి ఏమి తోచక తుదకు ఇక్కడకు వచ్చి మిమ్ము కలుసుకున్నాను. ఆలస్యం జరిగినందుకు మన్నించి నాకు పరిష్కారాన్ని చూపండి మీరు

Note put up చేస్తే దానిని విద్యాశాఖామాత్యులు అంగీకరిస్తారని నా నమ్మకం. అని దీనంగా ఎదుటి వానిని ప్రసన్నం గావించే ధోరణిలో మాట్లాడటం మొదలుపెట్టాడు వి. తండ్రి.

అధికారి : ఇంతకు ముందీ యంశంపై నేను note విద్యాశాఖామాత్యులకు పంపాను వారు ఈ యంశంలో శాశ్వత పరిష్కారానికై ప్రయత్నం చేయాలనే తలంపుతో ఉన్నారు.

వి.తండ్రి : ఇప్పటికే కాలమతీతమయిపోయింది. జరిగిపోయిన కాలం మళ్ళీ తిరిగిరాదు గాని త్వరగా నిర్ణయం (తాత్కాలికమైనదయినా) తీసుకుంటే మావాడికి సంవత్సర కాలం కలిసివస్తుందని వాపోయాడు.

అధికారి : పరిష్కారమయినా అన్ని సీట్లు నిండిపోయిన తరువాత ఇంక ఈ సంవత్సరానికి చేరే ప్రశ్న లేదుగదా యీ యభిప్రాయంతోనే ఈ యంశాన్ని మీకు నేరుగా విన్నవించిన ఆఫీసర్లు వెనుతిరిగి వెళ్ళారు.

వి తండ్రి : అయ్యో పరిష్కారాన్ని సూచిస్తే తరువాత సీటు రావటం మా అదృష్టంపై ఆధారపడి ఉంటుంది.

అధికారి : ఈ ఫైలు B. Section లో ముందు వరసలోని చివర table పైన ఉన్నది. అక్కడకు పోయి వివరాలు కనుక్కో.

B. Section ఆయన కింతకుముందు పరిచితమే. ఆయన ఆ ఆఫీసులో ఉద్యోగం చేసినపుడా B. Section లో నాల్గో seat లో ఉన్నప్పటి సంగతులు ఆయన కనుల ఎదుట మెదులాడినాయి. ఆ Section కు చేరుకోవటానికి పది నిమిషాలుకన్న పట్టలేదు. మొదటి వరుసలోని చివరి table ముందున్న Seat ఖాళీగా ఉంది. ఆ పరిసరాల్లో విచారిస్తే ఆయన leave లో ఉన్నాడని ఆ మరు నాటితో ఆయన leave అయిపోతుంది గాబట్టి Join అవుతాడనీ తెలిసింది. ఆ మాటలిని హతాశుడై నిరాశ నిస్పృహలతో తిరిగి తాన్‌సేన్ మార్గంలోని తన నివాసానికి చేరుకున్నాడు. అపుడుగాని రెండు గంటలు దాటినట్లాయనకు తెలియ రాలేదు. ఆ యింటి పనిమనిషి ఈయన రాకకై వేచివేచి వేసారి తనవంతు భోజనాన్ని తినివేశాడు. వి. తండ్రి తన భాగాన్ని తిని చేయి కడుక్కొని విశ్రమించాడేగాని మనస్సు అశాంతితో కలత చెందుతోంది. రెండు రాత్రుళ్ళు ఒక

వగలు రైలు ప్రయాణం చేసినా స్నానం మాటలా ఉంచి అన్నపానీయాల విషయం మరచినందున గలిగిన శ్రమతో శరీరం అలసి ఉన్నా కంటికి కునుకు రావటం లేదు సరిగదా కన్ను మూయాలనిపించటం లేదు. అంతగా మనస్సు కొడుకు భవిష్యత్తుకోసం సంవత్సరకాలం వృథాగాకుండ రక్షించటం కోసం తహతహ లాడుతుంది. "కూకుండనీదురా కూపింతసేపు" అన్నట్లుగా అశాంతికి గురవుతుంది. ఇలా తోచని స్థితిలో ఉన్న వి. తండ్రి ఆ ప్రాంతంలో ఉన్న ఒక మాగజీను పైన రంగురంగులతో ఒప్పారుచున్న ఒక చిత్రంతో చిత్రితమయిన దాన్ని చూచాడు. దాని తీరు పొందిక ఆయన మనస్సును ఆకట్టుకొంది. విరంతరంగా మథనపడుతున్న అతని మనస్సు కా చిత్రం విశ్రాంతిదాయక మయ్యింది క్షణకాలం ఆ గ్రంథాన్ని అందుకున్నాడు. అది ఆయనకు చిరపరిచితమైన హిందీ కథల సంపుటి. ఇది అలహాబాదునుంచి ప్రకటితమయినా హిందీ మాట్లాడే ప్రాంతమంతట దీనికి ప్రచారముంది. నూతన కహానియా అనే పేరుగల మాసపత్రిక అది దాన్ని తెరిచి కొంతకొంత చదవ ప్రయత్నించాడు. పై నున్న చిత్రమంతగా లోపల ఏ కథా తన్ను ఆకర్షితుణ్ణి చేయలేకపోయింది. దృష్టి మాత్ర గోచరమైనంతనే ఆకట్టుకునేది చిత్రం. కథాదివాఙ్మయాంశా లాచోనామృతాలు. అయినా ఆశతో ఆ పత్రికను కొంత పరిశీలించగా అందులో ఒక అపూర్వమైన ప్రయోగం కనబడింది. ఆంగ్ల పదానికి సంస్కృత ప్రత్యయానికి (మోకాలికి బట్టతలకువలె) ముడిపెట్టిన రూపము గావటం దాని విశేషం. మాష్టరినీ, అనే దాని విశేషరూపం. Master అనే ఆంగ్ల పదానికి స్త్రీ లింగరూపము Mistress. ఈ పుంలింగ రూపంపై 'ఇనీ' అనే దాన్ని చేర్చి 'మాష్టరినీ' అనే రూపాన్ని గల్పించిన నేర్పు గల హిందీ వారి భాషా నిర్మాణ దక్షత ప్రశంసార్హం. "ఇనీ" అనేది సంస్కృతానికి చెందినది. ఇందులో రెండు ప్రత్యయాలున్నాయి (ఇన్ + ఈ). ఈ సముదాయాన్ని ఒకే ప్రత్యయంగా తీసికొనుట హిందీ భాషీయులకున్న స్వేచ్ఛను తెలియజేస్తుంది. గుణ మొదలయిన సంస్కృత పదాల పై మతుబంతంలో 'ఇనీ' చేరినందున (గుణిన్) అనే పుంలింగ రూపం. దీని పైనుంచి గుణి గుణినౌ గుణినః మొదలయిన రూపాలు (పత్యయాములవల్ల ఏర్పడుతాయి) నిష్పన్నమవుతుంది. దీనికి స్త్రీలింగరూపం 'గుణినీ' అనేది ఇందులో ఈ స్త్రీ లింగబోధకం. గుణినీలో నుంచి గుణను మినహాయిస్తే 'ఇనీ' మిగులుతుంది. దీన్ని హిందీవారు స్త్రీలింగ బోధకం గావించారు. అని తలస్తూ తనలో

తాను నవ్వుకున్నాడు వి.తండ్రి కొంతసేపు. అంతటితో ఆ మాస పత్రికను వదలి కొంతసేపు శరీరాలసటను తొలగించుకునే ప్రయత్నం చేసి ఆ ప్రాంతంలో ఉన్న దినపత్రిక నొకదాన్నందుకున్నాడు. అది కూడ హిందీ భాషలోనే ఉంది. నవభారత టైమ్స్ అనే దాదిన పత్రిక పేరు. అందులో ప్రకటనల కాలంవైపు దృష్టి సారించాడాయన. ఆ ప్రకటన క్రింద అధో హస్తాక్షరీ, అని కొన్నిచోట్ల అదో హస్తాక్షరకర్తా అని మరికొన్ని చోట్ల ఉంది. Undersigned అనే ఇంగ్లీషుకు బదులు హిందీవారు సంస్కృత పదాలతో గల్పించిన రూపాలీ రూప ద్వయం అని ఆయన తలంచాడు. తెలుగులో 'చేవ్రాలు' ఎంత సూక్ష్మపదాలతో నిర్దిష్టార్థాన్నిస్తుందో స్ఫురణకు వచ్చినందుకు తెనుగుభాషను లోలోపల కొనియాడకుండ ఉండలేకపోయాడు. ఆ పంక్తుల్లోనే ఎక్కడో కంప్యూటరీకరణ అనే దాయన దృష్టి నాకర్షించింది. 'కంప్యూటరైజేషన్, అనే ఆంగ్ల పదానికి హిందీ రూపంగా అనుకోవటానికి ఎంతో వ్యవధి అవసరం కాలేదు. ఇందులోని తొలి పదం ఆంగ్లం (Computer) రెండో పదం సంస్కృతం. ఈ రెంటికి నడుమ వచ్చి ఈ కారం సంస్కృత భాషా నిర్మాణాన్ననుసరించి వచ్చిందే. ఏమైతేనేం ఈ రూపం హిందీవారిది. మనం అంగీకరించినా లేకున్నా మన జాతీయభాష ఇది అసలు హిందీలో ఎన్నో భేదాలున్నాయి. ఒక ప్రాంతంవారి భాష మరో ప్రాంతం వారి కర్థం గాదు. మన ద్రావిడ భాషల్లో ఎంత వైవిధ్యం ఉందో అంత భేదం ఈ భాషల్లో ఉంది. అలాంటి భేదాలను పాటించి చూసిన ప్రాంతీయ వైవిధ్యం గల (So Called) హిందీ కన్న ఎక్కువమంది వ్యవహరించే భాష తెలుగు. కాబట్టి సంఖ్యాబలాన్ని వాస్తవ దృష్టితో చూస్తే తెలుగు జాతీయభాష గావలసిన స్తోమతుంది. అయినా ఈ సత్యాన్ని చెప్పే దెవరు, చెప్పినా వినేవా రెవరు.

హిందీని మనమంతా నేర్చుకొంటున్నాం. హిందీ భాషీయులు మన భాష నొకదాన్ని నేర్చుకోవాలని రాజ్యాంగంలో ఉంది. అలా ఆయితే హిందీ భాషల్లో అన్యభాషల పదాలు చేరి విశిష్టము అందరికి అందుబాటులో ఉండేదిగా హిందీ తయారవుతుందని రాజ్యాంగ నిర్మాతల తలంపు. కాని హిందీవారన్య భాషల నేర్చటం లేదు. అందువల్ల వీరు రాజ్యాంగ సూత్రాలను ఖాతరు చేయటం లేదు. అయినా వారికి ఏ శిక్ష ప్రభుత్వం విధించటం లేదు. హిందీ గ్రంథాలను తెలుగు మొదలయిన భాషల్లోకి తర్జుమా చేయాలన్నా తెలుగు మొదలగు భాషలవారు పూనుకో

వలపిందే గాని హిందీవారి బాధ్యతను చేపట్టరు. అవి వారి కవసరము లేదని వారు నమ్ముతున్నారు ఈ విధమైన ఆలోచనల్లో నుంచి పరిసరాలకు వి.తండ్రి రావ టానికి ఇంట్లోకి ఎవరో వస్తున్నట్లయిన సవ్వడి కారణమయింది.

ఉదయం ఎనిమిదిన్నర గంటల కింత టిఫిన్ తిని మధ్యాహ్న భోజనాన్ని తీసుకుని పుస్తకాల సంచులను వీపున వేసుకుని రెండు బస్సుల దూరం అయిదారు కిలోమీటర్లు ప్రయాణం గావించి ఆ నాటి విద్యాభ్యాస కార్యక్రమాన్ని ముగించు కుని తిరిగి యింటికి చేరుకున్న బాలబాలికల రాకగా ఆ సద్దును వి.తండ్రి గుర్తిం చాడు. తమ బరువుల నుంచి విమోచనాన్ని పొందిన వాలెంటిన్యు ముఖం కడు క్కుని వేరే వస్త్రాలను ధరించి పనిమనిషి ఏర్పాటు చేసిన అల్పాహారాన్ని అనతి కాలంలో తినివేసి బాలుడయిన రమేశ్, అక్కడకు దగ్గరలో నున్న పార్కులో క్రీడల కోసం పోయాడు. పదిహేనేళ్ళ రమేశ్ తరువాతి సంతానం బాలిక. వయసు పన్నెండు సంవత్సరా లుంటుంది. పేరు 'ఉష'. ఆ యిద్దరే ఆ యింటివారి సంతతి. ఈ పిల్ల లిద్దరు చదువులో, ఆటపాటల్లో శరీరారోగ్యంలో తగిన రీతిని ఉన్నా పరిమిత కుటుంబం పిల్లల క్రమశిక్షణ వి.తండ్రికి ముద్దు గొలిపించినవి. అన్న ఆటలకు పోగా చెల్లెలు ఇంట్లోనే ఉండిపోయింది. మెల్ల మెల్లగా పలకరిస్తూ ఆ బాలికకు తన్ను పరిచయం చేసుకుని తనకు ఆమె తండ్రికి గల అతి గాఢము దీర్ఘకాలికము అయిన స్నేహాన్ని సంక్షేపంగా తెలియజేశాడు ఆ వివరముల కంతకు ముందు రాత్రే రేపు రానున్న తన మిత్రుని గూర్చి ఉష తండ్రి చెప్పి యున్నందున repetition ను గంభీరంగా భరించింది. అయితే అన్నతో పాటు ఆటలకా బాలిక పోకపోవటం వి.తండ్రికి వింత అనిపించింది. చనువు చేసుకుని ఈ యంశాన్ని అడిగి తల్లిగారు వద్దనందున, పోలేదని ఉష ముక్తసరిగ బదులు చెప్పింది. వయస్సు వచ్చీరాని బాలికలకు స్నేహితులుగా బాలుర లుండటం అమె రికా సంఘంలో ఓ ముఖ్యమయిన సంప్రదాయమని వింటూంటాం. ఎంత ఎక్కువమంది బాలకులతో స్నేహం చేయగలిగితే అంత ఘనత ఆ బాలికకు అమెరికాలో లభిస్తుంది. అమెరికా నుంచి రాకపోక లధికంగా ఉన్న బొంబాయి నగరంలో కొందరు హైందవ బాలిక లీ యాచారాన్ని అభిమానిస్తున్నట్లు వింటున్నాం. ఇప్పుడిప్పుడే ఆ పదం ఢిల్లీలో చోటు చేసుకొంటున్నదని అంద

తెరిగిన విషయమే. ఇలాంటి ప్రమాదం నుండి తన కూతురును కాపాడుకోవ టానికే ఉష కామె తల్లి ఈ విధంగా నియమాలను పెట్టి ఉంటుందని వి.తంత్రి గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు. మన దేశంలో క్రీస్తుకు పూర్వకాలంనాటి జీవన విధానం కొన్ని యంశాల్లో నేటికిని అనుసరింపబడుతోంది. కొన్ని యంశాల్లో పాశ్చాత్య దేశీయ సంప్రదాయాలను ఆచరిస్తున్నాం. మనం పూర్తిగా భారతీయులంగాము. అంత మాత్రాన ఆధునిక అభ్యుదయ దేశాలకు వారసులం గాముని అనుకొంటుండగా వి.తంత్రి ఆలోచనల కంతరాయం కలిగింది. ఉదయం తను రాక మునుపు ఆఫీసుకు పోయిన తన మిత్రుడు రమేశ్ తంత్రి రానే వచ్చాడు. ఆయన వచ్చిన పది నిముషాల్లో రమేశ్ తల్లి గూడ గూటికి చేరు కుంది. వారు ముగ్గురికు ఇంటి పని మనిషి వేడి టీ కప్పుల నందించాడు. అప్పటికి సాయంత్రం అయిదన్నర గంట లయింది.

ఆ తరువాత మిత్రు లిద్దరు పరస్పరం యోగక్షేమాల విచారంతో ఓ అర గంటకు పైగా గడచిపోయింది. వారిరువురు ఎరిగిన ఆఫీసర్ల ప్రస్తుత ఉద్యోగాలు ప్రమోషన్లు ఉద్యోగం చేస్తున్న నగరాల వివరాలు వారి వారి సంతతి పొందిన డిగ్రీలు ఉద్యోగాదులు వివాహాదుల్లో వారు వారు పొందిన శుభాశుభాలతో వారు 7 గంటల దాకా కాలం గడిపారు. ఈ సందర్భములో తన కొడుకు విశ్వేశ్వ రయ్యకు సంవత్సరకాలం వృధా అయ్యే పరిస్థితి జ్ఞాపకానికి వచ్చి వి.తంత్రి మనస్సు మరల కలతగాంచింది. ఇంతలో భోజనాలకు పిలుపు వచ్చింది. భుజిస్తుండగానే వి.తంత్రిని నిద్రాదేవి వరించింది. భోజనానంతరం తాను ఎంతో సేపు మేల్కొని ఉండలేదు. తనకు నిర్దేశించిన పాన్పుపైకి శరీరాన్ని చేర్చి వాలి పోయాడు. చలికాలం కానందున వానల కాలం తగ్గినందున ఆయన వరండాలో నిద్ర కుపక్రమించాడు. మర్నాడు అంటే మంగళవారం ఉదయం ఏడు గంటల వరకు ఆయన శరీరం మనసు ఆత్మ అంతరాత్మ మొదలయిన అవయవాలు అంతః కరణాలు భూలోకంలో కలిగిన సుఖదుఃఖాల కందని లోకంలో విహరించాయి. మెలకువ మరికొంతసేపు రాకుండ ఉంటే బాగుండునని వి.తంత్రి అనుకున్నాడు మొదట్లో. మరల తను వచ్చిన పని స్ఫురణకు రాగా మనస్సు ఆశతో ఆందోళన లతో కల్లోలితమయి పోయింది. ఇంతలో ఆ యింటి వంట మనిషి తెచ్చి యిచ్చిన టీ కప్పును సేవించటంలో తన మనస్సును కేంద్రీకృతం గావించాడు వి.తంత్రి.

ఇంటివాళ్ళు తమ పనుల్లో నిమగ్నమయి ఉన్నారు. [illegible] వి.తంద్రి తన మిత్రుని ఉద్యోగం జీతం ఇంటి ఖర్చులు పిల్లల చదువులకు అయ్యే వ్యయం ఉష వివాహానికి తాను ఖర్చు చేస్తున్న ధనం మొదలయిన విషయాలు నడిగి తెలుసుకుని సంతృప్తిని వ్యక్తం చేశాడు వి.తంద్రి. ఢిల్లీ నగరంలో దేశంలో ఎక్కడ లేనంతగా అన్ని వస్తువులు పుష్కలంగాను తక్కువ వెలకు దొరుకుతుండటాన్ని తన మిత్రునివలన విని [illegible] వి.తంద్రి. హైదరాబాదులో వస్తువుల కొరతయే గాక వెల అధికంగా ఉండటాన్ని తలంచుకుని ఆయన విషాదాన్ని ప్రకటించాడు. రాజధాని నగరంలో వస్తువుల కొరత గానీ, కల్తీ సరుకు నమ్మటం గానీ వెలను పెంచి అమ్మటం గానీ చేస్తే విదేశీయులకు మన దేశ ఆర్థిక విధానంపై ఏవగింపు కలగవచ్చు. [illegible] తమ తమ దేశాలకు పోయి ఈ యంశాల నెక్కడ ముచ్చటిస్తే ఆ విషయాలు రాజకీయ ప్రాధాన్యం గల వారి చెవికి పోతే ఆదేశాల నుంచి మనకు లభ్యం [illegible] భయం అని తన మిత్రుడు వివరించగా సంచలితచిత్తుడయ్యాడు వి.తంద్రి.

ఈ పూట భోజనంతో తన మిత్రుని యింట మూడు పూటలు భోజనం చేసినట్లవుతుంది. మందయినా విందైనా మూడు పూటలంటారు. తా నీ రాత్రికి తిరుగు ప్రయాణమయితే మంచిది. అలా కాకపోతే ఏం చేయాలనేది ఆయన్ను పీడిస్తున్న సమస్య. యథావిధి ఆ యింటివారందరు ఆఫీసులకు పాఠశాలలకు పోయారు. వి.తంద్రి పదిన్నర గంటలకు ముందే ఆఫీసుకు పోయాడు సెక్షన్-బి లో మొదటి వరసలో చివరి గేటువైపు అతి వేగంగా చేరాడు. అక్కడికి రావలసిన వ్యక్తి యింకా రాలేదు. అతనిపై వి.తంద్రికి కోపం అసహనం ఇంకా ఇంకా ఏమో భావాలు కలిగాయి. తా నుద్యోగం చేసే ఆఫీసుకు ఆలస్యంగా తాను పోతే ఆయన రాకకై నిరీక్షించేవారి కిలాగే అసహనం కలుగుతుంది కాబోలు. ఇంకెప్పుడు తాను ఆఫీసు కాలస్యంగా పోరాదని నిర్ణయం గావించుకున్నాడు. అందుకే అంటారు తనదాకా వస్తేగాని..... అని. అటూ ఇటూ చూస్తూ కాలం గడపటం ఆయనకు సాధ్యం గావటం లేదు. అక్కడున్న ఉద్యోగుల కందరికన్న పై ర్యాంకుకు చెందిం దాయన ఉద్యోగం. అతడు రాజధాని నగరంలో (ఢిల్లీలో) ఏ సెక్షన్‌లో పని చేస్తున్నా తన్ను గూర్చి [illegible] తెలిసికొని యుందురు. అలా అయితే తన్ను ఈ ఆఫీసులో సరైన మర్యాదల్తో సత్కరించేవారు. అందుకే

గాబోలు 'ఒక ఊరి కాపు మరో ఊరికి వెట్టి' అని మనవారు చెప్పుతుంటారు. ఈ సామెతకు భూత భవిష్యద్వర్తమానాల్లో తన ఈ నాటి స్థితే తగిన ఉదాహరణమని ఆయన కనిపించింది. ఇంతలో ఆ సెక్షన్‌లోకి మరో వ్యక్తి ప్రవేశించాడు. ఆయనే తనకు కావలసిన వ్యక్తి అయి ఉంటే బాగుండు నను కున్నాడు. ఈయన రిజిష్టరులో సంతకం చేసినందున అక్కడి ఉద్యోగే గావి, తన లాగ వచ్చినవాడు గాదని సులువుగానే గ్రహించాడు. అయితే ఆయన సీటు ఏది అనేది సమస్య. ఆయన సావధానంగా చివరి సీటు వైపునకే నడిచాడు. తన ఆశలన్నీ ఒక్కసారి రూపు దాల్చినట్లా వ్యక్తి ఆ సెక్షన్‌లోని చివరి టేబుల్‌కు ఎదురుగ ఉన్న సీటు దగ్గరకు చేరుకుని ఆ సీటుపై ఉన్న దుమ్మును దులుపుకొని సావధానంగా ఆసీనుడయినాడు, కూర్చున్నతనే తన table పై ఉన్న ఫైల్సులో తలను దూర్చాడు. తదేక దృష్టితో కొన్ని files పై రాసిన Note ను సరిదిద్ది మరికొన్ని files పై నున్న note ను తగిన మార్పులతో చేర్పులతో సర్దుబాటు చేశాడు. ఆ విధంగా వ్యగ్రమనస్కుడుగా ఉన్న ఆఫీసరును ఎవరునూ ఎంత పని ఉన్నా డిస్టర్బు చేయకూడదనే వాస్తవం వి.తంద్రికి బాగా తెలుసు. తన్ను ఎవరైనా డిస్టర్బు చేస్తే తానెలా రియాక్టవుతాడో ఆయనకు బాగా గుర్తుంది. ఆయన ఓ అరగంట తర్వాత ముఖాన్ని పైకెత్తి అలసట ధ్వనించే కంఠంతో 'చా' తెమ్మని నాల్గో తరగతి ఉద్యోగికి ఆజ్ఞ చేశాడు. 'చా' తాగి అతనికి డబ్బు లిచ్చి పంపాడు. అప్పటికి పన్నెండు గంటలయింది. మరికొంత సేపటిలో lunch Break వస్తుంది. కాబట్టి వి.తంద్రి ఆయనను కలుసుకోవటానికదే యదను అని నిర్ణయించుకున్నాడు. ఆయన్ను సమీపించాడు. ఆ ఉద్యోగి తన ఎదుట ఉన్న కుర్చీలో ఆయన్ను (వి.తంద్రిని) కూర్చోమన్నాడు. వెంటనే తన సమస్యను వి.తంద్రి సవివరంగా మనవి చేసికున్నాడు. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులు వివిధ రాష్ట్రాలకు బదిలీలు కాక తప్పక పోవటాన్ని, అలా బదిలీ అయినవారు ఎదుర్కొనే సమస్యలను ఆ ఉద్యోగి సానుభూతి పూర్వకంగా వి.తంద్రితో ముచ్చటించాడు. వి.తంద్రి ఎదుర్కొంటున్న సమస్యను ఇంతకు ముందే కొందరుద్యోగులు కేంద్ర ప్రభుత్వమువారి దృష్టికి తెచ్చారని, దానికి పరిష్కారాన్ని కేంద్ర ప్రభుత్వం సూచించిందనీ ఆ File ఉన్నతాధికారి సంతకాలకు వేచి ఉన్నదనీ, ఆ సంతకాలయినంతనే అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు దాని ప్రతిని పంపుతామని చెప్పాడు. ప్రత్యేకించి తన కొక ప్రతిని పంపగలందులకు

వి.తండ్రి ప్రాధేయపడగా ఆ ఉద్యోగి అందుకు కంగీకరించాడు. దీనితో తన ప్రయాస సఫలమయ్యిందని వి.తండ్రి సంతోషించినా అంతమాత్రాన విశ్వేశ్వరయ్యకు సీటు వచ్చినట్లు గాదు గదా అనే బాధ ఆయన్ను కలతపెట్టుతోంది. ఆ కలవరంతోనే తన మిత్రుని యింటికి చేరి భుజించి కొంతసేపానాటి దిన పత్రికను తిరగవేశాడు. ఇంతలో తన మిత్రుడు అతని భార్య యింటికి రావటం వారి అనుమతితో రైల్వేస్టేషనుకు చేరకుని రైలులో మరల స్లీపరు బర్తు నాక్రమించి గురువారం సాయంత్రానికి హైదరాబాదుకు చేరుకున్నాడు. గృహిణితో ముక్తసరిగా తన ప్రయాణ వివరాలను ముచ్చటించాడు. ఆ మాటలను విన్న విశ్వేశ్వరయ్య తన కోసం తన తండ్రి పడుతున్న ప్రయాసకు లోలోన ఓక్కిలి కుమిలిపోయాడు.

నిశ్శబ్ద వాతావరణంలో కొన్ని రోజులు గడిచాయి. విశ్వేశ్వరయ్య తల్లి ఈ వాతావరణాన్ని సహించలేకపోయింది. తన భర్త ఢిల్లీ నగరానికి పోయి సాధించుకువచ్చింది తన కొడుక్కి కాలేజీలో చేరటానికి సీటుని తలుస్తుందే గాని మదరాసులో చదివిన పన్నెండో తరగతి ఆంధ్ర మొదలయిన రాష్ట్రాలవారు నిర్వహించే పరీక్షలతో సరిసమానత అని ఆమె కర్థం కాలేదు. ఈ యంశంలో ఉన్న తిరకాసు నర్థం చేసుకునే ధీశక్తి ఆమెకు లేదు. ఇంటిపనులను, వంటపనులను దక్షతతో నిర్వహించటంలో ఆమె దిట్ట. పనిమనిషి ఒకరోజు రాకున్నంత మాత్రాన ఆనాటి వంటకు స్వస్తి చెప్పటం గాని ఇంటివారందరిని హోటలు భోజనాలతో తిప్పలు పెట్టటం గాని ఆమెకు తెలియని విషయాలు. ఆమె తనకు గల పరిజ్ఞానంవల్ల తన కొడుక్కి సీటు వచ్చిందనీ అయినా తన భర్త ఆ విషయంలో ఉపేక్ష వహిస్తూ తన తనయుని బంగారు భవిష్యత్తుకు భంగకరంగా ప్రవర్తిస్తున్నాడనీ తలంచింది. అంతటితో ఊరుకోక తన మనోగత సంతాపాన్ని భర్తపైన ఇంటిలో వంట మొదలైన పాత్రలపై పనిమనిషిని ఆడ్డుగా పెట్టుకునీ వ్యక్తం చేస్తుండేది. ఈ విషయాన్ని గ్రహించిన ఆమె భర్త ఆమె అవివేకంతో గావించే ఆందోళన తుద కది అశాంతికి దారి తీయటం ఎన్నో సందర్భాల్లో ఎదుర్కొనవలసి వస్తుండేది. ఆలాంటి అశాంతి రాకుండేటందుకు ఆయన ఎంతో సంయమనం చూపాడనే చెప్పాలి. విశ్వేశ్వరయ్యకు తండ్రి తలంపు తల్లి యశాంతి అర్థం గావటానికి ఎంతో కాలం పట్టలేదు. తుదకు అసలు విషయాన్ని

ఎన్ని రిజర్వేషన్లు, ఎవరికి అవకాశం లభిస్తుందో. ఇంటర్వ్యూకు అటెండెంటయి సీటు రాని వారి సంఖ్య అధికంగా ఉండగా ఇంటర్వ్యూకు హాజరుకాని అసలు ఇంటర్వ్యూ పిలువబడని విశ్వేశ్వరయ్యకు ఎలా ఈ సీటు వస్తుందని ఆయన బాధ. దాదాపు మూడు నెల్లు గతించినందున అసలీ సీటును నింపుతారో లేక కాలం గడిచిపోయినందున అలాగే ఉంచుతారో అనేది మరో సందేహం.

ఆయనకు సందేహం గలిగినట్లే కాలేజి ప్రిన్సిపాలు శాఖాధిపతుల సమావేశాన్ని ఏర్పాటు చేసి ఈ సీటును నింపుటా లేక అలాగే ఉంచుటా అనే అంశంపై చర్చ చేశాడు. కొందరు వద్దన్నారు, మరి కొందరు ఆ సీటును నింపటం కనీస ధర్మమన్నారు. అదే సమయంలో వి.తండ్రి తన గోడును వెళ్ళబోసుకున్నాడు. తగు సాయాన్ని అర్థించాడు. వైద్యకళాశాల ప్రిన్సిపాలు హృదయం వి.తండ్రిపై సానుభూతితో సతమతమయ్యింది. ఈ సీటును తప్పక నింపాలనుకున్నాడు. నింపినా ఆ సీటు విశ్వేశ్వరయ్యకే వస్తుందా అనేది మరో సందేహం. ఆ సీటుకి ఇప్పటికే ఎంతోమంది వివిధ మార్గాల ప్రయత్నం చేస్తున్నారు. యస్.టి.బి.సి.ల వర్గాలవారికి శ్రేయోవాయకు డయిన నాయకు డప్పటికే ఈ సీటు విషయంగా తన్ను కలుసుకున్న విషయం ప్రిన్సిపాలుకు గుర్తు వచ్చింది. డి.యం.యస్. ఫోనులో ఈ సీటు విషయం చెప్పి ఉన్నాడు. విద్యా వైద్యశాఖల మంత్రులే గాక ముఖ్యమంత్రి గూడ ఈ సీటు విషయంలో జాబులను తనకు పంపియున్నారు. రాష్ట్రి గవర్నరు కేంద్రప్రభుత్వం వారి దృష్టి ఈ సీటుపైకి ప్రసరించినట్లు లేదు. కేంద్రప్రభుత్వ యంత్రాంగం నుంచి ఈ సీటు విషయమై ఓ జాబు తెప్పించగలిగితే ఆ సీటు విశ్వేశ్వరయ్యకు వస్తుందని ప్రిన్సిపాలు చెప్పాడు. ఈమారు ఢిల్లీ నగరం వరకు పోకుండానే వి.తండ్రి ఈ యంశంలో జాబును తెప్పించాడు. దానివల్ల విశ్వేశ్వరయ్య గాంధీ వైద్యకళాశాలలో చేరాడు. అది సెప్టెంబరు చివరి వారం. అప్పటికి దాదాపు మూడునెల్లు గతించినాయి. ఇంత ఆలస్యంగా చేరినందున రాగింగు లేకుండ పోయింది మొదట్లో విశ్వేశ్వరయ్య కొంత భయాందోళనకు గురయ్యాడు. కాలం అతీతమయినందున తోటి విద్యార్థులతో పాటు చదువగలనో లేదో అని ఆయన భయం. ప్రథమ సంవత్సరాంతంలో పరీక్షల్లో విశ్వేశ్వరయ్య మంచి మార్కులను పొంది తనకు గల భయాన్ని జయించి స్తిమితపడినాడు. తన కొడుకు వైద్యవిద్యలో చేరినందుకు విశ్వేశ్వరయ్య తల్లి

అసంతృప్తిని వ్యక్తం చేయకుండ ఉండలేకపోయింది. ఇంత ప్రయత్నిస్తే ఇంజనీరింగ్‌లో సీటు వచ్చేదనీ అలాటి ప్రయత్నం చేయనందున తన భర్తదే బాధ్యతని ఆమె తలంచింది. ఆ విద్యలో సీట్లు ఖాళీగా లేవని ఆమె నెంతగా ఒప్పించాలని విశ్వేశ్వరయ్య ప్రయత్నం చేసినా ఆ ప్రయత్నం వృధా అయిపోయింది.

ఆ తరువాత విశ్వేశ్వరయ్య చదువు మూడు పువ్వు లారు కాయలుగా సాగిపోయింది. మెడికల్ గ్రాడ్యువేషన్ అయినంతనే జనరల్ మెడిసన్ P.G.లో సీటు వచ్చింది. వెంటనే మెడికల్ కాలేజిలో ఉద్యోగం. రెండు సంవత్సరాల తరువాత సెలవుమీద D.C.H. చదివి మరల వెనుకటి ఉద్యోగంలో చేరాడు. జీతం కన్న ఇంట్లో ప్రాక్టీసు బాగా సాగుతుంది. ఈ కాలంలో ఆయనకు రాజీవ్ అనే పుత్రుడు గలిగాడు. అదే కాలంలో ఆయన తల్లిదండ్రులు స్వర్గసుఖాలకై ఇంచుమించుగ ఒకే వారంలో తరలిపోయారు.

ఇంతలో NTR ప్రైవేట్ Practice చేయరాదనే ఆంక్ష విధించ నున్నట్లు విని విశ్వేశ్వరయ్య కోపతాపాలకు గురయ్యాడు. NTR ను తనలో తాను నిందించుకున్నాడు. ఈ non Practicing allowance నిర్ణయించినంతనే ఇంక ఈ ప్రైవేట్ ప్రాక్టీసుకు శాశ్వతంగా తెర పడుతుందని విశ్వేశ్వరయ్య తన ఉద్యోగానికి రాజీనామా ఇష్టం లేకున్నా చేశాడు. అంతటితో ఆయన ప్రాక్టీసు నిరాఘాటంగా "యత్ర భర్తుః క్షితి భర్తుః భయం నాస్తి" అన్న రీతిన జరిగింది. ప్రాక్టీసు పుంజుకున్నందుకు NTR పెట్టిన చట్టమే గదా కారణమని అభినందించటం మొదలుపెట్టాడు.

విశ్వేశ్వరయ్య ఇంట్లో ఆయన తలుపులు తీసుకుని వరండాలో వైద్యశాలకు వచ్చే గది తలుపులను మాత్రం మనం చూచాం. ఆ గదిలోకి పోతే ఇరువైపు లకు వెనుకకు పోవటానికి ద్వారబంధా లున్నాయి. సోఫాసెట్టువైపుగా పోతే పడక గది వస్తుంది. T.V. వైపున్న ద్వారబంధం మరో పడకగదికి దారి తీస్తుంది. అన్నీ రాజీవ్‌కు కేటాయించారు. కాని ఆయన అందులోకి వచించటం లేదనే చెప్పాలి. వెనుక భాగంలో భోజనాదులు వంటగది ఉంటుంది. మొదటి అంతస్తులో సభావేదికకు సరిపోయే గది అన్ని సౌకర్యాలు కలిగి ఉంది, అదే రాజీవ్ గది. ఇప్పుడు రాజీవ్‌కు వయస్సు ఇరవైనాలుగు సంవత్సరా లుంటుంది. రాజీవ్ చదువులో తండ్రిని మించినవాడు. ఈయన్ను ఇంజనీరుగా చేయాలని విశ్వేశ్వ రయ్య తల్లి పట్టుదల. తన కొడుక్కు దక్కని ఆ విద్య మనుమడికన్నా దక్కా లని ఆమె గట్టి పట్టుదల. అలాగే పదవ తరగతి అయినాక లెక్కల గ్రూపుతో ఇంటర్‌లో చేర్చారు. అదొక రెసిడెన్సియల్ కళాశాల. తల్లిదండ్రులున్న నగరం లోనే సుతుడు హాస్టలు భోజనంతో గడపవలసివచ్చింది. ప్రయాస గాక వ్యయంతో గూడిన దీ పని.

తెలుగుకన్న ఎక్కువ మార్కులు సంపాదించటానికి వీలైంది సంస్కృత మని ఆ కాలేజీవారు చెప్పినందున విశ్వేశ్వరయ్య తన కొడుకును సంస్కృతంలో చేర్చాడు. తన తాత చెప్పగా కొంత సంస్కృతాన్ని విని యందలి ఘనతను గమనించిన రాజీవ్ సంస్కృతాన్ని చదవటం నల్లేరుమీద బండిలా సాగిపోయింది.

మాతృభాషయినందున తెలుగు అందరికి సులువైన భాష. సులభగ్రాహ్యం కొత్తవారు నేర్చుకోవాలంటే మన మాతృభాష క్లేశభూయిష్ఠం గావచ్చు. మనకు అయిదు పదులపైన అరక్షరాలు గల వర్ణమాల ఉంది. ఆ వర్ణమాలలో ప్రతి హల్లుకు దాన్నాశ్రయించే అచ్చు ననుసరించి అన్ని రూపాలుంటాయి. మనం పదిహేను అచ్చులను కలిగి ఉన్నాం. హల్లుల సంఖ్య ముప్పైఅయిదు. కాబట్టి (35 × 15) అయిదువందల యిరవైఅయిదు గుణింతాలను మనం నేర్చుకోవాలి. ఇందులో అకార సహితాలైన హల్లులనే (క్ + అ) = అంటే క మొదలైనవాటినే

నేర్చుకుంటాం గాబట్టి పై అయిదువందల యిరవై అయిదులో ముప్పై ఆయిదింటిని తీసివేస్తే నాలుగువందలతొంభై గుణింతాలను ఆపై వత్తులను (క=్క, య=్య త=్త, న=్న, మ=్మ) నేర్చుకోవలసి ఉంటుంది. ఇది లిపికి సంబంధించిన క్లేశము. లిపి భాషగాదు గాని భాషను నేర్చుకోవాలంటే లిపిని ముందుగా తెలుసు కోవాలి. ఇంత క్లేశం ఉన్నందునే ఆంగ్ల మాధ్యమంలో విద్యాభ్యాసం చేసేవారు పదో తరగతికి చేరుకున్నా తెలుగు లిపిని రాయలేకపోతున్నారు. ఆంగ్లంలో అక్షరాల సంఖ్య యిరవై ఆరు. వాళ్ళకు గుణింతాలతో పనేలేదు. తెలుగులో 'f' అనే ధ్వని క్రొత్తగా ఏర్పడింది. దీన్ని ఫ గా రాస్తున్నారు. ఈ యంశాన్ని గురించి క్రొత్త ధ్వనికి సంకేతాన్ని కల్పించేవారింకా ఈ భాషాసంస్కర్తలలో పొడ నూపలేదు. సంస్కృతాంగ్ల పదాలే గాక ఉర్దూ, హిందీ పదాలు గూడ ఈ భాషలో చోటు చేసుకున్నాయి. సంస్కృత విధేయమైన వాక్య నిర్మాణ విశేషాలను గూడ తెలుగువారు తమ తమ రచనల ద్వారా మనకు సంక్రమింపచేస్తున్నారు. సంధి సమాసాల విషయం చెప్పనవసరం లేదు. తెలుగు సంధితో పాటు సంస్కృత సంధిని గూడ మనం నియతంగా పాఠశాల స్థాయిలోనే నేర్చుకోవలసి ఉంటుంది.

తల్లి భాషనుగాక సంస్కృతాన్ని అంతకు ముందు పాఠశాల స్థాయిలో తెలుగును మాత్రం చదివి సంస్కృతాన్ని గూర్చి తెలియనివారు గూడ చేపట్టి అందు తెలుగుకన్నా అధికంగా మార్కులను పొందగలగటానికి విద్యార్థుల కృషి లేదా ఉపాధ్యాయుల బోధనాశక్తి లేదా పరీక్షకుల ఉదార దృష్టి కారణాలు గావలసి ఉంటుంది. ఇంటర్ విద్యార్థి ముఖ్యంగా శ్రద్ధ తీసికొని చదివేది గ్రూపు. ఆ తరువాత ఇంగ్లీషును, సంస్కృతాన్ని తెలుగుకన్నా తక్కువగ చదువుతాడు. ఉపాధ్యాయులు మామూలు డిగ్రీలను పొందినవారే. తక్కినవారికన్నా సంస్కృతం బోధించేవారికి రెసిడెన్షియల్ కాలేజి నిర్వాహకులు తక్కువ జీత మిస్తారు. ఈ భాషను బోధించేవారికి తగిన ఉద్యోగాలు దొరకక పోవటం దీనికి కారణం. చాలీ చాలని జీతంతో సతమతమవుతున్న సంస్కృత ఉపాధ్యాయులు మామూలుకన్నా విశేష కృషి చేసి బోధిస్తారనేది సరిగాదు. పరీక్షకుల ఉదార దృష్టి ఎక్కువ మార్కులను తెచ్చి పెడుతుందనేది వాస్తవం. అలా మార్కులను ఉదారంగా ఇస్తే వారిలో కొందరైన B. A. M. A. తరగతులకు వస్తారనీ లేకుండిన వారి వారికి ఉన్న ఉద్యోగాలకు భద్రత లోపిస్తుందనే భయం ఉన్నదనీ అంటుంటారు. ఈ విషయాన్ని కాదనటానికన్నా అవుననటానికే మన కాధారాలు అధికం.

రాజీవ్ సహపాఠి సమవయస్కుడు. రాజీవ్ కన్న చదువులో సంస్కారంలో ఏమాత్రం తీసిపోని హరి గూడ ఇదే కళాశాలలో లెక్కల గ్రూపులో చేరాడు. అతడు గూడ సంస్కృతాన్నే తీసుకున్నాడు. సరసిజ హరి చెల్లెలు. అతనికన్న వయస్సులో రెండున్నర సంవత్సరాలు చిన్నదయినా చదువులో అన్నతోనూ ఆయనకు ప్రియ మిత్రుడు, అనుంగు సహచరుడైన రాజీవ్‌తోనూ, విద్యలో స్పర్థకు వస్తుంది. ఆమె కూడ సంస్కృతాన్ని తీసుకుంది. అన్న ఆయన మిత్రుడు చేరిన రెసిడెన్షియల్ కాలేజీలోనే సరసిజ కూడ చేరింది. ఆమె వరించిన గ్రూపు బయాలజీ అంటే ఆమెను వైద్యశాస్త్రంలో పట్టభద్రురాలుగా చేయాలని వారి తల్లిదండ్రుల అభిప్రాయం. వారి తల్లిదండ్రులు గూడ భాగ్యనగరంలోనే నివసిస్తున్నారు. వారి తండ్రి రాష్ట్ర ప్రభుత్వంలో ఉన్నత పదవిలో ఉద్యోగం వారి తల్లి గృహిణిగా ఉంటుంది. ఆమె పట్టభద్రురాలు. హరి మిత్రుడయిన రాజీవ్ ఆటల పాటలకై ముఖ్యంగా సెలవు రోజుల్లో హరి యింటికి వస్తుండేవాడు. వారి యింటికి సమీపంలో పెద్ద ఆటస్థలం ఉంది. అన్నతోపాటు సరసిజ గూడ కలసి మెలసి తిరగటం ఆటలాడే స్థలానికి పోవటం అక్కడి బాలికలతో కలసి ఆడుకోవటం చిన్నతనంలో సాగుతుండేది. అప్పటినుంచి రాజీవ్, ఆటల్లోను ఓటమిని ఎరుగక ఏ పాయింటు విషయమైన వివాదం తల ఎత్తితే ఇరు వర్గాలను సమాధాన పరిచి తీర్పు నిచ్చే, విషయంలో చూపే చొరవ సరసిజ హృదయాన్ని ఆకట్టుకొనేవి. సరసిజకు రాజీవ్‌పై ఆదరము ఆత్మీయత అభిమానము వయస్సుతోపాటు పెరుగుతూనే ఉన్నాయి.

రాజీవ్ బాల్యంలోనే సంస్కృత భాషా వాఙ్మయాలనే గాక ఆ భాషలోగల శాస్త్రీయ గ్రంథాలను తద్రచయితలను వారు నిరూపించిన చరాచర జగత్తుకు చెందిన సిద్ధాంతాలను తన తాత చెబుతుండగా వినేవాడు. విన్న యంశాలను మరిచిపోవుట ఆయనకు తెలియదు. తన కాసక్తి ఉన్న విషయాలను నిలువచేసికొను తలంచినపుడు వాటిని యథాతథంగా తనలో తాను పఠించుకొను శక్తిగల ఈయన జ్ఞాపక శక్తి నేటి కంప్యూటరు చేపు రికార్డును పోలి ఉంటుంది. గెలిలియో న్యూటన్ కోపర్నికస్ మొదలయిన పాశ్చాత్య శాస్త్రవేత్తలు విజ్ఞాన శాస్త్రంతో నెలకొల్పిన సిద్ధాంతాలను గూర్చిన వివరాలను తన తాత చెప్పగా రాజీవ్ విని యున్నాడు. న్యూటన్ అనే ఓ పాశ్చాత్యుడు పండ్లతోటలో కూర్చుని

ఉండగా ఆ తోటలోని ఓ ఆపిల్ చెట్టునుండి ఓ పండు తొడమునుండి విడివడి క్రిందికి పడటాన్నాయన కన్నులార చూచాడు. ఈ పండు పైకిగాని ప్రక్కలకు గానీ పోకుండా క్రిందికే పడటానికి భూమికి ఆకర్షణశక్తి (వస్తువు బరువును బట్టి తనవైపు ఆకర్షించే శక్తి) ఉన్నట్లు న్యూటన్ గ్రహించాడు. బరువు తక్కువగా నున్న వస్తువులను భూమి ఆకర్షించటంలో గూడ తక్కువ శక్తి ఉంటుంది. మరీ తేలికైన దూది పింజలు మొదలైనవాటిని భూమి తనవైపు లాగుకోదు. అందు వల్లే అవి ప్రక్కలకు పైకి గూడ పోతుంటాయనేది ఆయన నిర్ణయ సారాంశం. పాశ్చాత్య శాస్త్రకారుడయిన న్యూటన్‌కన్న ఎన్నో వందల సంవత్సరాలకు మునుపే ఈ రహస్యాన్ని సృష్టికి సహజ సిద్ధమని భారతీయ తాత్వికుడయిన భాస్కరాచార్యుడు కనుగొన్నాడు. ఈ వాస్తవాన్ని గ్రంథస్తం గావించాడు. అయితే ఈ విషయాలను వివరించే అనాటి గ్రంథాలు సంస్కృత భాషలో ఉన్నందున ఈనాటి మన కవి అందుబాటులో లేకుండా పోయాయి. అంతేగాక అంగ్లేయులు మన దేశంలో ప్రవేశపెట్టిన విద్యా విధానానికి బాధ్యత మెకాలే అనే పాశ్చాత్య పండితునకు సంబంధించినది. ఆయన తన దేశంలో ప్రచారంలో ఉన్న అంశాలనే మన దేశ భాషల ద్వారా భారతీయ బాలుర కందించే ప్రయత్నం చేశాడు. ఈ విద్యావంతులుకీ పరిజ్ఞానమే గలదు. వీరికి భారతీయుల శాస్త్ర గ్రంథాలను చదివే అవకాశం లేదు. ఎందుకంటే అవి వారికి అపరిచితమైన సంస్కృతంలో ఉన్నందున, ఇలాంటి వారికి మన సంస్కృత సంప్రదాయాలను శాస్త్రీయ పరిశోధనగల సారాంశాలను తెలియచెప్పటానికి వారి విద్యావిధానంలో చోటు లేదు. ఇంగ్లీషు చదువులకు పోయే భారతీయ విద్యార్థులను భారతీయ పండిత వరేణ్యులు ఆంగ్లేయ మానస పుత్రులని నిందాత్మకంగా పేర్కొనేవారు. వారు జన్మతః భారతీయులయినా జీవన విధానంలో విద్యార్జనలో ఆచార వ్యవహారాల్లో వారు ఆంగ్లేయు లనుకరిస్తున్నవారు భారతీయ శిఖామణుల పరిగణన. వారికి తమ తమ దేశీయులైన పండితుల సిద్ధాంత సారాన్ని తెలుప మన పండితులు ప్రయత్నం చేయకపోగా వారిపై ద్వేష భావాన్ని ప్రసరింపజేశారు. ఆనాటి పండిత వంశాల వారు ఆంగ్లేయ విద్యాభ్యాసాన్ని బహిష్కరించారు. అంటే వారు గానీ వారి సంతతిగానీ హూణ భాషను చదవకపోవటానికి పోయేవారు గాదు. ఆంగ్లేయ విద్యా విధానంవల్ల నూతనాంశాలను గ్రహించిన భారతీయ నవయువకులు సంస్కృతమునందు స్థిత ప్రజ్ఞులయిన వారిని ఛాందసులని నిందాత్మకంగా

పేర్కొనేవారు. ఛందస్ అనే వేదాలకు బదులుగా వాడే సంస్కృత పదం వాటిని వల్లెవేసేవాడనే అర్థంలో 'అ' అనే తద్ధిత ప్రత్యయం చేరనందున ఏర్పడే 'ఛాందస' అనేది వేదాల నధ్యయనం చేసేవాడనే యర్థాన్నీయజాలియుండగా దానిని క్రమంగా అర్థం భేదం వచ్చి మన భాషలో పాతకాలపు మనిషి, అనే అర్థాన్నీయజాలి ఉండటం ఈ మాటను తరచుగ ఆంగ్లేయ విద్యా విధానానికి అలవాటు పడినవారు వాడుక చేయుటమే కారణమని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ఈ విధంగా భారతీయ పండితులకు ఆంగ్ల విద్య నభ్యసించి ఈస్టిండియా కంపెనీవారి ప్రాపకం సంపాదించి వారి కొలువులో ఉద్యోగం సంపాదించిన భారతీయుల నడుమ అతిక్రమింప వీలుగాని అగాధం ఏర్పడింది. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత గూడ ఈ అగాధాన్ని మనవా రతిక్రమించలేక పోవటం శోచనీయం.

పదో తరగతి పరీక్షలై పోయాక వేసవి సెలవుల్లో ఒకనాడు రాజీవ్ హరి యింటికి వచ్చాడు. అతని రాకతో సరసిజ (హరి చెల్లెలు) వరండాలో అన్నతో పాటు కూర్చుని దిన పత్రికను చూస్తూ వెనుకకు పోయింది. ఈ విధంగా రాజీవ్‌కు కనబడకుండా నిలిచి అతన్ని చూట్టం అతని మాటల నన్నిటిని శ్రద్ధగ ఆలకించటం ఈమధ్య సరసిజకు మామూలై పోయింది. వారితో తప్పని సరైతే వెనుకనుండే మిత్రుల సంభాషణల నడుమ తను మాటను కలుపుతుంటుంది. సరసిజలో గలిగిన ఈ మార్పు నిద్దరు మిత్రులు పట్టించుకొనలేదు గాని సరసిజ తల్లి దీని యంతరార్థాన్ని గ్రహించటానికి ఎంతోకాలం పట్టలేదు.

మిత్రు లిద్దరు యథేచ్ఛగా మాట్లాడుకొంటున్నారు. ఆటలకు పోవాలంటే సాయంకాలము అయిదు కావస్తున్నా ఎండ తగ్గలేదు. అందువల్ల సూర్యుని ప్రతాపానికి భయపడి బయటకు పోలేదు. తాము తిరగేస్తున్న దిన పత్రికలో తిరుమల తిరుపతి దేవస్థానంవారు నరసింగాపురంలో నిర్వహిస్తున్న వేదపాఠశాలలో చేరే విద్యార్థుల నుండి దరఖాస్తులు కోరబడుతున్నాయనీ ప్రవేశము లభించినవారికి భోజనము ఉచితము. మరియు నెలకు నూరు రూపాయల వరకు విద్యార్థి వేతనం లభిస్తుందనీ ప్రకటన ఉంది. ఆ ప్రకటనను చూసిన హరి: రాజీవ్! వేదాల ప్రచారార్థం కోసం ఎంతగా ప్రయత్నిస్తున్నారు చూడు, కాలదోషం పట్టిన ఈ వేదాల

వింతగా ప్రయత్నపూర్వకంగా ప్రచారం చేయటం దేనికో వా కర్థం గావటం లేదు.

రాజీవ్ : దేవాలయాల్లో వేదపఠనం జరుగుతుంటుంది గదా. ఈ యంశం నీకు తెలుసుననుకుంటా. మొన్న మేము తిరుమల యాత్ర పోయినప్పుడా దేవాలయం వెనుక ప్రత్యేకించి వేద పాఠకులకు ఒక గది కేటాయించారు. అందులో అయిదారుగురు వేదాన్ని గానం చేస్తుంటారు. ఆ గానం విన సొంపుగా ఉంటుంది.

హరి : నేను తిరుమల పోయినపుడు గూడ ఆ వేదాధ్యయన విభాగాన్ని చూచాను. అంతేగాక దేవాలయం వెలుపలకు పోయినా వేదగానం వినిపిస్తూనే ఉంటుంది. తిరుమలలో ప్రధాన కేంద్రా లన్నింట ఈ గానాన్ని ప్రసారం చేయటానికి దూరశ్రవణ యంత్రాలను ఏర్పాటు గావించారు.

రాజీవ్ : నిజమే. మన వసతిగృహాల్లో విశ్రాంతి తీసుకున్నపుడు హోటల్లో భోజనానికి కూర్చున్నపుడు వేదాధ్యయనాన్ని వినే సదవకాశాన్ని తిరుమల దేవస్థానంవారు చక్కగా ఏర్పాటు చేశారు. వారు యాత్రికుల మన్ననలకు పాత్రులవుతున్నారు.

హరి : మైక్ మూలంగా ప్రసారం చేసి వేదఘోష వల్ల అందరూ ఆనందిస్తారని నే ననుకోను. నీకెలా అనిపించిందో గాని ఆ వేదగానం నాకు మాత్రం అంతగా ఇష్టంగా లేదు.

ఈ సంభాషణ వింటూ ప్రక్కనున్న హాల్లో ఉన్న సరసిజ, ఈ మాటలకు రాజీవ్ ఏ విధంగా ప్రత్యుత్తర మిస్తాడో వినాలని వేచి ఉంది.

రాజీవ్ : అలా వేదాన్ని స్వరయుక్తంగా వినే అవకాశం మనకు మరెక్కడా లభించదు. ఆ మహాభాగ్యాన్ని కల్పించి తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులు ప్రశంసార్హులని నేను మనసులో మురిసిపోయాను.

స్వరమంటే ఏమిటో రాజీవ్ క్రొత్త మాటను వాడుక చేస్తున్నట్లు సరసిజ అనుకొంటుంది. Vowels నే స్వరాలంటారసీ అచ్చులకు పర్యాయ పదం స్వరమనీ నేను, ఆరో తరగతిలో తెలుగు మాస్టారు చెప్పగా విన్నాననుకుంటా,

సరసిజ స్ఫురణకు వచ్చినట్లు ముఖాన్ని విస్ఫారజేసి సంగీతంలో వస్తుండే స్వరాలు ఉంటాయని అనుకుంటుంది.

హరి : ఉదాత్త అనుదాత్తాది భేదాలు గల స్వరాలు వేదాల భాషలో ఉన్నాయి. స్వరం మారితే వచావికున్న అర్థం మారుతుంది. ఇంద్ర శత్రు అనేది దీని కుదాహరణము.

రాజీవ్ : ఈనాటి వ్యవహారంలో లేని స్వరవిశేషాలున్న వేదాల నధ్యయనం గావించటం కష్టంగదా. స్వరయుక్తంగ చదవాలి. గాబట్టి అశ్రుతు లయినాయి. మన గ్రంథాలను వలె వాటిని చూచి చదువుటకు వీలు గాదు. లేఖన చిహ్నాల కతీతంగా స్వరం ఉంటుంది. ఆ స్వరం గురు ముఖతః విని సంత చెప్పుకుంటే గావి అలవాటు గాదు. వేదాలను పరిరక్షించాలని భాషా విషయకమైన క్లేశం వల్ల వేదాలను రానున్న తరాల వారికి అందుబాటులో లేకుండా పోతాయనే భయంతోనే వేదాంగాలను ఏర్పాటు చేశారు. ఈ షడంగాల పరిశీలన వేదాన్ని స్వర యుక్తంగా పఠనం గావించటానికీ దాని యర్థాన్ని గ్రహించటానికీ ఉపయోగపడుతుంది.

హరి : వేదాధ్యయనం చేసేవారికి దాని అర్థం తెలియదని చాలమంది అంటుంటారు గదా.

రాజీవ్ : బాల్యంలో ధారణాశక్తి ఉన్న వయస్సులో వేదాల నధ్యయనం చేస్తే తదనంతరం అనుభవం వల్ల వేదాల అర్థాన్ని తెలుసుకోవటం సాధ్యమవుతుంది. నేను చిన్నతనంలో అమరకోశంను మా తాత చెప్పగా (సంత) వల్లించాను. అపుడు నా దృష్టి అమరాన్ని నెమరు వేయుటకు పరిమితం. తదనంతర వయస్సుతో బుద్ధికి వైశద్యం గలిగినందున అమరంవల్ల కావ్యార్థాలాలను గ్రహించటం సులభమని గ్రహించాను.

హరి : చిన్నతనంలో నేర్చిన విద్య అపుడు కావ్యార్థాన్ని గ్రహించటంలో సహాయం చేయక పోయినది కాలాంతరంలో ఎలా సాయం చేస్తుంది.

రాజీవ్ : సమానార్థకాలయిన పదాలను ఛందోబద్ధ రచనవల్ల మనం నేర్చుకొను గుర్తు పెట్టుకొను అనువు పడుతుంది. సమానార్థకాలన్నీ మన

అధీనంలో ఉన్నందున ఏ కవి అయినా ఏ పదాన్నయినా కొత్తగా ప్రయోగించునట్లు మన కనిపిస్తే వెంటనే మన మెమరీలో ఆ పదానికి తుల్యార్థకం స్ఫురణకు వస్తుంది గాబట్టి కొత్త పదానికి అర్థాన్ని గ్రహించ గలుగుతున్నాం.

రాజీవ్ చెప్పే ధోరణి తనకు అగమ్యగోచరంగా నున్నట్లు సరసిజ కనిపిస్తుంది. తన వాదాన్ని నెగ్గించుకోవటంలో రాజీవ్‌కు మంచి నేర్పుందని ఇట్టి వారు వాద ప్రతివాదనంతో నిండి వుండే న్యాయశాస్త్రంలో పారంగతులయితే అన్ని కేసులను తన కనుకూలంగా మలచుకొని విజయాన్ని సాధిస్తారని అను కొంటుంది, అయినా రాజీవ్ భవిష్యత్తును గూర్చిన వివరాలను తానింతగా ఆలో చింపటం దేనికా అని ఆమె కనిపించింది. అతణ్ణి తానెరుగును. చిన్నప్పటినుంచి కలిసి చదువుకున్నాం. అయితే మాత్రం కలిసి చదువుకున్నంత మాత్రాన ఆసక్తి కలుగుతుందా? తనతోపాటు కలిపి చదువుకున్న వారెందరు లేరు. వారందరిని గూర్చి ఇంతగా ఆలోచించనే, అయితే ఈతడు తరచుగ తన యింటికి వస్తుం టాడు. తరచుగ తన ఇంటికి వచ్చిన తనతో అరమరకల్లేకుండా ఎంతో చను వుగా కాలం గడపటమేగాక తన తల్లితో చనువుగా మాట్లాడే వనజ మొదలయిన తనతోటి విద్యార్థిను లున్నారుగదా – వారిపై తన కింత ఆప్యాయత మమత ఉందా. వారు ఆడువారు అయితే స్నేహం విషయంలో ఆడ మగ తేడాలుంటాయా అయినా తాను బాలిక గావున తోటి బాలికలతో ప్రగాఢమైన ప్రేమ ఆప్యాయత గలిగి ఉండటం సమంజసం. అలా గాకుండ తాను రాజీవ్‌ను తన అన్నకన్న తన తోడి విద్యార్థినులయిన వనజ మొదలయిన వారికన్న ప్రగాఢంగా ఆత్మీయతా భావంతో తలచటం. అతడు పురుషుడు తాను స్త్రీనయినందున గాబోలు అని అనుకోబోయి వెంటనే ఆ భావాన్ని గూర్చి విపులంగా చర్చించకుండానే ఆ యాలోచనలకు సుదూరంగా పారిపోయింది మానసికంగా. తాత్కాలికంగా తప్పించుకు పోవటం సమస్యకు తగు పరిష్కారం గాదని ఆమెకు తెలుసుగాని అసలు సమస్య ఏముంది గనుక అవి తన్ను తాను సరిపెట్టుకో ప్రయత్నం చేసింది.

హరి : ఎప్పుడో గ్రహించగలమవి ఇప్పుడు అర్థంగాని వేదాల నధ్యయనం గావించట్లం మంచిదంటావా, వేదంను నేర్చుకునేవారి వేషాది నియ

మాలే గాక తెల్లవారుజామున (రాత్రి చతుర్థయామంలో) చన్నీటి స్నానం చేసి అర్థంగాని వేదాల నధ్యయనం చేయుట విలువైన కాలాన్ని వ్యర్థం చేయటాన్ని నీవు సమర్థిస్తున్నావన్న మాట.

రాజీవ్ : సమర్థించటమంటే అలా క్లేశాన్ని అనుభవిస్తూనే వేదాధ్యయనం చేయటం మన సంప్రదాయము. ఈ సంప్రదాయాన్ననుసరించి మనవారెంతో కాలంగా ఈ వాఙ్మయాన్ని కాపాడుతున్నారు. వీటిని అపౌరుషేయాలని వారు నమ్మారు.

హరి : అపౌరుషేయమంటే ఏమిటి?

నే నడగదలచుకున్న ప్రశ్ననే అన్న అడిగాడని సంతసించిన సరళ రాజీవ్ సమాధానం కోసం వేచి ఉంది.

రాజీవ్ : వేదాలకు కర్తలెవరో తెలియదు. సాక్షాత్తు భగవంతుడే ఈ వాఙ్మయాన్ని నిర్మించి మానవజాతి కందించాడని మన ప్రాచీన మహర్షులు విశ్వసించారు.

హరి : భగవంతుని స్వరూపాన్ని మీరు చూశారా?

రాజీవ్ : చూచినవారెవరు లేరు. కాని వారి వారి వ్యక్తిగతానుభవాలవల్ల దివ్యమూర్తి నూహించారు. ఈ ఊహలందు వ్యక్తి నిష్ఠమైన వైవిధ్యం ఉన్నందున మనం త్రిమూర్తులు మొదలైన దివ్యపురుషులను ఊహించాం.

హరి : ఊహ వాస్తవం గాదు.

రాజీవ్ : వాస్తవం అయ్యే ఊహ లెన్నో ఉన్నాయి. క్రింద పడిన ఆపిలును చూచి భూమికి ఆకర్షణశక్తి గలదని ఒక పరిశీలకు డూహించాడు. ఆ ఊహ నూటికి నూరు పాళ్ళు వాస్తవమయినది గదా. ప్రాచీన వేదాలకు ఆధునిక విజ్ఞాన వికాసానికి ఊహలే మూలాధారమనే అంశం మరువరానిది.

హరి : వేదాలు వాస్తవాలయితే శ్రుతులుగా ఉన్నాయేం అచ్చు వేయవచ్చుగా.

రాజీవ్ : అచ్చువేసినా ఉదాత్తాది స్వరాలను తెలియచేయటానికి ముద్రణా యంత్రంలోని సంకేతాలు లేనందునా అచ్చయినా దాన్ని స్వర

యుక్తంగా చదవటం వీలుగాని విషయం. పూర్వీకుల నుంచి తరువాత వారికి వాఙ్మయాన్ని విని సిన్న స్వరాన్ని పలుమార్లుచ్చరించి మూల రూపానికి భంగం గలుగనంతవరకు దాని ఉచ్చారణను నేర్చుకోవలసి ఉంటుంది. వైదిక స్వరానికి ఏదో చిహ్నాలను ఏర్పాటు గావించి వేదాలనీ నడుమ ముద్రించారు. వాటిపై స్వరం ఉన్నదని గుర్తించగలమే గాని దాన్ని వేదోక్త రీతిని ఉచ్చరించట మంటే మరల మనం స్వరోచ్చారణ నెరిగిన పండితుల నాశ్రయించవలసిందే.

హరి : స్వర భేదం గుర్తించామనుకో దానివల్ల ప్రయోజనం ఏం వస్తుంది?

రాజీవ్ : స్వరాన్ని బట్టి పదార్థం మారుతుంది.

హరి : అలా అర్థ భేదం గల పదాలను నీవు ఒక్కదానైనా చెపుతావా.

రాజీవ్ : ఆర్ష విజ్ఞాన సర్వస్వంలో ఈమధ్య ఇలాంటి పదాలను గుర్తించాను. "జయ" అనేది అంత్య ఉదాత్తమయినపుడు వచ్చే అర్థంకన్నా అద్యుదాత్తమయినపుడు అంటే జకారం ఉదాత్తమయితే దీన్ని మధ్యమ పురుషైక వచనమయిన 'లోట్' రూపంగా గుర్తిస్తారు. ఓ యింద్రా నీవు జయింతువు గాక అని అర్థం. 'జయ' అనే పదమే అంత్యోదాత్తమయితే యకారంపై ఆకారం ఉదాత్తత గలిగి (అద్యుదత్తాం లోపిస్తే)తే జి + అ = జే + అ = జయ్ + అ = జయ అని తెల్సుకోవాల్సి ఉంటుంది. క్రియాపదమయిన జయ మధ్యమ పురుషైక వచనంలో లోట్‌లో ప్రత్యయం లోపించింది. అందువల్ల అలా ఏర్పడి ప్రథమ పురుషైక వచనంలో 'జయకు, 'డు' చేరి "జయడు" అని అవుతుంది.

హరి : ఇన్ని వివరాలు నీ వెలా గ్రహించావు.

రాజీవ్ : మా తాత సంకలనం గావించిన గ్రంథ పరిచయంలో, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రచురించిన "ఆర్ష విజ్ఞాన సర్వస్వము"నే ఒక పుస్తకముంది. దాన్లో విషయాలన్నీ సులభమైన సరళిలో ప్రచురితాలై ఉన్నాయి.

హరి : అలాంటి గ్రంథాల నింత శ్రద్ధగా చదివిన నీ పట్టుదల ప్రశంసనీయం. ఇలాంటి పుస్తకాలను చదువుతూ కాలాన్ని గడపకుండా

అప్పుడు గూడ పాఠ్యాంశాలనే చదివితే రాజీవ్ తరగతిలో ఇంకా ఎంతో గొప్పవాడై ఉండేవాడు. ఇప్పటికే ఆయనతో పోటిపడేవారికి పరాజయమే లభిస్తుందని సరజిత అనుకుని అయినా తన కెందుకు అతని గూర్చి ఆలోచన అని సర్దుబాటు చేసుకునే ప్రయత్నం చేస్తుంది.

రాజీవ్ : ఈ వయస్సులో పట్టుదల ఉన్నా చేయగలిగింది లేదు. ఇప్పటికే వేదాధ్యయనం గావించటానికి ప్రవేశించేవారి క్కావలసిన అర్హతలన్నీ నాకు సరిపోతున్నాయి. కాని వయస్సు మాత్రం దాటిపోయింది.

ఇంతలో సరసిజ కల్పించుకుని చదివి ఏం చేయాలి అని అంటుంది. అప్రయత్నంగా లోపలి నుంచి వెలువడిన ఈ మాటతో ఆశ్చర్యచకితు డయ్యాడు రాజీవ్. నీ వింతసేపు ఇక్కడే ఉన్నావా సరసిజ. లోపల ఉండే బదులు ఇక్కడే కూర్చుని ఉండవచ్చును గదా అని అతర్కితంగా రాజీవ్ నోటివెంట మాటలు వెలువడినాయి. వరండాలో మరీ ఎండ తగులుతుందని ఇక్కడ ఉన్నానని ముక్తసరిగా సమాధానం చెప్పి సరసిజ తప్పించుకుంది. అంతటితో అగక రాజీవ్ విషయంలో వివిధ దృక్కోణాల నుంచీ సరసిజ ఆలోచించకుండా ఉండలేకపోయింది రాజీవ్ చెప్పినట్లు తాను వారితో పాటు వరండాలోనే కూర్చోవచ్చు గదా. తన్ను అలా కూర్చోవద్దని అంత విధించినవారెవరు లేరు గదా. తనకు తానే అంత విధించుకొంది. మాటలను వినటంలో ఆయన ముఖాన్ని అందలి విభిన్నావయవాల పొందును వాని తీరు చూడాలనే విషయంలో ఆమెకు ఉత్సాహం చాలా ఉంది. అపుడే వస్తూ ఉన్న రాజీవ్ మీసాల పొందును చూడాలనే కోర్కె బలవత్తరంగా ఉంది. ఆయనకు తెలియకుండ ఆ వ్యక్తిని చూడాలని అతని మాటలను వినాలని ఉంది. ఆ వ్యక్తిపై ఆధారాభిమానాలు ఉన్నాయి. కాని సిగ్గుతో కూడి ఉన్నాయి భావాలు. ఈ భావాలను ఆచరణలో ప్రదర్శించకుండ రహస్యంగా ఉంచటానికి ప్రబలము పరిగణనీయము అయిన కారణం సిగ్గు. రాజీవ్ విషయంలో సిగ్గు గలుగుతుందంటే తాను ఏదో బలవత్తరమైన దౌర్బల్యానికి గురి అవుతున్నాననే ఆందోళన సరసిజను కలవరపరుస్తుంది. ఈ యాలోచనా పరంపరతో సతమతమవుతున్న సరసిజ తన ప్రశ్నకు రాజీవ్ చెప్పిన సమాధానం శ్రవణయంత్రాంగానికి ఎల్లంగా తగిలింది. శరీరం ఆలోచనా వ్యగ్ర మయినందున రాజీవ్ మాటలు

మామూలు ధోరణిలో ఉన్నప్పటికి తన ఏకాగ్రతను భగ్నం చేస్తూ సున్నితమయిన ఆమె మనస్సును కలవరపరిచాయి

రాజీవ్ : నీ ప్రశ్న వింతగా ఉంది సరసిజా. మనం విద్యను నేర్చుకోవటంవల్ల ప్రయోజన మేమిటని నీవు ప్రశ్నిస్తున్నావు—అంతేనా.

సరసిజ : (లోపలి నుంచే) వేదాభ్యాసంవల్ల ప్రయోజన మేముంటుందని నా సందేహం.

రాజీవ్ : వేదాభ్యాసం విద్యగాదా.

సరసిజ : విద్య గావచ్చు గాని దానివల్ల మన కీ సంఘంలో గౌరవాలుండక పోవటమే గాక తగిన జీతం తెచ్చిపెట్టే ఉద్యోగం కూడ రాదు అని నా కనిపిస్తుంది.

రాజీవ్ : మన ప్రాచీనులు మహాగ్రంథాలుగా తలంచి మనకోసమై దాచిపెట్టిన గ్రంథాలను చదవటంవల్ల సంఘం మనలను చులకన చేస్తుందనుకోవటం సరిగాదు. అలా ఎవరైనా అంటే తమను తాము అవమానించుకొనుటయే గాని వేరు గాదు.

సరసిజ : ఒక కాలంలో సంఘంలో వేదాలకు గౌరవం ఉండి ఉండవచ్చు. కాని ఇప్పుడు అలా కాదు. డబ్బు లేని విద్య దారిద్ర్యహేతువనే మాట నీకు తెలియనిదికాదనుకుంటాను.

రాజీవ్ : వ్యక్తి సామర్థ్యాన్ని బట్టి ఉద్యోగం గానీ ధనలాభం గానీ ఉంటుంది. మన వృత్తిని బట్టి గాదు.

సరజిత : వేదాలు చదువుకున్నవారికి వైద్యవాస్తు శాస్త్రాల్లో ఉత్తీర్ణులయినవారికి వలె ఉద్యోగావకాశాలు లేవు గదా.

రాజీవ్ : వేదాభ్యాసం చేసినవారికి ఉద్యోగావకాశాలు పరిమితం. ఆ ఉద్యోగాలకు ప్రయత్నం చేసేవారు కూడ తక్కువే. వైద్యవాస్తు శాస్త్రాల్లో నిష్ణాతులు అధిక సంఖ్యలో ఉంటారు. వారికి ఉద్యోగావకాశాలు కూడ అధిక సంఖ్యలో ఉంటాయి. సమర్థుల కెందులోనయిన ఉద్యోగం లభిస్తుందనేది వాస్తవమయిన యంశం.

రాజీవ్ వాదనలో హేతుకత ఉన్నప్పటికీ సరసిజకు మాత్రం ఆ వాదం రుచించలేదు. ఇంతలో ఆయన విషయంలో సర్లిప్తతను కలిగించుకుని ఆ మాటలను మరిపిపోటానికి ప్రయత్నించింది.

హరి : వైద్యశాస్త్రంలో చదువు వేదాధ్యయనం తుల్యం అనే ఉద్దేశమా.

రాజీవ్ : భారతీయులమయిన మనం వేదాధ్యయించి యందలి వైశిష్ట్యాన్ని దేశ దేశాలవారికి తెలియజెప్పటం మన కనీస ధర్మం. అందువల్ల ఆధునిక సంప్రదాయానుగుణంగా వెలుగులోకి వచ్చిన వైద్య వాస్తు శాస్త్రాల అధ్యయనంకన్న మనం వేదాల నధ్యయనం గావించటం చాలా ముఖ్యం.

హరి : ఆధునిక మయినంత మాత్రాన మనం అధునిక ప్రపంచమంతటా ప్రచారంలో ఉన్న వైద్యాది శాస్త్రాలయెడ తిరస్కార భావం తగునా.

రాజీవ్ ; అలా అని నేననను. మానవజాతి తరతరాల తరబడి కృషిచేసి సాధించిన విశేషాంశాలే నేటి వైద్యాది శాస్త్రాలు దీని ప్రాధాన్యాన్ని నేను కాదనను. దీన్ని గుర్తించటం చదువుకున్నవారి బాధ్యతల్లో ముఖ్యమయినదే. ఆంగ్ల పరిభాషలో దీన్ని "achievment of human civilisation" అని పేర్కొంటారు. దాన్ని గుర్తించటం మనందరి యొక్క కనీస ధర్మం.

హరి : ఆర్తుల నాదుకుంటున్నది నేటి వైద్యాది శాస్త్రాలేగాని వెనుకటి కాలం వారు తలదాల్చినవిగ తలంచుచున్న వేదాలు తదంగాలు గాదనే విషయంలో నీ యభిప్రాయ మేమిటి.

ఈ ప్రశ్నకు రాజీవ్ చెప్పే ప్రత్యుత్తరానికి సరసిజ ఎదురు చూస్తుంది.

రాజీవ్ : ఆధునిక శాస్త్ర విజ్ఞానం సర్వజనులకు ఉపాదేయమే. అంతకన్న ముఖ్యమయిన మరో బాధ్యతను మనం మరువరాదు. నీ పూర్వము అంటే తాతకు తాత తాతకు ఈ విధంగా పోను పోను వారికి నేటి విద్యుత్తుగాని దాంతో చేసిన పరికరాలుగానీ లేవు. కాని విద్యుత్తు లేకున్నా మరో విధానంతో వారు తమ తమ విత్యావసరములను తీర్చుకున్నారు. అలాంటి సంప్రదాయం గౌరవనీయం ఒకనాటి

సంఘానికి వేద ప్రతిపాదితాంశాలు ఇహలోక పరలోక సుఖాలకు మార్గ దర్శకంగా ఉన్నాయనటం నిర్వివాదాంశం. సాంప్రదాయకమైన ఈ యంశాలను తెలిసికొనుట అందలి వైశిష్ట్యాన్ని, అనాటి దేశ కాల దృష్ట్యా గుర్తించి దేశ విదేశాల వారికి తెలియచేయటం మన మంద రము చేపట్టవలసింది ఉంది. వేదాల ఘనతను వేషభూషి వారు విదే శీయుల మూలాన తెలుసుకునే నేటి పరిస్థితి భారతీయులకు లజ్జా జనకం కాకపోవటం నాకాశ్చర్య సంధాయకంగా ఉంది. వేదాలు మన జాతీయ సంపద. ప్రాచీన భారతీయుల ప్రతిభకు ప్రబలమైన ఉదాహరణాలు. దీన్ని ఆంగ్లంలో చెబితే Oriental glorious heritage, అని గుర్తించాలి. మన సంప్రదాయంను గుర్తించటం భారతీయునకు ప్రప్రథమ కర్తవ్యం. విద్యావంతు లీ విధానాన్ని మరవటం వారికి తాను కించపరచినట్లవుతుంది. ఈ ప్రపంచం ఉన్నంతవరకు ఈ మానవ సంఘం రచించిన గ్రంథాలలో ప్రప్రథమ స్థానం (కాలం దృష్ట్యా) వేదాలకే దక్కింది. అందులోను ఋగ్వేదం మొట్టమొదటిది.

రాజీవ్ ప్రతిపాదించిన యీ యంశాలు శిరోధార్యాలుగా సరసిజకు కనిపించి నాయి. ఇతర దేశీయుల నాగరికతతో కొట్టుమిట్టాడుతుండగ మనవారు మన సంఘంలో ద్వేషాది భావాలను తగ్గించను, శాంతియుత సహజీవనాన్ని సాగించ టానికి వేసిన రాచబాట వేదాల్లోనే ఉన్నట్లు ఆమెకు తెలుసు. కాని ఈ మార్గంలో తనకున్న తెలివి తేటలను కాలాన్ని రాజీవ్ వ్యయం చేయటం మాత్రం ఆమెకు సమ్మతంగాదు. ఈ భావన రాగానే తన కింతగా రాజీవ్‌ను గూర్చి ఆలోచనా పరంపర ఏలా అని అనిపిస్తుంది.

హరి : వేద వాఙ్మయం కాలదోషంవల్ల సులభ గ్రాహ్యాలు గాకున్నా వాటిని చదివి మనం ఇతరత్ర లేని అంశాల నేమి గ్రహించగలుగుతున్నామో నాకు కొంచెం వివరిస్తావా.

రాజీవ్ : హరీ! మనం విద్యార్థులం గాబట్టి మనం వేదాల్లో విద్యార్థి ఉపాధ్యాయు లకు పరస్పరంగల అవగాహన, ఆత్మీయత ఆదర భావం కొంత తెలుసుకుందాం. బడిలో ప్రాతఃకాలం చేసే ప్రార్థన విద్యార్థులు ఉపా ధ్యాయులు కలిసి ఏక కంఠంతో చేస్తుండటం విశేషం. ఇప్పటి వారులా

విద్యార్థులు ప్రార్థన చేస్తుండగా వారి ఉపాధ్యాయులు పిచ్చా పాటీ మాట్లాడుకుంటూ విద్యార్థుల ఏకాగ్రతకు భంగం కలిగించే విధానం ఆనాడు లేదు. ఆనాడు మనలను (మనిద్దరకు అంటే శిష్య బృందాన్ని ఉపాధ్యాయ మండలిని) పరమాత్ముడు రక్షించును గాక (సహనావవతు) మన మిర్వురము శిష్య ఉపాధ్యాయ బృందం కలిపి మెలిసి ప్రవర్తిస్తూ మన మానసిక శరీర బలాన్ని పెంపొందించు కొందుము గాక. మనము ఆహార విషయమునందు కలిపి మెలిసి ఉంటూ సహపంక్తి భోజనంను నిర్వహింతుము గాక (సహనౌ భునక్తు - సహవీర్యం కరవావహై) చివరి మాట చాల ముఖ్యమయింది. విద్యార్థులకు ఉపాధ్యాయులకు వైమనస్యము ద్వేషము కలహము తలయెత్తకుండును గాక (మా విద్విషావహై) అనేది మిక్కిలి ముఖ్యమయినది.

హరి : గురు శిష్యులకు ఇంతటి ఆప్యాయత ఈనాడు లేదు గదా.

రాజీవ్ : లేదని గాదు. ఈ భావన ఈనాడు మన దేశంలో నిత్య వ్యవహారాలలో గానీ విదేశాలలో గాని ఆచరణలో ఉండి ఉండవచ్చు. అయితే ఈ సందర్భంలో గుర్తించవలసిన అంశం ఒక్కటుంది హరీ! ఈ విధమైన భావన అతి ప్రాచీనమయినదనీ దీన్ని మొదటిసారిగా ఆచరించి తక్కిన వారికి ఆదర్శమూర్తులయినవారు వేదకాలమునాటి భారతీయులు అనేది మన దేశీయు లా కాలంలో అనుసరించిన విద్యావిధానంలో ప్రత్యేకత ఉంది.

హరి : ఏమిటా ప్రత్యేకత. గురువు శిష్యుడు ఉమ్మడిగా చేసే ప్రార్థన కలపి నిర్వర్తించే భోజనాదికాలను నీ వింతకు మునుపే వివరించావు.

రాజీవ్ ; నే నిప్పుడు చెప్పబోయేది విద్యావిధానంలో అంటే విద్యాభ్యాసంలోని ప్రత్యేకత.

హరి : వేదలను వల్లెవేయించటమేగా ఆ నాటి గురువు శిష్యుని కిచ్చే శిక్షణ.

రాజీవ్ : వేదయుగం అనూచానంగా నేటికీ సాగుతునే ఉంది. అంతకు మించి ఎన్నో శాస్త్రాలను తరువాతి కాలాల్లో అధ్యయనం గావించారు. అందులో ఉపాధ్యాయుడు చెప్పిన యంశాలను నేటివలె వినటమే గాక

తనకు కలిగిన సందేహాల నెప్పటికప్పుడే ప్రశ్న రూపంగా గురుని దృష్టికి తీసుకొస్తుండేవాడు నాటి విద్యార్థి. ఈ విధంగా తన ఉపన్యాస ధోరణికి ఆక్షేపాత్మకమయిన శిష్యుని ప్రశ్నలను సహనంతో సాను భూతితో పరిశీలించి సమాధానాన్ని ఇస్తుండేవాడు. ఈనాటి ఉపా ధ్యాయులు వలె నాటి వారు శిష్యుల సందేహాలకు తావీయకుండ ఉండే వారుగాదు.

హరి : ఈ సందర్భంలో నా కొక సన్నివేశం గుర్తొస్తుంది.

రాజీవ్ : దేన్ని గురించిన సన్నివేశమది.

హరి : విద్యార్థి ప్రశ్న వేస్తే (ఉపాధ్యాయునిలో) మా తరగతిలో ఒక రోజున జరిగిన సన్నివేశం. ఆ రోజు నీవు ఏవో డిబేటింగ్‌లో పాల్గొన పోయినందున నీ కా సన్నివేశం తెలియదనుకుంటా

రాజీవ్ : నేనా నాడుంటే నీవు చెప్పకున్నా నేను వెంటనే స్ఫురణకు తెచ్చు కునేవాణ్ణి.

హరి : మన తరగతిలో నాలుగో బెంచీలో మొదటి సీటులో కూర్చునే రవి, గుర్తే గదా. వాడొకనాడు లెక్కల తరగతిలో ఓ సందేహాన్ని వెలి బుచ్చాడు.

రాజీవ్ : ఏ మా సందేహం

హరి : $\pi$ (పై) అంటే 22/7 అంటారు గదా దీని క్కారణమేమిటని?

రాజీవ్ : నిజమే. ఈ ప్రశ్నకు నా కింతవరకు సమాధానం తోచలేదు. దాని కా మాస్టరేమన్నాడు.

హరి : ఆయన అన్న మాటలు నా చెవుల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. ఆయన లాల్చీ మడతలు సవరించుకుని సావధానంగా, నా సర్వీసంత లేదు నీ వయస్సు. నన్ను నీవు ప్రశ్నలడుగుతావా. అని 'రవి' వైపు తీక్షణంగా చూచి ఊరుకున్నాడు.

రాజీవ్ : రవి ఏమనుకున్నాడో.

హరి : ఆయన సర్వీసెంతయినా నా యీ చిన్న సందేహాన్ని తీర్చలేక పోయాడే అనుకున్నాడు క్లాసు నుంచి బయటకు వచ్చిన తరువాత.

రాజీవ్ : ఇప్పుడు నీకు తెలిసింది గదా ప్రశ్నలకు ఈనాడు ఉపాధ్యాయులిచ్చే సమాధాన ధోరణి. ఆ నాడు భారతీయ విద్యావిధానం ఇలా సాగలేదని నీవు గుర్తించాలి. అడుగడుగున విద్యార్థి ఉపాధ్యాయుని మాటలను ఆక్షేపిస్తుంటాడు. వాటి కన్నింటికి ప్రశాంత చిత్తంతో ఉపాధ్యాయుడు సమాధానాన్ని సవివరంగా చెబుతుండేవాడు. ఈ విధంగా (ఆక్షేప సమాధానాత్మకంగా) సాగిన విద్యా బోధనకు భాష్యమని పేరు. ఇలాంటి వర్గంలో గొప్పగా ప్రశంస అందుకున్న గ్రంథం మహాభాష్యం. ఇది వ్యాకరణానికి సంబంధించిన గ్రంథమయినందున దీనికి వ్యాకరణ మహాభాష్యం అని నామకరణం చేశారు. దీని కర్త పతంజలి. అంటే ఈ గ్రంథంలో ఉపాధ్యాయ స్థానంలో ఉన్నవాడు పతంజలి. శిష్యులనేకులు బహు సంవత్సరాలు జరిగిన చర్చకు గ్రంథ రూపం భాష్యం. అందులో ఆక్షేపణలను నిరూపించినవారిని గూర్చిన వివరాలు తెలియరావు. ఆక్షేపించేవారు విద్యార్థులు. దేశకాలాన్ననుసరించి వీరసంఖ్యాకంగా ఉండటమే గాక వివిధ వర్గాలకు వయస్సుకు సంబంధించినవారు.

హరి : భాష్యం అంటే నేను మామూలు వ్యాఖ్యానమనుకుంటాను.

రాజీవ్ : అయితే ఆ రెండింటికి భేదమేమిటనే దృష్టి నీకు కలగాలి గదా. పద విభాగం తదర్థ వివరణ అందలి సమాసాదులకు గూర్చిన చర్చ వ్యాఖ్యానం భాష్యం. అంటే ఆక్షేప సమాధాన పరోగ్రంథోభాష్యమ్, అని మనవారి సిద్ధాంతం.

ఇంతగా సంస్కృత గ్రంథాలను పరిశీలించి లోతుపాతులను తెలుసుకోవటం కంటె ఈ కాలాన్ని తన పాఠ్యగ్రంథాలకు వెచ్చిస్తే బాగుండునని సరసిజకు అనిపించినా ఆ భావాన్ని వ్యక్తం చేయకుండా విదానించింది.

# 3

వెనుకటి కాలంలో మన దేశంలో సాగిన విద్యావిధానం ప్రశస్తమని సరసిజకు తెలుసు. తాను వ్యక్తృత్వ పోటీల్లో పాల్గొన్నప్పుడు 'ఉన్నత విద్య' నాడు నేడు, అనే అంశంపై ఎంతో విషయసేకరణ గావించింది. తనకు చిన్నతనంలో విద్యాభ్యాసం గావించిన "గాయత్రి" అనే టీచర్ నుంచి ఆనాడు చాలా విషయాలు సరసిజ తెలుసుకోవటమే గాక ఆ నాడు వ్యక్తృత్వ పోటీల్లో పాల్గొన్న విద్యార్థులు చర్చించిన అంశా లనేకం ఆమె మనోనేత్రానికి గోచరమయినాయి. ఈ వివరాలను గూర్చి చెప్పే ముందు సరసిజకు టీచర్‌గా ఉండి ఆమెకు గల విద్యావిజ్ఞాన తృష్ణను ముఖ్యంగా భారతీయ సంస్కృతిని గూర్చి ఎన్నో విషయాలను వివరించిన గాయత్రిని గూర్చి ప్రసంగం గావించటం అప్రస్తుతం గాదు.

గాయత్రి ఈ నడుమనే ఉపాధ్యాయ వృత్తి నుండి విరమించింది. విశ్రాంతి తీసుకుని ఒకే ఒక సంవత్సరమయినందున ఆమె వయస్సును గూర్చి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఆమె రూపాన్ని గూర్చిన వివరాలు మనకు అప్రస్తుతం. ఆమె సంప్రదాయానికి ప్రాధాన్యమిస్తుంది. ప్రాచీన కాలంలో భారతీయ స్త్రీలనే అంశంపై ఎంతో కృషి గావించింది. ఎన్నోమార్లు ప్రసంగాలు చేసేది ఏ మాత్రం వ్యవధి దొరికినా ఆ నాటి స్త్రీకి గల స్థానాన్ని చర్చించటమే గాక ఆ పరిస్థితులతో నేటి స్త్రీని పోల్చి చర్చిస్తుండేది. ఈనాడు స్త్రీ విషయంలో సంఘం దృష్టి యింత మారటానికి వీరేశలింగము మొదలయినవారి పాత్ర ఎంతైనా గలదని ఆమె నొక్కి చెబుతుండేది. ఆంగ్లేయులతో మనకు గలిగిన సంపర్కము వారి విద్య నధ్యయనం గావించటం వారి ఆచార వ్యవహారములను మనం మననం చేయటం అందులో మన కనువయిన వాటిని మాత్రం మన సంఘానికి సమన్వయించటం ఈ మార్పులకు మూలమని ఆమెకు బాగా తెలుసు. ఆమెకు ఆంగ్లంతో పరిచయ ముంది గాని సంస్కృతం రాదు. సంస్కృతంలో గల సాంఘికాది ఆచారాలను వివరించే ఆంగ్ల గ్రంథాలను ఆమె విశేషంగా అధ్యయనం గావించింది. తెలుగులో ఇలాంటి గ్రంథాలున్నా ఆమె చూపు ఆంగ్ల గ్రంథాలవైపే మొగ్గుతుండేది. ఆంగ్లేయ రచయితలు భారతీయులయినా విదేశీయులయినా వాస్తవాన్ని మిక్కిలి

సున్నితంగా తెలియచేస్తారని ఆమె విశ్వాసం. తెలుగు రచయితల్లో ప్రసన్నత గానీ సులభగ్రాహ్యత గానీ లభ్యం గావటంలేదని ఆమె విశ్వాసం.

ఆంగ్లేయ సంస్కృతిపైన ఆ భాషలో రచయితమయిన గ్రంథాలపైన సరసిజకు మిక్కిలి గౌరవభావం ఉంది. తెలుగు గ్రంథాలను అంతగా ఈమె చద వదు. సంస్కృత భాష ఈమెకు రానే రాదు. తనకు రాని సంస్కృత భాషను గూర్చిన ప్రసంగాన్ని 'రాజీవ్' చేయటం కొంత ఉత్సాహాన్ని గల్పించినా ఈ ప్రాచీన భాష కోసం కాలం వ్యర్థం చేయటం సరిగా లేదని ఆమె తలంపు. 'భాష్యం' అనే పదానికి ఉన్న అర్థాన్ని రాజీవ్ వివరించినపుడు ఆ యంశాలను విన్న సరజిజకు ఆశ్చర్యంతో పాటు తమకు తెలియని యంశాలను వివరిస్తున్న రాజీవ్ నధిగమించాలనే ఉద్దేశం లీలగా కలిగింది. తా నే విషయంలోనూ రాజీవ్‌కు తీసిపోరాదని సరసిజకు నిగూఢంగా ఉన్న అభిప్రాయం రాజీవ్ తన కిలాంటి అభి ప్రాయం గలగడానికి కారణం ఏమిటి. సరసిజ ఆత్మ విమర్శ గావించుకోవటం లేకపోలేదు. దీనికి కారణం తెలియరాదు. అట్లని ఆ అభిప్రాయాన్ని తన మనస్సు నుంచి తొలగిపోవటం లేదు. ఇదొక తెలిసీ తెలియని ఊహ. ఈ ఊహ నింకా సుదూరం పొడిగించి ఆ భావ పరంపరలో కొట్టుకుపోకుండా ఉండాలంటే దాన్ని అంతటితో ఆపాలని ఆమె భావిస్తుందేది.

ప్రాచీన భారతదేశంలో విద్యావిధానాన్ని గూర్చి ఆలోచించటం తాను విన్న యంశాలను జ్ఞప్తికి తెచ్చుకోగా—వెంటనే ఈ సందర్భంలో గాయత్రి టీచరు చెప్పిన విషయాలు పరంపరగా మనస్సులోకి వస్తున్నాయి. అందులో ముఖ్యమయ్యిందీ, సరసిజ మనస్సులో నాటుకుపోయిందీ, కౌత్సుడనే వాని విద్యా భ్యాసం ఈ వృత్తాంతం దిలీపుని కొడుకూ దశరథునకు తండ్రి అయిన రఘుమహా రాజు కాలంలో జరిగింది. దీన్ని చిత్రించిన కవి కాళిదాసు. కావ్యం రఘువంశం. శ్రీరాముని పూర్వీకుల వృత్తాంతాలను చెబుతూ కాళిదాసు రఘుమహారాజును గూర్చి చెప్పాడు. రఘుమహారాజు కోసలదేశానికి రాజుగా ఉన్న కాలంలో ఒక మహాయజ్ఞం జరిపించాడు. యజ్ఞమంటే తాను ప్రజల నుంచీ శిస్తు రూపంగానూ శత్రురాజును జయించినందున సమకూడింది ఇంకా వేర్వేరు విధాల సమకూడింది అయిన ధనాన్ని ఖర్చు చేయటానికి అనాటివారు ప్రతిపాదించిన మార్గం. యజ్ఞ సందర్భంలో ప్రేక్షకులుగా వచ్చిన జనానికి సుష్టుగా భోజనాన్ని ఏర్పాటు గావిం

చాలి. యజ్ఞం ఎన్ని దినాలు జరిగితే అన్ని దినాలు ఈ సౌకర్యం అందుబాటులో ఉండాలి. కాబట్టి యజ్ఞాల్లో మహారాజు ఆర్జించిన ధనం చాల భాగం భోజనం కోసం ఖర్చవుతుంది. యజ్ఞాన్ని నిర్వహించేవారికి ఆ సందర్భంలో అక్కడకు వచ్చిన వేదశాస్త్ర పండితులకు ధనధాన్యాదులను విరివిగా దానం చేయాలి. అలా దానం చేయందే యజ్ఞం ఫలవంతం గాదని వారి నమ్మకం ఆ సందర్భంలో ఎంతోమంది రాజులు మంత్రి సామంతులు యజ్ఞం నిర్వహించేవారికి బహుమానాల విస్తారు. రఘుమహారాజు తనకున్న ధనాన్ని గాక తనకు యజ్ఞ సందర్భంలో బహుమానాలుగా వచ్చిన వస్తుసముదాయాన్ని గూడ ధర్మం చేశాడు. ఎంతగా ధర్మం చేశాడంటే తన గృహంలో ఉపకరణాలుగా వాడుతునే పాత్రలను గూడ ధర్మం చేశాడు. అందువల్ల తన యింటికి అతిథిగా వచ్చిన కౌత్సునకు అర్ఘపానాదుల నీయటానికి మట్టి పాత్రల నుపయోగించాడు. యజ్ఞానికి ముందా మహారాజు బంగారు పాత్రల నిలాంటి అతిథులు వచ్చినపు డర్ఘ్యాదులు నీయటానికి వాడుతుండే వాడు. ఈ యంశాన్ని కౌత్సుడే చెబుతాడు. ఇపుడు బంగారు పాత్రలు లేనందున మట్టి పాత్రలను వాడుతున్నందున ఈయన తను కోరి వచ్చిన ధనాన్ని దానం చేయలేడనే అంశాన్ని గ్రహించాడు. దానం చేసినందున ఇంత నిర్ధనులవుతారా? అనేది సరసిజను వీడని ప్రశ్న. అంతేగాక పాండవులు రాజసూయ యాగం చేశారు. ద్వాపరయుగంలో వారి కా నాడు వివిధ దేశాధీశులు సింహాళం నుంచి పాండ్య చోళదేశాల నుంచీ వచ్చినవారు బహుమతుల నొసంగారు. వాటిని తీసుకొని జాగ్రత్త చేసే బాధ్యతను దుర్యోధనునకు అప్పగించారు. ఆ సంపద నంతా ధర్మరాజు యజ్ఞంలో ధర్మం చేయలేదు. ఆ సంపద గలిగి ఉన్నందువల్లనే కౌరవులు ముఖ్యంగా దుర్యోధనునకు అసూయ కలిగి పాండవులను జూదంలో వంచించి వారి రాజ్యాన్నపహరింపజేసింది. తుద కిదే మహాభారత సంగ్రామానికి దారి తీసింది. అయితే కౌత్సుని వృత్తాంతం త్రేతాయుగం నాటిది. త్రేతా ద్వాపరయుగాల ధర్మా లింతగా మారాయా. కృతయుగంలో ధర్మం నూటికి నూరు పాళ్ళు ఆచరణలో ఉండేవనీ, త్రేతలో ముప్పావు, ద్వాపరంలో సగము, కలియుగంలో పాతిక భాగం అమలులో ఉందంటారు. దీనికి మజ్జిగలో వెన్నముద్ద మునగటానికి సంబంధాన్ని చెబుతుంటారనే విషయం గాయత్రి చెప్పగా సరసిజ విన్నది. కలియుగంలో నాల్గో వంతు ధర్మం ఆచరణలో ఉంది. అందువల్ల ఇపుడు మజ్జిగలో వెన్న నాల్గో వంతు మాత్రం తేలుతుంది. మిగిలిన మూడు వంతులు మజ్జిగలో

మునిగిపోతుంది. ఇంతకు మునుపున్న ద్వాపరయుగంలో వెన్నముద్ద సగం మజ్జిగలో మునిగిపోయేది. త్రేతాయుగంలో మునిగే భాగం ఒక వంతు తేలే భాగం మూడు వంతులు అని అంటారు. అంటే కాలక్రమంగా మజ్జిగలో సాంద్రత (density) తగ్గిపోవటాని కిది సూచకమా లేక వాస్తవమా మనం చెప్పలేము. ప్రాతకాలపు అంశాలన్నీ నేటి శాస్త్రీయ దృష్టితో పరిశీలించినా కొంతకు కొంత నిలిచి ఉండటం గుర్తింపదగిన అంశం. ఈ యుగధర్మాలకు మజ్జిగలో వెన్నముద్ద మునగటానికే గాక మజ్జిగలో సాంద్రత యుగానుసారంగా తగ్గిందన తలంచటానికి హేతుబద్ధమైన సంబంధం ఉందో లేదో గాయత్రిగారి నడిగి తెలుసుకోవాలని' సరసిజ తలుస్తుంది,

"ద్విజరక్షితాని తపోవనాని నామ" అనే వాక్యాన్ని గాయత్రి ముఖతః సరసిజ వినియుంది. తాను వాక్యాన్ని తు.చ. తప్పకుండ గుర్తించుకోవటం సరసిజ ప్రత్యేకత. ఆమె జ్ఞాపకశక్తి నిదర్శనం. తపోవనము లనగా కౌత్సుడు మొదలయిన శిష్యులకు వరతంతువు మొదలయిన మహర్షులు విద్యాభ్యాసం గావించటానికి అనువైన ప్రశాంత వాతావరణం కలిగిన ఆశ్రమాలు. ఈ యాశ్రమాలవారి జీవిత విధానం వేరు. దుష్యంతుని కణ్వాశ్రమంలో గాంచిన శకుంతలకు గలిగిన (అమరాగాది వికారాలను) తపోవన విరుద్ధము లయిన భావపరంపరగా కాళిదాసు శాకుంతలములో సూచన గావించాడు. దుష్యంతునం దాసక్త చిత్తమయిన శకుంతలకు గలిగిన సంకటపాటు తాము విన్న కథలోని విరహావస్థకు గురియైనవారి వర్తనను పోలియున్నట్లు అనసూయా ప్రియంవద లనటం వాటికి యుక్తవయస్సు వచ్చినా లౌకిక జీవన సరణి ఇసుమంతయు అవగతం గాకపోవటానికి నిదర్శనంగా గుర్తించదగును. లౌకిక జీవిత ధర్మాలను ఏ మాత్రము ఎరుగని యువతులే గాక యువకులు కూడ కలరనుటకు ఋష్యశృంగ మహర్షి ముఖ్యమైన నిదర్శనం. ఋష్యవిషాణ మౌని అనేదీ ఋషికుమారునికి అధునిక కాలంలో కవులు గన్పించిన పేరు. ఈతడు ఆశ్రమంలో వసించేవాడు. ఈతనికి తల్లి చిన్నతనంలోనే గతించిందనుకుంటా. తండ్రి మాత్రం ఈతనికి తెలుసు. స్త్రీ పుంసయోగోద్భవమైన సృష్టిలో ఉన్న ఈ మునిబాలకునికి స్త్రీ అనే భావన తెలియనే తెలియదు. ఇంక ఆమె రూపంలో తనకన్న ప్రత్యేకంగా ఉండే అవయవాల పొందిక వారి విహారాల్లు విలాసాల్లు తెలియవు. జన్మ మొదలు ఈతడు తండ్రితో పాటు ఆర

జ్యాల్లో దొరికే కందమూలను ఆరగించి ఉదరపోషణ గావించుకున్నాడు. ఈతనికి అపక్వాహారం మాత్రం తెలుసు. ఆహారాన్ని పక్వం చేసుకోవటం కందమూలాలు గాక వివిధములైన ధాన్యాలను, పాలను, వృక్షాల నుండి వచ్చే బెల్లం మొదలగు పదార్థాలను ఈతడు ఎరుగడు. లవణము, కారము అనే అతి సామాన్య పదార్థాల నీతడు ఎరుగడు. ఇంక షడ్రసోపేతభోజనం ఈతనికి తెలియదని వేరుగ చెప్ప నవసరం లేదు. ఈతనికి నారచీరలు తెలుసును గాని చీని చీనాంబరాల విషయం తెలియదు. సువర్ణాద్యాభరణాల విషయం ఫాలాలకు పెదవులకు ముఖానికీ స్త్రీలు వాడే లత్తుక మొదలయిన పదార్థా లసలే తెలియవు. కామవికారాలకు చుంబనాది కామో ద్రేక జనకాలయిన వికారాలకు సుదూరంగా ఉన్నవాడితడు. ఇలాంటివా డుండటం సాధ్యమవుతుందా అని సరసిజకు ఆనాడు తరగతిలో గలిగిన సందేహాన్ని తన ఆశ్రమవాసం అందుండే చెట్లు చామలు మాత్రమేగాక ఆశ్రమాల్లో పక్షులు పశువులు ఉంటాయి గదా. చెట్లల్లో మగ ఆడ తేడాలను ముని బాలకుడు గ్రహించ లేకపోయినా పక్షుల్లో ఈ భేదం తెలియకపోవటం అసహజం గదూ. ముఖ్యంగా ఆశ్రమంలో హోమాదిక క్రియల కవసరమయ్యే పాలనిచ్చే ఆవులుంటాయి గదా. అందులో ఆడ మగ తేడా లుండటాన్ని ఇంత వయస్సు వచ్చిన ముని బాలకుడు గ్రహించక పోవటం ప్రకృతి విరుద్ధంగా ఉన్నట్లు సరసిజకు సందేహ పరంపర గలిగింది. ఈ సందేహాల కన్నింటికి తరగతి అయిపోయిన తరువాత గాయత్రి ఈ క్రమంలో సమాధానాన్ని చెప్పింది. తరగతి బయట వీరు కలుసుకునే ప్రదేశం గాయత్రి నివాస గృహం. సరసిజ యింటి నుంచి పాఠశాలకు పోయే మార్గ మధ్యంలో గాయత్రి గృహ మున్నందున ఈ గురు శిష్యుల చర్చలకు ఈ స్థలం తగిన ప్రదేశంగా అనువు పడివుంది. సరసిజ అడిగిన ప్రశ్నలకు ఓపికతో సమాధానం చెప్పింది గాయత్రి. మధ్య మధ్యలో సరజిజ అసంఖ్యాకంగా కొంటరు ప్రశ్నల నడగటం వాటన్నింటికి సావధానంగా సమాధానం గాయత్రికి తలప్రాణం తోకొచ్చినట్లనిపించింది. ఈ గురు శిష్యుల సంభాషణలో ప్రశ్నలు సమాధానాల వరుసలు ప్రాచీనుల పరిభాషలో ఆక్షేప సమాధానాత్మకమయిన భాష్యంలో కాలాతీతమయిన విషయాన్ని వారు గుర్తించనే లేదు. ఎవరు గుర్తించినా ఎవరు గుర్తించకున్నా సూర్యుడు తన పని తాను నిరాఘాటంగా సాగించి నాటికి తన ప్రతాపాన్ని భారతదేశంపై నుండి పశ్చిమ ప్రాంతాలకు బదలీ గావించాడు. సూర్య అస్తమయానికి ముందే ఇంటికి చేరవలసిన సరసిజ

త్వర త్వరగా తన గృహం చేరుకునే ప్రయత్నంతో గాయత్రి టీచరు దగ్గర నుండి సెలవు తీసుకుని టీచరు నుండి సెలవు మంజూరు అయినదీ లేనిదీ పట్టించుకోకుండా ముందుకు సాగిపోయింది. ఆలస్యమయిందని తల్లి నిలదీస్తే ఎలా తప్పించుకోవటమా అనే తొందరలో తనకు ఇంటికి వెళ్ళుతున్నట్లు చెప్పకుండగనే సరసిజ పోయినందుకు ఆశ్చర్య చకితురాలైన గాయత్రి మానసిక స్థితిని పట్టించుకుని సూర్యుడు తన ప్రచండకరాలను ఆసియా ఖండంపై నుంచి ఆఫ్రికా ఖండానికి తీసుకుపోయే తొందరలో ఉన్నాడు. ఈ రెండు ఖండాలకు నడుమ తన కిరణాలు ప్రసరిస్తున్నందున తన ప్రతాపాన్ని చవిచూచే ప్రాణికోటి జలచరాలు తప్ప లేనందున సంతప్తచిత్తుడయినట్లు ఆయన వెలవెల పోయినట్లు కనిపిస్తున్నాడు.

తను ఇంటికి పోతున్నట్లు సరసిజ గాయత్రికి చెప్పినా గాయత్రి విననందున వివర్ణురాలు గావటానికి కారణం ఉంది. మరో ముఖ్యమైన అంశంపై సరసిజ గాయత్రి నడగటం ఆ యంశానికి తగు సమాధానాన్ని ప్రత్యుత్తరాన్ని సంకలనం చేయటం ఇందుకు కారణాలు. ప్రాచీన వాఙ్మయంలో నేటి సమస్యలకు సమాధానాలు పరిశీలించినా దొరకవని సరసిజ తలంపు. అలా గాక మన మీనాడు ఎదుర్కొంటున్న సాంఘిక ఆర్థికాది సమస్యలకు ప్రాచీనులు ఏదో ఓ మూల సూచనా మాత్రంగా నయినా పరిష్కారం సూచితం గావించి యుంటారని తలంపు మనవారికి సంస్కృత భాషలో ప్రవేశమున్నా లేకున్నా ఆ భాషను ఆదరిస్తున్నారని గాయత్రి అంటుంది. భగవద్గీత మహాభారతాంతర్గతం గదా అందులో శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశం గావించిన సందర్భంలోనిది. "యోగ క్షేమం మహామ్యహం" అనేది. దీన్నే నేటి లైఫ్ఇన్స్యూరెన్సు వారు తమ ముఖ్య సిద్ధాంతంగా పాటిస్తున్నారు. దీన్ని దేశీయ భాషల్లోకి తర్జుమా చేయవచ్చు. కాని అలా చేస్తే దాని గాంభీర్యం లోపిస్తుందని వారి తలంపయి ఉంటుంది.

'సత్యమేవ జయతే' అనే దొక సంస్కృత వాక్యం. ఇందులో క్రియా పదం 'జయతి' అని ఉండాలి. కాని ఆ పరస్మైపదమైన ఈ ధాతువునకు ఆత్మనేపద ధాతువునకు కలిగే 'జయతే' అని ప్రయోగించటం విశేషం దీన్ని నమూనాగా తీసుకుని నిర్మించినదే 'శ్రమ యేవ జయతే' అన్నేది దీన్ని చాలామంది సర్కారు

వారు వాడుక చేస్తున్నారు. ఇందులో 'శ్రమః' అని మొదటి పదం విసర్గాంతము. ఈ విసర్గలకు లోపాన్ని గల్పించారు. తరువాత ప అనే అచ్చున్నందున రావలసిన (వృద్ధి) సంస్కృత సంధిని నివారించి తెలుగు మార్గానుసారంగా యడాగమాన్ని గావించారు, విసర్గాంతమయినందున ఇక్కడ సంధి రాకపోవటం సహజం.

అన్యభాషల నుంచి పదాలను అవసరాన్ని బట్టి తెచ్చుకోవటం కద్దు. కాని తెలుగు వారిలా గాక అన్యభాషా పదాలను తెలుగు పదాలకు మారుగ తెస్తున్నారు. దీనివల్ల తెలుగు పదాలు వ్యవహార దూరాలయిపోతున్నాయని గాయత్రి తలంపు. మనము ఈనాటి భాషలో 'అన్నం, భోజనం, మీల్స్, రైస్, ఫుడ్' అని అంటున్నాం ఇందులో మొదటి రెండు సంస్కృత పదాలు తక్కినవి మూడు ఆంగ్ల పదాలు ఉద్దేశపూర్వకంగా మన మీ పదాల నాదరిస్తున్నందున తెలుగు పదాలయిన బువ్వ, తిండి, కూడు మొదలయిన తెలుగు పదాలు వ్యవహార దూరాలవుతున్నాయని గాయత్రి తలంపు. స్వతంత్ర భారత ప్రభుత్వంలో చిన్న పొదుపును గూర్చిన ప్రచారం అధికంగా ఉంది. పురాణాల కాలంలో గూడ పొదుపును గూర్చిన ప్రచారం ప్రజా బాహుళ్యంలో వున్నదనే అంశం మనం గుర్తించగలం సంస్కృతంలో 'అప్పు'కు బదులుగా వాడే మాట ఋణము ఇది అకారాంతాలకు పరంగా ఈ ఋకారాది పదమున్నపుడు రావలసిన గుణసంధిని కాదని వృద్ధిసంధి వస్తుందనే వార్తికం సంస్కృత వ్యాకరణంలో ఉంది. ప్రవత్సతర, కంబల, వసన, ఋణ, దశ అనే పదాలకు ఋణ పరంతో మేలవించి వృద్ధి వస్తుంది. గాబట్టి ప్రార్ణ వత్సతరార్ణ, కంబలార్ణ, వసనార్ణ, దశార్ణ, ఋణార్ణ అనే రూపా లేర్పడుతాయి. కంబడి, వస్త్రం, అవుపెయ్య మొ॥ వాటిని కొనుక్కోవటానికి అప్పు చేయటాన్ని వత్సతరార్ణ మొదలయిన సమాసాలు తెలియజేస్తున్నాయి. చేసిన అప్పును తీర్చటం కోసం చేసే అప్పు 'ఋణార్ణ' అనేది. వృద్ధి సంధి రావటంవల్ల 'ఋణ' అనే దానికి ప్రాచీనుల దృష్టిలో ప్రత్యేకత ఉందనేది వాస్తవం. అంతేగాక అప్పిచ్చేవాణ్ణి 'ఉత్తమవర్ణ' అని, అప్పు తీసుకునేవాన్ని 'అధమవర్ణ' అన్నీ పిలవటం సంస్కృతభాషలో గల ప్రత్యేకత. ఋణ మిచ్చేవాడు ఉత్తముడు. ఋణం పుచ్చుకునేవాడు అధముడు అని ఉత్తమ/అధమ—ఋణ అనే పదబంధాలు తెలియజేస్తున్నాయి. ఈ సందర్భంలో ఉత్తమ అధమ పదాల వాడుకవల్ల వ్యక్తమయ్యే వాస్తవాన్ని మనం గ్రహించగలం.

ఉత్తముడు ఋణదాత. ఋణమియ్యాలంటే తనకు వచ్చిన ఆదాయంలో కొంత భాగాన్నైనా మిగుల్చుకోవాలి గదా. అలా మిగుల్చుకోవటమంటే చిన్న చిన్న పొదుపుగా దీన్ని గుర్తించాలి కదా. కాబట్టి నేటివలె నాడున్నూ చిన్న చిన్న మొత్తాలను పొదుపు చేయటం దేశానికి శ్రేయోదాయకం అనే అంశాన్ని వాళ్ళు వాడుక చేసిన పదం (ఉత్తమర్ణ) వల్ల వ్యక్తీకరించారు. అంతేగాక అప్పు చేసేవాడి విషయంలో వాడి నిర్ణయం నేటి మన సంఘంలో లాగలేదు. ఈనాడు ప్రతి వ్యక్తీ ధనిక నిర్ధన భేదం లేకుండా అందినంతవరకు అప్పు చేస్తున్నారు. అప్పులకు ప్రభుత్వమువారు బాంకుల మూలంగా ఆర్థిక సహకార సంఘాల (State financial Corporation) ద్వారా చిన్న చిన్న వ్యాపారస్తుల నుంచీ పెద్ద పెద్ద పారిశ్రామికులవరకు ఋణసహాయాన్ని అందజేస్తుంది. గృహనిర్మాణానికి వివాహాదులకు గూడ నేటి ప్రభుత్వమువారు అప్పులను మంజూరు చేస్తున్నారు. అప్పు తీసుకోవటంలో న్యూనతను వీరూహించినట్లు గనరాదు. నాటి వారి ధోరణి దీనికి విభిన్నంగా ఉండి సంఘానికి శ్రేయోదాయకంగా ఉన్నట్లు తెలుస్తుంది.

సరసిజ గాయత్రి ఇంటి నుంచి ఇంటికి చేరుకుంది. ఆలస్యంగా రావటానికి కారణాన్ని ఆమె తల్లి అడగటం అందుకామె బదులు చెప్పటం ఇవన్నీ మామూలుగా సాగిపోయాయి. అప్పుడే ఆరుగంటలు గావటంతో T.V. కార్యక్రమాలు మొదలయినాయి. మూగబాధతో ఉన్న తన మనసుకు వినోదం అవసరమని తలచిన సరసిజ ఆశగా T.V. లోకి దృష్టి సారించింది. కాని మామూలుగా ఆ సందర్భంలో వచ్చే కార్యక్రమమే వచ్చింది. ఆ సాయం సమయాన కుటుంబ నియంత్రణపై గూర్చి బుర్రకథ ప్రారంభమయ్యింది. కథ చెప్పే ఆమె అంటే భాగవతారిణి విలువైన మంచి పట్టుచీరను తళ తళలాడే అంచును ముచ్చటగా మెరిసే తీరులో ధరించింది. ఎఱ్ఱని చీరె. అంతకన్న ఎఱ్ఱని జాకెట్టు. అంతకంటె ఎరుపు రంగు గల కుంకుమ తిలకం. ముఖానికే గాక మోచేతి క్రింది భాగంలోనూ పాదాలకు తీర్చిదిద్దిన కుంకుమ, ఆభరణాలు ధరించటమే గాక ఆమె కథా కథకురాలుగా చూపిన నేర్పుకు ప్రతిభకు కౌశలానికి ముగ్ధులైన శ్రోతలు బహూకరించిన వెండి బంగారు పతకాలను మాలగా తాల్చింది. మాటి మాటికి సుదీర్ఘంగా ఆలాపించటం అటు యిటు జరిగిపోవటం ఆమె శ్రోతలను పరవశులను గావింపజేసే ప్రయత్నాలు. దైవప్రార్థన అయిన తర్వాత "వినరా

4

ఆంధ్రుడా"తో ఆరంభమైన కథ తీవ్ర తీవ్ర భావ భంగిమలతో సాగిపోతుంది. మధ
మధ్యలో వంతలవారు ప్రశ్నలు వేయటం వాటికి భాగవతారిణి రాగయుక్తంగా
ప్రత్యుత్తరం ఇయ్యటం, ఆ సమాధానంతో సంతృప్తులయిన వంతలవారు పర
తత్వాన్ని శారీరకంగానూ, అభినయించటం జరుగుతుంది. "వినరా ఆంధ్రుడ" అ
చివరిసారి అని 'శ్రీమద్రమా రమణ గోవిందో హరి' అని భాగవతారిణి వంతు
వారిద్దరు అంటుండగా అక్కడికి వచ్చిన 'హరి' ఏదో భక్తిప్రబోధకమైన క
జరిగిందని తలంచినందున కథకురాలను కథను గూర్చిన వివరాలడుగుతాడు. అస
కథ భక్తిభరితం గాదనీ కుటుంబనియంత్రణకు చెందినదనీ సరసిజ చెప్పుతుం
గనే హరి వెంట వస్తున్న రాజీవ్‌ను చూచి వెనకడుగువేసింది.

కాని ఆ సాయంసమయంలో ఆటస్థలం నుంచీ తిరిగివస్తున్న మిత్ర
ద్వయంలో ఏదో క్రొత్త సొగసు సరసిజకు తోచింది. రాజీవ్ జుట్టుంగరాలు తిరి
ఉంటుంది. చాలా నల్లని ఆ జుట్టు ఆటల్లో పరుగులు తీసినందున ముఖంమీదికి వా
చాలా అందంగా ఉంది. ముఖంమీదికి వాలిన కురుల నడుమ నుంచీ ఉంగరాలు
జుట్టులో నుంచి ముఖ కాంతి శరీరఛాయలతో వింతగ ప్రకాశిస్తుంది. రాజీ
శరీరం దబ్బపండుకు ఏ మాత్రం తీసిపోని రంగు కలిగి ఆ పండుపైన ఉండే ఎ
పల్లాలు లేక ప్లాస్టిక్‌గుడ్డపై ఉండే స్నిగ్ధత కోమలత కలిగి ఉంటుంది. పూర్తి
పసుపూ గాదు మరీ తెలుపూ గాని వర్ణ మీతని ముఖం. నూనుగు మీసాలు ఆటల క్లేశ
వల్ల గలిగిన చెమటకు కకాలికపై ఉండీ లేనట్లు కనబడీ కనబడనట్లున్నాయి. కను
విశాలంగాదు కాని చిన్నవని చెప్పటానికి వీలులేదు. ఈ రీతిని ఆతని శరీరాన్ని
సంధ్యాకాలంలో చూస్తుండే సౌందర్యమూర్తి అశ్వనీదేవతలు తన ముందు నిలి
నట్లు సరసిజకు అనిపించింది. ఈ విధంగా తన మనస్సులో చెదరిన ముంగురు
గల మోహనమూర్తిని ఊహిస్తూ వరండాకు అనుకొని ఉన్న హాల్లో ఉన్న
సరసిజను వాళ్ళ నాయనమ్మ సమీపించటాన్ని గుర్తించనే లేదు.

సరసిజ నాయనమ్మ పేరు సావిత్రి. ఈ నడుమనే వైధవ్యాన్ని తలదాలి
నట్లుందీమె ముఖం. పైన తిలకం తీర్చిదిద్దిన గుర్తింకా పూర్తిగా మాసిపోలేదు
ఈమె తెల్లని వస్త్రాలనే ధరిస్తుంది. అంటే కనీసం అంచులైనా లేని వస్త్రధార
చేయటం ఈమెకు భర్తపై గల ఆదరాన్నే గాక వివిధ వర్ణాలు గల వస్త్రధారణ
చేసే విధవలపై గల నిరసనభావం సువ్యక్తమవుతుంది. అరవై సంవత్సరాల పైగా

ఈమెకు వయస్సు. తల తెల్లబడలేదు. దేవుడి పేరుతో శిరోజాలను పూర్తిగ తీయించుకున్న ఈ వితంతువు శిరస్సుపై అరంగుళం సైజులో ఉన్న కుదుళ్ళన్నీ నిగ నిగ లాడుతున్నాయి. ఈ నైగనిగ్యం ఆమె ఆరోగ్యానికి సూచనమని చాలా మంది తలుస్తారు. స్వాతంత్ర్యానికి పూర్వం ఈమె హైస్కూల్లో పదో తరగతి వరకు చదివింది. అంతలో ఆమెకు వయస్సు రావటంతో ఆమెను చదువు మాన్పించారు. అసలు ఆనాడు ఆమెను సంస్కృతాన్ని చదివించాలని వారి తండ్రి తలంపు. విదేశీయుల భాషను వారి విజ్ఞానశాస్త్రాన్ని చదివించి తన కూతుర్ని విదేశీయుల పద్ధతులకు అనుగుణంగా తీర్చిదిద్దటం, దేశానికి ఆనాటి కాంగ్రెసు పార్టీకి దేశ స్వాతంత్ర్యం కోసమనో, తెగువలకు వెనుకంజవేయని జాతీయ నాయకులకు అపచారం చేయటమని ఆయన విశ్వాసం. అందువల్ల ఆయన తన కూతురుకు ప్రత్యేకించి సంస్కృత భాషను అందలి గ్రంథాలను యథావకాశంగా నేర్పాడు. సావిత్రికి విన్నంతనే గ్రహించటం, గ్రహించిన యంశాన్ని మరవక పోవటం జన్మతః సిద్ధించిన గుణాలు. ఉన్నమాట ఉన్నట్లుగ అనేయటం సావిత్రికి అలవాటు. సరసిజ చాటు చాటుగా నిలబడిటం సావిత్రికి వింతగా తోచింది. ఏమ్మా సరసిజా! అంత సిగ్గుపడుతున్నావు. వరండాలో నీకు తెలియనివారున్నారే మరీ విడ్డూరం గానీ, రాజీవ్ చిన్నప్పటి నుంచే నీతో పాటుగా ఆడుకుంటూ పాడుకుంటూ ఉండేవాడు గాదంటే. నీకు కాబోయే మగడన్నట్లుగా నీ వెందు కంతగా ఒదిగి ఒదిగి పోతున్నావ్. అసలు ఈ రోజుల్లో అయిన కానున్న వధూవరులు సిగ్గు బిడియం లేకుండ షికార్లు కొట్టుకుంటూ పోట్లాడుకుంటూ ఉంటారు గాని మా కాలంలో లాగ కాదుగదమ్మా. మా కాలంలో భర్తను పలకరించటం గానీ చూట్టం గానీ రాత్రి ప్రొద్దుపోయిన తర్వాత గాని పగటిపూట భర్త కంటబడటం ఆ నాడు అనుచితంగా ఉండేది. అని ఈ విధంగా ఇంకా తన ధోరణిలో సావిత్రి చెబుతునే ఉంది. సరసిజ బదులు పలకకుండా వింటోందో లేదో గూడ తెలియకుండ తన స్థానంలో తాను వెనుకటివలెనే నిలిచి ఉంది. సావిత్రి సాగిస్తున్న ఉపన్యాసంలో "నిన్ను పెళ్ళాడేవాడు" అనే మాటను రాజీవ్ విన్నాడు. ఆ మాటనే మరోసారి మరోసారి తలంచుకున్నాడు. తెలియని లెక్కను చేయటానికి దారి తోచినవాడులా సంతృప్తిని వ్యక్తీకరించే ముఖభంగిమతో ఉన్నాడు. రాజీవ్‌తో వచ్చిన ఆంగిక మైన ఈ మార్పును అతని ప్రక్కనే ఉన్న హరి గుర్తించాడనటానికి నిదర్శనా

శ్లేవు. సరపిజ వాయనమ్మ ఉపన్యాస ప్రవాహంలో కొట్టుకుపోతుందో లేక పరం డాలో ఉన్న రాజీవ్‌లోవి మార్పుకు కారణాన్ని తెలుసుకో ప్రయత్నిస్తుందో లేక అసలితనిలోవి ఆంగికమైన మార్పును గుర్తించలేదో తెలుసుకోలేం. రాజీవ్‌లో మాత్రం భావ పరంపర వివిధ రీతుల్లో పొంగి ప్రవాహమై ఆ ప్రవాహంలోవి అలల తాకిడికి తన మనస్సు తట్టుకోలేకపోయినట్లు చూచేవారికి అనిపి చటానికి తగిన భావ వేగానికి గురైనాడు.

కొంత తడవుకు రాజీవ్ ప్రస్తుతానికి వచ్చాడు. అప్పుడు సావిత్రిగారు అడుగుతున్న ప్రశ్నలను విన్నాడు రాజీవ్. కుటుంబ నియంత్రణ అనే దానికి Family Planning కు సంబంధం ఏమిటని ఆమె ప్రశ్న. ఆంగ్లానికి తెని గింపని ఆ రాజీవ్ తడుపుకోకుండా సమాధాన మిచ్చాడు. 'కుటుంబ నియంత్రణ' అసలు తెలుగు గాదు. తెలుగువారు అనూచానంగా వాడుక చేస్తున్న సంస్కృతం గదా. ఇలా సంస్కృతాంధ్ర భేదాలను గుర్తిస్తే ఎలా తెలుగులో సంస్కృతం అనాదిగా ఈ స్థానాన్ని సంపాదించుకుంది. దీనికి కవి పండితులే మూలం. భాషను సంస్కృత సమంగా తీర్చి దిద్దాలని వారి తలంపు. అయినా సంస్కృత పండి తులు 'తెలుగంచుంజెవి పెట్టలేమిని' ఎలా తొలగించాలని ఓ పండితుడి ఆవేదన. పడిన విషయాన్ని రాజీవ్ గుర్తుకు తెచ్చాడు. సరేగాని రాజీవ్ Family అంటే కుటుంబం అనటం సరిపోతుంది గాని Planning ప్రణాళిక అన్నా నియంత్రణ అన్నా పరిమితి హద్దు అని అర్థం. కాబట్టి కుటుంబ నియంత్రణ అంటే ప్రణా ళిక బద్ధమైన కుటుంబం. తల్లి దండ్రులకున్న ఆస్తి పాస్తులను వికరాదాయాన్ని దృష్టిలో ఉంచుకుని తమ తమ సంతానానికి పరిమితిని తమకు తామే ఏర్పాటు గావించుకోవాలి. అసలీ విధంగా పరిమిత కుటుంబం కోసం ఇప్పుడు తహతహ లాడుతున్నారే గాని వెనుక ఎవరి చరిత్ర పరిశీలించినా సంతానం లేక వ్యథ జెందటం ఏదో మహర్షి నాశ్రయించటం ఆయన మార్గాన్ని అమలు పరచటం సంతతి పొందటం మామూలే. దిలీపుడు దశరథుడు సంతానం కోసం ఎంతగానో వ్యధిత మనస్కులయినట్లు వాల్మీకి రామాయణంలో గలదు. కుంతి మాద్రి ఎంతోకాలం సంతతి కోసం ప్రయత్నించారు. కశ్యప ప్రజాపతి భార్యలయిన కద్రూ వినతలు సంతతిని పొందగోరి ఎంతగా సంతప్తచిత్తులయ్యారో తెలుస్తుంది గధా. మరి ఈ రోజుల్లో ఇంతగా సంతతి వద్దని ప్రయత్నాలను ప్రభుత్వమే

ప్రబోధించటంలో ఉద్దేశమేమై ఉంటుంది అని సావిత్రిగారి సందేహం. వారంతా రాజ వంశీయులు. వారి భోజనంలో క్రొవ్వును పెంపొందించే పదార్థాలు అధికంగా ఉంటాయి. పైగా వారికి శారీరకమైన కృషిచేసే అవసరముండదు. రాజుల్లో క్రొవ్వు కరగటానికి శరీరం తేలిక పడటానికి వేట ఒక మార్గంగా మనవారు చెప్పారు. కాని అంతఃపుర స్త్రీలకు ఆ యవకాశం గూడ లేదు. అందువల్ల వారికి గర్భం దాల్చే అవకాశం చాల తక్కువ. రాజ వంశీయుల్లో ఇలాంటి పరిస్థితులు ఉన్నందున యజ్ఞ యాగాదులతో మందుల సాయంతో గర్భధారణ శక్తిని పెంపొందించేవారు.

ఈ సందర్భంలో తానా మధ్య ఓ రేడియోస్టేషన్ వారు ప్రసారం చేసిన ప్రసంగం గుర్తుకు వచ్చింది రాజీవ్‌కు. అది కుటుంబ నియంత్రణకు సంబంధించి నది. అలాంటివి అసంఖ్యాకంగా ప్రసార మవుతుంటాయి గదా? దాని ప్రత్యేకత ఏమిటి అని హరి అడుగుతాడు. అది మామూలు ప్రసంగం కాదు. హరీ పురా ణాల్లో కుటుంబ నియంత్రణ అని రాజీవ్ అంటాడు. కుటుంబ నియంత్రణ ఈనాటి సమస్య. దానికి పురాణాల్లో ఏమి వివరాలుంటాయి? అసలు నువ్వా ప్రసంగాన్ని సరిగా విన్నావా? ఏ స్టేషను వారీ ప్రసంగాన్ని ప్రసారం గావించారని హరి అడుగుతాడు. ఈ నడుమ క్రొత్తగా ప్రారంభమయిన స్టేషను వారెవరో దీన్ని ప్రసారం చేశారు. అందువల్లనే దాన్ని ఎక్కువమంది వినరు. నేను ఏదో పత్రి కలో ఈ ప్రసంగాన్ని గూర్చిన వివరాలను చూచినందున వినగలిగాను అంటాడు రాజీవ్. శీర్షిక ఇంటరెస్టుగ ఉన్నందున ఆ ప్రసంగాన్ని మొత్తం టేప్‌రికార్డు చేశాను. రెండు మూడు పర్యాయాలు సావధానంగా విన్నాను.

విన్నావు సరే. అందులో ఏముందో చెప్పు రాజీవ్ నాకు వినాలని తెలుసు కోవాలని చాల ఉత్సాహంగా ఉంది. ఆనాటి వారి కీనాటి సమస్యలు స్ఫురణకు రావటం నాకు ఆశ్చర్యజనకంగా ఉంది. రాజీవ్ ఇలా ఆ ప్రసంగ సారాంశాన్ని చెప్పాడు. స్వరోచి అనే పేరుగల ఓ మహారాజు కథతో ఈ ప్రసంగం ప్రారంభ మవుతుంది. మామూలుగ రాజు ఎదుర్కొనే అనపత్యతనే ఈయన ఎదుర్కొం టున్నాడు. కొంత కాలానికి అయనకు సంతతి గలిగే మార్గాన్ని ఓ పండితుడు వివరించారు. ఏమని, ఎలా చేస్తే సంతతి కలుగుతుందని చెప్పాడు. ఆ వివరాలను వినగోరినందున తొందరపడుతున్నాడు హరి. రాజీవ్ మరల చెప్పటం ప్రారంభిం

చాడు. ఒక యజ్ఞం నిర్వహిస్తే సంతానం గలుగుతుందని స్వరోచి కత డుపదేశించాడు. ఆ యజ్ఞం నిర్వహించాలంటే నల్లని లేడిని ఆ రాజు స్వయంగా వేటాడి దాని మాంసంతో యజ్ఞం గావించాలి. అందుకని స్వరోచి స్వయంగా వేటకు బయలుదేరాడు. నగరాన్ని దాటి జనపదాల నతిక్రమించి రథం అరణ్యాన్ని సమీపించింది. రథంవల్ల దట్టంగా వ్యాపిస్తున్న దుమ్ముతోపాటు రథగమన ధ్వనిని విన్నందున ఆ యరణ్యంలోని జంతుజాలమంతా ప్రాణభీతిలో చెట్ల మరుగున కొండ చరియల్లో రథం రాపటానికి వీల్లేని ప్రాంతాల్లో దాగుకొంటున్నాయి. రథం అరణ్య మధ్యంలోకి రానే వచ్చింది. ఆ ప్రాంతమంత నిశ్శబ్దంగా ఉంది. ఏ ప్రాణి సంచారము లేదు. ఇంతలో....ఇంత నిదానంగా చెప్పితే ఎలా రాజీవ్? త్వరగా విషయాన్ని వివరించమంటాడు హరి. కొంచెం ఆగు హరీ! ఇంతటి వివరాలు లేకుంటే నీవు ఈ ప్రసంగాన్ని అర్థం చేసుకోలేవంటాడు రాజీవ్. ధనుస్సులో బాణాన్ని ఆరోపించి దశ దిశలకు చూపును ప్రసరింపచేస్తూ అలా వేగంగా పోతున్న రథంపైనున్న స్వరోచి మహారాజు మార్గానికి అడ్డుగా ఓ మృగం నిలిచి ఉంది. భీతిలేని ఈ క్షణాలు బాణ పాతానికి ఎదురు నిలిచింది. రణరంగంలో వీరుణ్ణి ఎదుర్కొంటున్న ప్రతి వీరుడు లాగుంది. ఆత్మరక్షణకైన ఆయుధాలను ధరించని ప్రతి వీరుడు. ఆ లేడికి కన్నూ కాలూ బాగున్నాయి. ఆ రథ వేగాన్ని అతిక్రమించేంతటి వేగం గలదీ మృగం. నడిమి వయస్సులో ఉన్న మృగంతో స్వరోచి ఇలా అన్నాడు. నా రాకతో వనమంతా హడలిపోతుంది. జీవరాసులన్నీ ప్రాణ రక్షణార్థము కనుమరుగయినాయి. ఎక్కడో శరీరాన్ని కుంచించుకుని భయంతో వణుకుతూ ఈ ప్రమాదాన్ని తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నాయి. మరి నీ ప్రవర్తన ఏమిటి? వింతగా ఉందే? నీకు ప్రాణంపై తీపిలేదా. నన్ను ఎదిరించి నిలిచావు. ఇంతవరకు ఏనాడు ఏ వనంలోను మృగయార్థం వచ్చిన వారి కెదురుగా నిలిచిన లేడినే గాదు గజ వ్యాఘ్రాది జంతువులనైనా చూచి ఎరుగను ఏమిటీ వింత? అని అడిగాడాయన ఆ లేడిని. ఈ మాటలను సావధానంగా విని ఆ లేడి బదులు చెప్పిం దీ విధంగా. మానవ భాషను మృగాలర్థం చేసుకోవటం అలా ఒకవేళ చేష్టాదులవల్ల గ్రహించినా తిరిగి మానవ భాషలో మృగం బదులు చెప్పటం సాధ్యమా? ఇలాంటి అతి ప్రసంగాలు, అనుచిత వివరాలు ఉన్నందునే మన పురాణాలను విదేశీయులు ముఖ్యంగా హేతువాదానికి విలువనిచ్చేవారు విశ్వసింపలేక పోతున్నారంటాడు హరి.

వాఙ్మయ మన్నాక అందులోనూ పురాణ వాఙ్మయ మన్నాక ఇలాంటివి కొన్ని ఉండి తీరుతాయి. ఈ యసంభవాలు హేతువాదానికి నిలువలేని వృత్తాంతాలు పురాణ వాఙ్మయంలో ఉంటాయి. ఇది కేవలం సంస్కృతంలో రచితాలైన భారతీయ వాఙ్మయానికి మాత్రమే పరిమితంగాదు అంటాడు రాజీవ్. సరేకాని తరువాత విషయాన్ని చెప్పమంటాడు హరి.

రాజా! నన్ను వెంటనే నీ బాణానికి లక్ష్యం గావించు. నా ప్రాణాలను తీసి నాకు మేలు చేయండి ప్రభూ నే నింక బ్రతుకలేను. ఈ వ్యధను దినదినమూ నేను సహించలేను. ఆత్మహత్య చేసుకుంటే పాపం వస్తుందని నే నందు కుద్యమించలేదు. నీ బాణాగ్నికి నన్నాహుతిజేసి పుణ్యం కట్టుకోమంటుంది ఆ లేడి. నీకు ఇంతగా జీవితంపై ఏవగింపు ఎందుకు కలిగింది. 'బ్రతికి యుండిన శుభములు బడయవచ్చు, జీవన్ భద్రాణి పశ్యతి' మొదలైన పెద్దల మాటలు నీ వెరుగవా? అంటాడా రాజీవ్. నాకు పెక్కు సంతానం. అవి ఉదయం ఆహారం కోసమై తమ తమ తోచిన మార్గాల వెంట బయలుదేరిపోతాయి. రాత్రి ఎంతో పొద్దుపోయాకగాని అవి తిరిగిరావు. ఈ విధంగా తిరిగివచ్చేలోగా ఏ బిడ్డకు ఎలాంటి ఆపద వస్తుందో ఏనాడే బిడ్డను గురించి ఎలాంటి అశుభవర్తమానం చెవిని పడుతుందోనని భయం ఆందోళన వేటగాళ్లు పన్నిన వలల్లో బోనుల్లో వాగురుల్లో చిక్కుకుంటాయో – అరణ్య మధ్యంలో దారి తెన్ను తెలియక తప్పిపోతాయో. తోడేళ్లు వేట కుక్కలు మొదలయిన జంతువుల కోరల్లో ప్రాణాలు కోల్పోవునో, ధనుర్ధరుల బాణాలకు ఎరగా అవుతాయో అని భయం ఈ భయంను సహించలేను. దీనికి నివారణం గోచరం గానందున మరణమునే స్వీకరించి ఈ వంతలనుంచి సంతోషమయమయిన లోకాలకు వెళ్ళగలుగుతానని తలుస్తున్నానని అంటుంది. ఇంతలో మరో మృగం రాజుగారి రథంకు ఎదురుగా మొదటి మృగానికి ప్రక్కగా నిలిచి ఇలా అంటుంది. దానితో రాజు మరల పై విధంగానే మాట్లాడి దాని మరణానికి అనపత్యత కారణం అని సంతానవంతురాలైనందున మొదటి మృగం అదృష్టవంతురాలనీ, తనకా భాగ్యం లేనందున కలిగిన దుఃఖం తీరనిది అని తనకు మరణమే శరణ్యమని అంటుంది. ఈ విధంగా రెండు లేళ్ళు చావాలనుకోవటంలో కుటుంబ నియంత్రణకు ప్రమేయం ఏమిటని హరి అడుగగా ఆగు హరీ! పూర్తిగా వింటే నీకే తెలుస్తుందని రాజీవ్. మొదటి మృగానికి బహు సంతానం రెండో

దానికి బిడ్డలు అసలు కలుగకపోవటం. ఈ రెండును దుఃఖ కారణాలే. దీనివల్ల వ్యక్తమయ్యే ధర్మ సూక్ష్మం పరిమిత కుటుంబం సంతాపహారకం ఆనంద సంధాయకం అనే సత్యాన్ని మృగాల మాటలవల్ల సువిదితం. మృగాలే ఇలా ఉంటే అంతకన్న వివేకంగల మనుష్యులానాడు పరిమిత కుటుంబంను ఎంతగా ఆదరించే వారో చెప్ప నవసరంలేదు.

బాగు బాగు. చివరికి విషయం స్పష్టమై మన పురాణాల ఘనతను వ్యక్తం చేస్తుంది. అయితే ఈ సంభాషణ ఏ పురాణంలో ఉంది అని సావిత్రి, మనకు మొత్తం పద్దెనిమిది పురాణాలున్నాయి వీటి కన్నింటికి కర్త వ్యాసుడే. ఇంకా ఉప పురాణాలు ఎన్నో ఉన్నాయి. అని యామె అంటుండగా ఈ వివరాలతో మమ్మ విసిగించవద్దని హరి అంటాడు. మనకున్న వాఙ్మయ వివరాలను తెలుసు కోవాలనే ఉద్దేశం లేకపోగా నీకు సవివరంగా చెప్పేవారిని ఈ విధంగా నడుమ నడుమనే ఆపించే ప్రయత్నం చేయటం తగదని రాజీవ్ అని ఈ వృత్తాంతం మార్కండేయ పురాణంలో ఉందని సావిత్రమ్మగారితో అంటాడు. మార్కండేయ పురాణాన్ని తెనిగించిన మహాకవి మారన ఈయన తిక్కనకాలంవాడు. అంతేగాక తిక్కనకు పరోక్ష శిష్యుడని సావిత్రిగారు చెబుతుండగా నడుమ అందుకుని రాజీవ్ ఈ విషయంలో ఆకరి పద్యాన్ని కూడా రేడియో ప్రసంగంలో పొందుపరచారని దాన్ని తాను కంఠస్తం చేశానని అంటాడు. ఈ మాటలను వింటున్న సరసిజకు రేడియో ఒక్కమారు విన్నంత మాత్రాన అందున్న పద్యం ఎలా గుర్తుపడిందో అవగతం కానందున ఆశ్చర్యచకితురాలయింది. నీకు విన్నంతనే పద్యాలెలా కంఠస్తమయినదని హరి అడిగాడు. తానడుగదలచిన మాటలు తన యన్న అడిగినందుకు సరసిజకు నిజంగా సంతోషం కలిగింది. ఆ రేడియో ప్రసంగం శీర్షిక విన్నంత మాత్రనే (పురాణాల్లో కుటుంబ నియంత్రణ) నాసక్తి కరంగా ఉన్నందున దాన్ని ఆమూలాగ్రంగా టేపు రికార్డు చేశాను. ఆ టేపును పదే పదే విన్నందున ఆ పద్యం నాకు గుర్తు పడిందని రాజీవ్ అంటాడు. బహు సంతానంవల్ల వ్యధ చెందుతున్నట్లు మొదటి మృగం చెప్పిన పద్యాన్ని చదువు తున్నానని—

"నరపర నా యపత్యములు నల్దెసల న్వెసమేయ జన్న నే
బురుపుర పొక్కు దున్నలల బోనుల వాగురులన్మహా వనాం
తరముల జిక్కువోశ్వ వృక దంష్ట్రల పాలయిపోవునో ధను
ర్ధర మృగ యాగ్ర బాణముల తాకున గూలునో యంచు వానికిన్"

రెండో మృగం అనసత్యతవల్ల ప్రాణత్యాగాని కుద్యమిస్తున్నట్లు విన్నం తనే స్వరోచికి—

"తన యవిహీనుడు ధన్యుడో
తనయులు గల యతడు ధన్యతముడో యెఱుగన్
తన యార్థాధ్వర మిప్పుడు
ఘనడో లాయత మనస్కుగా జేసె ననున్."

అని సందేహం గలిగింది అనంతరం పరిమిత కుటుంబం బహూ వాంఛనీయం అనే అంశం పాఠకులకు శ్రోతలకు గలుగుతుందనేది సారాంశం. పురాణాల్లో పరిమిత కుటుంబం అనే మాటను వాడకున్నా ఈ విధంగా సందర్భాన్ని పురస్కరించుకని ఊహించటం యుక్తమా అని హరికి గలిగిన సందేహం.

ఈ విధంగా ఉత్తమ వాఙ్మయంలో కథాగత పాత్రల మాటల్లో ఎన్నో సూక్ష్మాలకు పరిష్కారాన్ని సూచిస్తారు. ఆ వివరాలను గ్రహించి మన జీవిత విధానానికి సమన్వయం చేసుకోవటం మన కర్తవ్యం. అని రాజీవ్ ఇంతటితో ఆగక రాజీవ్ వెనుకటి కాలంలో బాల్య మరణాల సంఖ్య అధికంగా ఉండేవి. అందువల్ల వారు సంతాన నిరోధాన్ని అంతగా పాటించకపోయినా సరిపోయేది. నేడు బాల్య మరణాల సంఖ్య ప్రపంచ వ్యాప్తంగా తగ్గింది. దీనికి మన వాఙ్మయంలో నిదర్శనా లున్నాయి. అని అనగా దీనికి ఏ పురాణం నుంచి ఉదాహరణలు చూపిస్తాడో రాజీవ్ అని సరసిజ తనలో తా ననుకొంటుంది. బాల్య మరణాలను గూర్చిన విషరాలను ప్రాచీన వాఙ్మయంలో ఉన్నవాటిని రాజీవ్ నోట వినవలయు నని సావిత్రమ్మ ఉబలాట పడుతుంది. హరి రాజీవ్‌వైపు ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు. తన ప్రసంగాన్ని ప్రారంభింపు గావించమని హరి రాజీవ్‌ను చూపులవల్ల నే కోరుతున్నాడని గ్రహించటానికి ఎంతో కాలం పట్టలేదు. ఇలా రాజీవ్ మొదలు పెట్టాడు. స్థానేశ్వరం రాజధానిగా ప్రభాకరవర్ధనుడనే రాజు పరిపాలించాడు గదా. ఆ ప్రభాకరవర్ధనుడి రెండో కొడుకు హర్షవర్ధనుడు. అతదేదో వ్యగ్రుడై రాజధానికి సుదూరంలో ఉండగా స్థానేశ్వరంలో ప్రభాకరవర్ధనుడి ఆరోగ్యము బాగా దెబ్బతిన్నది. ఎంతమంది రాజవైద్యు లెన్నివిధముల యత్నించినా ఫలితం లేకపోయింది. ఈ వార్తను వేగులవారు మోసుకుని వచ్చి హర్షవర్ధనునకు అందించారు. వెంటనే హర్షవర్ధనుడు నగరాభిముఖుడైనాడు. వేగం గల అశ్వాన్ని అధ్

హించి, ప్రయాణాన్ని సాగిస్తూ ఒకనాటి రాత్రి మార్గమధ్యంలో ఒక గ్రామంలో కల్పించిన డేరాలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. నగరంలో తండ్రి పరిస్థితి నూహించుకుంటూ వ్యధాక్రాంతమైన మనస్సుతో అటూ ఇటూ పచార్లు చేస్తుండగా ఆయన కొక శ్లోకం వినబడినది. ఆ నగరంలో ఓ గృహస్తు ఇంటి ముందు రాజ మార్గానికి ప్రక్కగా ఉన్న అరుగుపై విశ్రమించిన ఓ సన్యాసి ఆలపించిన దీ గీతము. "ఓ ప్రాణీ! నీకు కొన్ని వేలమంది తల్లిదండ్రులు కొన్ని వందలమంది భార్యాబిడ్డలు కృత త్రేతా ద్వాపర యుగాల్లో ఉండి ఉంటారు. ఎవరు నీకు తలి దండ్రులో, నీ కెవరు సతీపుత్రులో చెప్పలేం గదా. అని ఆ పద్యానికి అర్థం. జీవితము తాత్కాలికము, చంచలము, అశాశ్వతము అనే అంశాన్ని ఈ శ్లోకం హర్షునకు స్ఫురణకు తెచ్చింది. దాన ఆయన మరీ వ్యధిత మనస్కుడయినాడు. అని చెప్పగా వృత్తాంతానికీ కుటుంబ నియంత్రణకు సంబంధ మేమిటని హరి, ఈ విధంగా తాత్విక దృష్టి నలవర్చుకుని రాజీవ్ ఆ పద్యాన్ని ఆలపించినవాని లాగా సన్యసిస్తాడేమోనని సరసిజ తలంచారు. ఆ పద్యం నీకు గుర్తుందా ఉంటే వినిపించమని సావిత్రమ్మ అన్నారు. రేడియో ప్రసంగంలోవిదే ఈ శ్లోకం గూడ. టేపు చేసి ఉన్నందున విని దీన్ని నేర్చుకున్నానని రాజీవ్ ఆ శ్లోకాన్ని —

> "మాతా పితృ సహస్రాణి – పుత్రదార శతానిచ
> యుగే యుగే వ్యతీతాని – కస్యతే కస్యవా భవాన్."

అని చదివాడు. సావిత్రమ్మ ఆనందించింది. హరి ప్రశ్నకు రాజీవ్ బదులు చెప్ప టానికి ఉద్యమించాడు. 'వేల సంఖ్యలో తల్లిదండ్రులు, వందల కొలది భార్యా బిడ్డలు జీవున కున్నారనేది ఇందలి వాస్తవం. వేయికి వందకు Proposition వెయ్యిమంది శిశుజననాలు జరిగితే వందమంది మాత్రమే వివాహితులై ఉండేవారు, 1000 = 100. దీన్ని సామాన్యీకరిస్తే 10 : 1 అని వస్తుంది అంటే పదింట ఒక్కడే వివాహితుడు అయ్యేవాడు. అంటే మిగిలిన (10-1) తొమ్మండుగురు శిశువులు బాల్యంలో మృతి చెందటమో లేక జల ప్రళయాలకు, అగ్నిప్రమాదా లకు గురికావటమో, యుద్ధాది ఉపద్రవాలవల్ల మృతి చెందటమో జరుగుతుండేది. సరియైన వైద్య సౌకర్యం మారుమూల గ్రామాల కందనందున శిశు మరణా లధి కంగా జరుగుతుండేవి. క్షామానికీ ఎందరో చనిపోతుండేవారు. అంతేగాక సన్య సించటం ఆ నాడు అతి సహజమైన అంశం. బౌద్ధ, జైన మతాలే గాక హైందవ

గాడ సన్యాసులు వెనుకటి కాలంలో అధికంగా ఉండేవారు. అందువల్ల టుంబాన్ని పరిమితం చేసుకొనటానికి ప్రయత్నాలు లేకున్నా జనం రిగిపోవటం సంభవించేదిగాదు.

ుడు పరిస్థితులు మారాయి. శిశు మరణాల సంఖ్య నూటికి అయిదు వ. జల వాయు అగ్ని ప్రళయాలను యుద్ధంవల్ల ప్రజాక్షయాన్ని నవుడు నిలుపు చేయకలిగినాడు. అందువల్ల జననాలను తగ్గించటానికి వారు ప్రయత్నం చేస్తున్నారన్నాడు. ఈ మాటలు హరికి సంతృప్తిని . రాజీవ్ ప్రాచీన వాఙ్మయంలోని అంశాలను ఆధునిక సమాజానికి తను గావించినది కాదని దీనికి రేడియో ప్రసంగకర్త మూలమనీ ప్పాడు.

గా సంతానం కలగకుండ ఉండడానికి నేటి సమాజంలో కృత్రిమాలైన అనుసరిస్తున్నారనీ అలా గాక వెనుకటి కాలంలో ఈ విధానం అతి సాగిపోతుండేదనీ సావిత్రిగా రనగా అది ఎలాగో వివరంగా చెప్పమని డు. నాయనా! ఏమని చెప్పను. తల్లి తన బిడ్డకు ఎంత కాలం చనుబా అంతవరకు ఆమె గర్భం దాల్చే వీలుండదు. తల్లి పాలవల్ల బిడ్డ కుడవుతాడు. ఈనాడు ఏ తల్లి బిడ్డకు పాలిస్తుంది. గాబట్టి అలా నందున ప్రసవించిన రెండు మూడు నెలల్లో గర్భం దాల్చుతుంది. పద్మాలుగు లేక పదిహేను నెలల్లో మరల తల్లి ప్రసవించటం జరుగు న్ని నివారించటానికి వేర్వేరు మార్గాలను ఆచరించాలి. ఇవి ధన పాటు అనారోగ్య హేతువు లవుతున్నాయి. ఈ మాటల్ని సరసిజ వింటుంది. హరి ఏదో గుర్తుకు వచ్చినట్లు వెలుపలికి పోయాడు. జీ అనుసరించాడు. సావిత్రిగారు లోపలకు వెళ్ళారు.

# 4

ఈ సృష్టిలో కాలం అనే భావన విచిత్రమైనది. దీన్ని గుర్తించని వారుండరు అంటే అది వాస్తవం. దీని విలువను తెలియనివా రుండరు. భూత భవిష్యత్ వర్తమానాది విభేదాలతో కాలాన్ని మనం గుర్తిస్తున్నాం. కాల మనేదాన్ని ఎలా నిర్ధారించటం? దీనికి లక్షణం ఏమిటనేది చిక్కు సమస్య. భూమి వాసన గలదనీ, నీటికి చల్లదనం సహజ గుణమనీ, ధ్వని తరంగాలను మోసుకుపోవటం వాయువున కున్న సహజ లక్షణమనీ భారతీయ తార్కికులు నిర్ధారించారు. కాలానికి లక్షణం చెప్పటంలో సతమతమై పోయి అతీతాదివ్య వ్యవహారానికి హేతుభూత మయ్యిందేదో అదే కాలమని తుదిగా నిర్ణయించారు.

కాలానికి లక్షణం చెప్పటం ఎంత కష్టమో కాలం గడిచిపోయిందనే అంశాన్ని గుర్తించటం గూడ అంతే చిక్కు సమస్య. ప్రతి ప్రాణి తన తన పనుల్లో ఎంతగా మునిగి ఉంటారో అంతగా వారు కాలగమనాన్ని గుర్తించకుండా ఉండిపోయి, అతీతమయిన కాలాన్ని గూర్చి ఒకనాటికి గుర్తించి ఆశ్చర్యపడుట సహజంగా జరుగుతుంటుంది.

ఇంటర్ మొదటి సంవత్సరంలో చేరిన రాజీవ్, అతని మిత్రుడు హరి, హరి చెల్లెలు సరసిజల విషయంలో సరిగా ఇదే జరిగింది. సరసిజ ఇంటర్ పూర్తి చేసి వైద్యకళాశాలలో చేరి వైద్యశాస్త్రంలో పట్టా పొందింది. ఆమె సోదరుడయిన హరి ఇంజనీరింగులో పట్టభద్రు డయినాడు. అతని మిత్రుడయిన రాజీవ్ గూడ ఈ ఏడెనిమిది సంవత్సరాలు తదేక దీక్షతో విద్య నభ్యసించాడు. తన మిత్రుడు అతని సోదరులను మించిన శ్రద్ధతో విద్య నభ్యసించిన 'రాజీవ్', పొందిన పట్టం వైద్యశాస్త్రంలో గాదు. ఇంజనీరింగులో కానే కాదు. మరే వృత్తి విద్యలోనూ కాకపోవటం నిజంగా నమ్మశక్యం గాని వాస్తవం.

ఈ కాలంలో డా. విశ్వేశ్వరయ్య వైద్యవృత్తి ఇనుమడించింది. రోగు లధికంగా రావటంవల్ల మంచి పేరుతో పాటు ధన లాభం గూడ గణనీయంగా పెరిగింది.

హరి ఉద్యోగం చేస్తున్నాడు. సరసిజ తన వయస్సును గురించి ఆలోచన చేస్తుందనవచ్చు. తనకు యుక్తవయస్సు వచ్చిందని ఆమెకు చాలా సంవత్సరాలకు

ముందే తెలుసు. సావిత్రి ఈ విషయమై ప్రస్తావిస్తే తన చదువయ్యేవరకు పెండ్లి ప్రసంగం వద్దనటం తరచుగ జరుగుతుండేది. సరసిజ చదువయిన తరువాత సావిత్రి ఈ ప్రసంగాన్ని తీసుకురాగా సరసిజ తెలివిగా తప్పించుకుంటుండేది. ఇంతలో సావిత్రి మృతి చెందింది. లేకుంటే సరసిజ వివాహ విషయం పదే పదే కదిలించి ఒక నిర్ణయం తీసుకునేటట్లు ఆమె తల్లిదండ్రులను వొప్పించియుండు ననిపిస్తుంది. సరసిజ చదివింది వైద్యశాస్త్రం గాబట్టి వైవాహిక జీవనాన్ని ఏ వయస్సులో స్వీకరించాలో ఆమెకు సవివరంగా తెలుసు. తగిన వయసులో వివాహం చేసుకోకపోవటం ప్రకృతి నియమాలను, నిబంధనలను బలవంతంగా ఉల్లంఘించటమే నని ఆమెకు సువిదితము. సరసిజకు పెండ్లి చేయటాన్ని గూర్చిన ప్రస్తావనను ఆమె తల్లిదండ్రులు ముచ్చటిస్తే, ఆమె కోపాన్ని వ్యక్తీకరిస్తుండేది. ఆమె వైఖరిని చూస్తే అసలు ఆమెకు వైవాహిక జీవితంపై ఆదరము లేదేమో అన్నట్లనిపించేది.

రాజీవ్ మాత్రం తన వయస్సు విషయం పరిగణించటం లేదు. తాను ఇంకా ఇంకా క్రొత్త పుస్తకాలను చదవాలనీ, విశేష పరిజ్ఞానాన్ని పొందాలనే తపన దిన దినం పెరిగిపోతుంది. ఆయన జ్ఞానతృష్ణ అతడు ప్రత్యేక పాఠ్యంగా తీసుకున్న లెక్కలు, భౌతిక రసాయనిక శాస్త్రాల్లో గాదు. ఎక్కువ మార్కులు వస్తాయని మాతృభాష (తెలుగు) బదులుగా స్వీకరించిన సంస్కృత భాషా వాఙ్మయాలందే గాక, అందలి వివిధ శాస్త్రాలలో లోతుపాతులతో పాటు, వైదిక కాలం నాటి రచనలకు సంబంధించినది. రాజీవ, మరి అతని చెల్లెలు సరసిజ ఇంటర్ కోసం చేరిన రెసిడెన్షియల్ కళాశాలలో ఆనా డున్న సంస్కృత భాషా బోధకుని పేరుతో మన కవసరం లేదు. అయినా తెలుసుకోవటం మంచిది. అరవై సంవత్సరాల వయస్సున్న ఆ ఉపాధ్యాయుడు, నలభై సంవత్సరాలనాడు సంస్కృతంలో ఉన్నత విద్య నభ్యసించి ఉంటాడు. ఆ నాటి కా విద్యకు ప్రోత్సాహం అగ్రవర్ణాలల్లోనే ఉండేది. తక్కినవా రొక విధంగా చెప్పాలంటే ఈ భాష నధ్యయనం గావించటానికి సుముఖంగా లేరని చెప్పవచ్చును, దీనికొక నిదర్శన మేమిటంటే, అగ్రకులాలవారు, గానివారు ఎక్కడైన సంస్కృతంలో పాండిత్యాన్ని కలిగివుంటే సంస్కృత భాషా బోధకుడుగా ఉంటే అతణ్ణి శాస్త్రిగా తలంచటం ఉందీ నాటి మన సమాజంలో. అందువల్ల రాజీవ్‌కు సంస్కృతం

ఇంటర్‌లో నేర్పిన ఉపాధ్యాయుడు శాస్త్రి. మిగిలిన వివరాలతో మన కంతగా పని లేదు. ఆచార వ్యవహారాల్లో, నియమనిష్ఠల్లో, విద్యాబోధనలో హేతువాదాని కనువుగ ప్రవర్తించే స్వభావం గల శాస్త్రి ఈ ఉపాధ్యాయుడు. దేశ దేశాల్లో ఎందరో హైందవేతరులు సంస్కృతంలో కృషి చేస్తుండగా మనం మన దేశీయులకే ఏదో కారణంవల్ల సంస్కృత భాషను నేర్పకుండ ఉండటం క్షంతవ్యం గాని యంశంగా ఆయన విశ్వసించటమే గాక, ఆచరణపూర్వకంగా ఈ యంశాన్ని తాను నిరూపించిన వ్యక్తి ఈ శాస్త్రి. ఈయన ఎక్కడో అధ్యాపకుడుగా ఉండి విశ్రాంతి తీసుకున్నాడు. ఆ కళాశాలలో కొన్ని సంవత్సరాల్లో పట్టభద్ర దశలో సంస్కృతం చదివే విద్యార్థులు లేనందున ఈయన పదవికి భంగం కలిగే పరిస్థితుల నెదుర్కొనవలసి వస్తుండేది. ఆ కళాశాల పాలకవర్గం అలాంటి పరిస్థితుల్లో శాస్త్రిగారికి మేలు చేయాలని తలంచేవారు. అందువల్ల ఆయన విశ్రాంతి తీసుకునేవరకు ఉద్యోగంలో ఉండటం జరిగింది. వెంటనే ఈ రెసిడెన్షియల్ కళాశాలవారు ఆయనకు ఆహ్వానాన్ని పంపారు. సంతోషంతో ఆయన ఆ కళాశాలలో చేరాడు. దీనివల్ల జీతం వస్తుందనే సంకల్పం కంటే సంస్కృతాన్ని బోధించే అవకాశం లభిస్తుందనే అంశం ఆయనకు మిక్కిలి ఉత్సాహాన్ని కలిగించింది. ఇంటర్‌లో ముఖ్యంగా తానున్న కళాశాలలో సంస్కృతాన్నధ్యయనం గావించే వారధిక సంఖ్యలో ఉండటం శాస్త్రిగారికి ఉత్సాహాన్ని గలిగించింది. పట్టభద్రులు గావటానికి చేరేవారు వీరి (ఇంటర్ విద్యార్థుల్లో)లో చాలామంది ఉంటారనీ అందువల్ల డిగ్రీ తరగతుల్లో సంస్కృతాన్ని తీసుకునే విద్యార్థులకు కొరత రాబోదనీ తలంచాడు. కానీ అచిరకాలంలో వీరంతా ఎక్కువ మార్కుల కోసం ఇంటర్‌లో సంస్కృతాన్ని స్వీకరించారే గాని వీరికి నిజంగా సంస్కృతంపై ఆదరమువలన కాదని తెలుసుకున్నాడు. ఈ విద్యార్థు లందరూ వృత్తివిద్యలకు పోతారే గాని, డిగ్రీ (B.A.) చదువులకు పోరని ఆయన గ్రహించాడు. ఈ పద్ధతికి భిన్నంగా రాజీవ్ డిగ్రీ కళాశాలలో చేర తలంపున్నట్లు చెప్పినా శాస్త్రిగారు నమ్మేవారు గాదు. గ్రూపు సబ్జక్టుల్లో ప్రథమ, ద్వితీయ స్థానాన్నాక్రమించే రాజీవ్ తప్పకుండా వృత్తివిద్యలో చేరి సంస్కృతాని కంతటితో తిలోదకా లిస్తాడని శాస్త్రిగారికి తెలుసు. అయినా రాజీవ్ సంస్కృత పాఠం వింటూ ఎన్నో ప్రశ్న పరంపరలు ఘటించటం, వాటిలో కొన్నింటి కక్కడనే మరికొన్నింటిని క్లాసయిన తరు

వాత వ్యవధి చిక్కినపుడు, ఇంకా కొన్నింటిని రెండు మూడు రోజుల తరువాత శాస్త్రిగారి ఇంట్లో రాజీవ్‌కు చెబుతుండేవాడు. తనకు ప్రత్యుత్తరం తెలియని ప్రశ్నలకు ప్రత్యుత్తరాన్ని చెప్పటానికి శాస్త్రిగా రెన్నో గ్రంథాలను వాటి వ్యాఖ్యానాలను, వాటిపై ఆంగ్లంలో హిందీ భాషల్లో గల వివరణలను పరిశీలించి చెప్పేవాడు. ఆ గ్రంథాలను రాజీవ్ చూస్తుండమే గాక ఇలాంటి వివరణాత్మక గ్రంథాలు తెలుగులో లేకపోవటానికి ఉపేక్ష కారణమని రాజీవ్ తెలుసుకున్నాడు. తాను రానున్న కాలంలో ఈ లోటును లేకుండా చేయాలని అనుకునేవాడు. అపుడపుడు శాస్త్రిగారితో ఈ విషయమై ముచ్చటిస్తుండేవాడు. నాయనా రాజీవ్ నీవు వృత్తి విద్యలో చేరిపోతావే గావి ఇంటర్ అయిన తరువాత నా దగ్గర ప్రత్యేకించి నేర్చిన సంస్కృతాన్ని మరచిపోకుండా ఉంటే అదే పదివేలని అంటుండేవాడు. అలా కాదని రాజీవ్ ముక్తసరిగ సమాధానం చెబుతుండేటప్పుడు అతని ముఖంలో దృఢ సంకల్ప సూచకాలైన అంశాలు మెదులాడుతుండటం శాస్త్రిగారు గ్రహించక పోలేదు.

రాజీవ్ ఇంటర్ చదివే రోజుల్లో సంస్కృత పాఠ్యగ్రంథంలో ఇందుమతి స్వయంవరం ఉండేది. భోజదేశాధీశుని సోదరి ఇందుమతి ఆమెకు రఘు మహారాజు కొడుకైన అజుడు భర్త అయితే బాగుండునని భోజ మహారాజు తలంపు. ఇందుమతి అజుని, యందాసక్త చిత్తయై ఉండటం దీనిక్కారణం. అయితే భోజుడీ విషయాన్ని రఘు మహారాజుకు విన్నవించి, ఆయన అంగీకరిస్తే ఈ వివాహం జరిపించవచ్చును. కాని అలా అని తన మనోగతాన్ని భోజుడు అజునకు తెలిపితే ఆయన సుముఖంగా ఉంటేసరి. అలా కాక రఘు వందుకు అంగీకరించకపోతే భోజ మహారాజుగారి మాట పోతుంది. దీన్నభ్యర్థనాభంగ, మంటారు సంస్కృత కావ్య రచయితలు. తమ మాటకు భంగపాటును సంస్కృత కావ్య కల్పిత నాయకులు సహించలేరు. శివుడు తన కల్లుడవుతాడని హిమవంతుడు నారదునివల్ల వినియున్నా, ఆయన్నడిగి ఈ వివాహాన్ని కార్యరూపం దాల్చేటట్లు చేయటానికి కన్య తండ్రి సాహసించడు. మాట పోతుందేమో (అభ్యర్థనకు భంగం కలుగుతుందేమో) అనే భయం హిమవంతునికి ఉంది. అందువల్ల స్వయంవరాన్ని ప్రకటించటం, అందున తన మనసులో ఉన్న వ్యక్తి ఆ స్వయంవరానికి రాకపోతే తమ అభిమతానికి ఆదిలోనే అనుప పన్నత సంభవిస్తుంది. అందువల్ల భోజుడు

తన చెల్లెలి స్వయంవరాన్ని ప్రకటించాడు. ఈ వర్తమానం అందరితోపాటు రఘు మహారాజుగారి రాజధానికి గూడా అందింది. అయినా ఉండబట్ట లేక స్వయంగా దూత నొకణ్ణి ప్రత్యేకించి రఘు మహారాజుగారి రాజధానికి పంపాడు భోజుడు. ఆ దూత ఇందుమతి స్వయంవర వృత్తాంతాన్ని రఘు మహారాజుగారికి ముఖ్యంగా అజునకు తెలియజేశాడు. ప్రతి అంశంలో ఈ విధంగా విలువలను పాటించేవారు ఆనాటి రాజులు. వారి ననుసరించి ఆ కాలంలోని ప్రజలు.

ఈ వివరణాత్మక భూమికతో ఇందుమతి స్వయంవరాన్ని సంస్కృతం మాష్టారు ప్రారంభించారు. ఆ వృత్తాంతంలో తన్ను ఇందుమతిగా, రాజీవ్‌ను అజ మహారాజుగా ఊహించుకుంటూ పాఠం వింటుండేది సరసిజ ఈ పాఠంను దీని భూమికను అవగాహన చేసుకున్న రాజీవ్, కాళిదాసు రఘువంశ కావ్యా రంభంలోగల శ్లోక గతార్థాన్ని ఆనాటి సాంఘిక పరిస్థితులకు సమన్వయించి ఊహిస్తుండేవాడు. ఆనాటి సంఘంలోని ఔన్నత్యతను మననం చేస్తుండటంలో అతనికి పారవశ్యం కలుగుతుండేది. ఈ విధంగా తనలో తను ఊహల్లో విహ రిస్తూ భావ పరంపరతో సతమత మవుతుండ, ఒకనాడు తన గదిలో రాజీవ్ ఉండగా అక్కడికి హరి వచ్చాడు. హరి రాకను గూడ గుర్తించకుండ భావ వీధిలో రాజీవ్ ఉన్న సంగతి హరి కవగత మయ్యింది. రాజీవ్ అని పలకరించగా హరి రాక నాతడు గుర్తించాడు. ఉదయం పదిగంటల సమయమది. ఆ రోజు కాలేజి లేదు. ఆదివారం ప్రత్యేకించి బంధించే యంశాలానాడు లేనందున ఆ రెసిడెన్షియల్ కళాశాలలో ఎవరి గదుల్లో వారు విశ్రాంతి తీసుకొంటున్నారు. హరికి తాను పరిష్కరించ దలచిన సమీకరణలో సమస్య వచ్చింది. అందువల్ల అతడు రాజీవ్ గదికి వెళ్లాడు. కానీ రాజీవ్‌ను ఈ యంశంలోకి దించలేక పోయాడు. అతని ఆలోచనా ధోరణి వేరుగా ఉంది.

రాజీవ్ : హరీ నీ లెక్కలన్నీ అయినాయా?

హరి : చేస్తున్నాను. ఇంతలో ఒక సందేహం కలిగింది. అది సరేగాని నీవు లెక్కలను చేశావా?

రాజీవ్ : లేదు. ఇంకా చేయలేదు. సంస్కృత పాఠం చెప్పేప్పుడు మాస్టారు నిన్న ఇచ్చిన వివరణాత్మక ఉపన్యాసం బాగుంది గదూ?

హరి : ఏమో? నాకంతగా గుర్తులేదు. విన్న విన్నంతవరకు బాగుందనే అనిపించింది. సాయంత్రం రూముకు పోయినప్పటి నుంచి హోమ్ వర్కును గూర్చి ఆంగ్లంలో చేయవలసిన grammar exercises గురించిన ధ్యాసేగాని సంస్కృతం విషయం తలంపుకైన రావటం లేదు. అంత వ్యవధి నాకు లేదు.

రాజీవ్ : వ్యవధి లేకేం ఉంది. ఉన్న కాలాన్నంతా లెక్కలకోసం, మిగిలిన వ్యవధిని ఆంగ్లం కోసం వ్యయం చేస్తున్నావు. సంస్కృతంపై నీ కాదర భావంలేదు. అందువల్ల నీవు దాన్ని గూర్చి ఆలోచించటం లేదు.

హరి : నీకు ఆదరమున్నందున సంస్కృత పాఠాన్నే గాక దానికి ముందుగా చెప్పిన అంశాలను గూడ నెమరు వేస్తున్నావు మరి లెక్కలు మొద లయిన గ్రూపు సబ్జక్ట్సు, ఆంగ్లం మొదలయిన వాటిపై నీ దృష్టి ఎక్కడ ఉంటుంది.

రాజీవ్ : గ్రూపుల్లో అన్నీ అరటిపండు ఒలిచిపెట్టినట్లు క్లాసులో చెబుతారు, క్లాసులో సరిగా వింటే మరల చదవనవసరం లేదు. ఆంగ్లంలో రాయవలసిన దాన్ని ఏదో పదినిమిషాల్లో పూర్తి చేయించవచ్చు ఇంక సంస్కృతం వాఙ్మయ సంబంధి అయినందున దీన్ని గూర్చి విన్న యంశాలను మనన ధ్యానాదుల వల్ల మరింతగా ఆలోచిస్తే అమృత సమానాంశాలను అనుభవంలోనికి తెచ్చుకోవచ్చు.

హరి : అందుకేగాదా వాఙ్మయాన్నాలో చనామృతం అన్నారు.

రాజీవ్ : సరిగా చెప్పావు. సరస్వతీ దేవికి ఒక స్తనం సాహిత్యం. అది ఆలోచనామృతం. రెండోది సంగీతం. అది ఆ పాత మధురం.

హరి : ఆ పాత మధురమంటే ఎంటో ?

రాజీవ్ : విన్నంత మాత్రాన మధురాతి మధురమైన అనుభూతితో నరుడు పరవశ మనస్కుడౌతాడు. దానితో శరీరంలోని అన్ని అవయవాలు ఒక్కమారు విశ్రాంతిని పొందుతాయి.

హరి : సాహిత్యం అలాగాదా ?

రాజీవ్ : రాగముక్తంగా సాహిత్యాన్ని ఛందోబద్ధమైన రచనను గానీ, లయా న్వితమైన గేయాన్ని ఆలపిస్తే దానినివిన్నంతనే శ్రవణాది ఇంద్రియ

గ్రామం సంతృప్తమై పారవశ్యాన్ని పొంది, హృదయానికి విశ్రాంతిని గల్గిస్తుంది. అంతేగాక సాహిత్యంలో ప్రతిపంక్తి, అందులోని ప్రతిపదము, అందలి ప్రతిధ్వని, వాని ఉచ్చారణలో ఉన్న ప్రతి అంశము మనస్సులో నిలుపుకుని రసాస్వాదించ వచ్చును. తాంబూల చర్వణం కొంతకు నీరసమయిపోతుంది. కవితారసం చర్వణం చేయగా చేయగా మరల మరల క్రొత్తభావ పరంపరను గల్గిస్తూ హృదయానికి ఆహ్లాద జనక మవుతుంది.

హరి : రాజీవ్ ఇక చాలు. నాకు ఈ లెక్కలో ఒక చిన్న చిక్కు ఎదురయ్యింది. దాన్ని విడదీసి చెప్పే శక్తి నీకు మాత్రమే ఉందని నీ దగ్గరకు వచ్చాను. అని ప్రస్తుతాంశంలో పడిపోతాడు.

అనంతరం అక్కడినుండి హరి తన చిక్కు ముడికి పరిష్కారాన్ని తెలుసుకుంటాడు. తన గదికిపోయి మిగిలిపోయిన ఆ లెక్కను చేసి మధ్యాహ్న భోజనానికి పోయే ప్రయత్నంలో ఉంటాడు.

లెక్క ఒక్కటే ఉన్నందున భోజనానంతరం చేయవచ్చునని, పుస్తకాలను బల్లపై ఉంచి కుర్చీలో కూర్చున్నాడు. అతని మనస్సు రాజీవ్‌ను గూర్చిన భావ పరంపరతో ఇలా ఇలా సాగిపోతూంది.

విన్నంత మాత్రాన ఎంత లెక్కనైనా పరిష్కరించగలగటమే గాక, తెలియని వారికి తెలిసేటట్లు ప్రోబ్లంసును వివరంగా చెప్పే తెలివిగలవాడు. తనలాగ శ్రద్ధతో చదివితే ఇంకా ఎంతగా గణితాది శాస్త్రాల్లో రాణింపు పొందు తాడో గదా రాజీవ్ అనుకొంటున్నాడు హరి. కాని ఆతనికి యాదృచ్ఛికంగా పాఠ్యమైన సంస్కృతంపై ఇంతటి ధ్యాస గలగటం దేనివల్లనో తెలియటం లేదు హరికి. ఈ విధానంగా సంస్కృతాభ్యాసం గావించినా ఎంత బాగా రాసినా వంద మార్కులకన్న రావుగదా. సామాన్య పరిజ్ఞానంతో రాసిన తమవంటి వారికి తొంభైకి పైగా మార్కులు వస్తాయి సంస్కృతంలో. మహా అయితే పది మార్కులకోసం రాజీవ్ తన సమయాన్నింతగా సంస్కృత భాషాభ్యాసానికి వినియోగించటం హరికి సమ్మతం గాదు. అందువల్ల ఆతనినీ ఉద్యమంనుంచి విరమింప చేయటం హరికి సాధ్యంగాని పని. హరి ఎంతగా హితోక్తులు పలికినా

రాజీవ్ చిరునవ్వుతో వింటాడే గాని అతని మాటలను సుతరాము ఆచరణలో పెట్టడని హరి అనుభవ పూర్వకంగా గ్రహించాడు.

సంస్కృతాన్నింతగా అధ్యయనం గావించటం, అందలి అపూర్వ విష యాలను గ్రహించాలని కావచ్చునని హరికి ఒక మారు తలంపు గలిగినది. ఈ పరిజ్ఞానం రాజీవ్ చదువనున్న వాస్తు శాస్త్రానికి ఉపయోగపడేది గాదు. అలాంటపు డింతగా సంస్కృతాన్ని అధ్యయనం గావించటం నిరర్థకమైన ప్రయాస. ఇంటర్ అయిన తరువాత గూడ రాజీవ్ సంస్కృతాన్నధ్యయనం గావిస్తాడేమో అని హరికి అనిపించింది. అలా అయితే హరి వాస్తుశాస్త్రంలో గాక B.Sc. లో చేరవలసి వస్తుంది. వలచివస్తున్న వృత్తివిద్యను కాలదన్ని పట్ట భద్రుడు గావటానికి రాజీవ్ పూనుకోవటం వివేకవంతుడు కావించే పని మాత్రం గాదని హరి కనిపించింది. ఆ తరువాత ఈ విషయంలో ఆలోచించటానికి హరి మనస్సు విరాకరించింది.

రాజీవ్ సంస్కృత భాషాధ్యయనంలో చూపుతున్న ప్రత్యేక శ్రద్ధ విషయం హరివల్ల సరసిజ విన్నది. ఈ మాట లామెకు రాజీవ్ విషయంలో రోషాన్ని గలి గించినాయి. కంట నీరు పెల్లుబికాయి. రాజీవ్ గ్రూపుకో ఉపేక్ష చూపటం సరసిజ కాందోళన కారకమయ్యింది. గ్రూపుపై శ్రద్ధ చూపనందున వాస్తుశాస్త్రంలో చేర లేదేమో రాజీవ్ అనే సందేహాన్ని వ్యక్తం చేసింది సరసిజ. కాని విన్నంతనే గ్రూపును పూర్తిగా గ్రహించుటయే గాక ఎంతోమంది తోడి విద్యార్థులకు, వారడి గిన చిక్కు లెక్కలను విడదీసి చెప్పటంలో నేర్పరితనం గలవాడు రాజీవ్ అయి నందున హర్షం గలిగింది. శోగ అశ్రు భీతి హర్ష భావముల కాకారమయిన సరసిజ హృదయంలో కిలికించితమనే వ్యభిచారి భావం చోటు చేసుకుంది. వ్యభిచారి లేదా సంచారీ భావాలు రసపుష్టికి దోహదకారు లవుతాయి. సరసిజ మనసులో రససిద్ధి కవసరమైన భావపరంపర చోటు చేసుకొంటుందని తలంపవచ్చును.

సంస్కృతం మాస్టారు సూచించిన మార్గాన్ననుసరించి రాజీవ్ కొన్ని సంస్కృత గ్రంథాల నాంధ్రాంగ్ల వివరణాత్మకాలను పఠించి ఆ కాలం నాటి సంఘం ఎలా ఉండేదో తెలుసుకోవటం కోసం నిరంతరంగా ప్రయత్నం చేస్తుండే వాడు. ఇంతలో ఇందుమతి స్వయంవరమనే పాఠం అయిపోయింది. తరువాత రాజీవ్‌కు కొన్ని సందేహాలు కలిగాయి. అవన్నీ ఆ పాఠాన్ని అవగతం చేసుకున్న

ఆలోచించినందున గలిగినవే. ఆ నాటి స్వయంవర స్వభావం ఏమిటి? రఘువును వరించిన తరువాత స్వయంవర సమాగత రాజలోకంలో మిగిలిపోయినవారి గతేమిటి? తాను వరించినంత కన్నా గొప్పవాడు మిగిలిపోయిన రాజుల్లో ఉంటే ఎలా? మిగిలిపోయిన రాజుల గుణగణాలను వివరించకయే స్వయంవరం సమాప్తమైతే ఎలా. నేడు ఏదేని ఉద్యోగానికి సమాహూతులయిన వారినందరినీ ఇంటర్వ్యూ చేయాలి. తరువాత ఎన్నికైనవారిని ప్రకటించటం జరుగుతుంది అందరిని ఇంటర్వ్యూ చేయకుండానే ఎన్నికయినవారి పేరు ప్రకటితమైతే ఎలా? ఈ మొదలైన సమస్య లతని మనసులో తల ఎత్తుతున్నాయి.

మన కావ్య పరిభాషలో ప్రసిద్ధ పురాణ గ్రంథాల్లో గల మరో స్వయంవరం దమయంతికి సంబంధించినది. నలదమయంతు లిరువురు పరస్పరం అనురక్తులు. ఈ జంటను ఒకచోట చేర్చటానికి, వివాహం జరిపించటానికి స్వయంరసం సహకరించింది. ఇంద్రాది దిక్పాలకు లీ స్వయంవరంలో సమావేశమైన రాజలోకంలో ఉన్నారు. కాని వారి ప్రయత్నాలు వ్యర్థమయినాయి. నలదమయంతుల వివాహానంతరం వారి వివాహానికి విఘాతం గల్పించాడు కలిపురుషుడు తుద కా జంట ఒకటైనారు. ఇందులో గూడ స్వయంవర సమాగత రాజలోక మంతటిని దమయంతికి వివరించటం జరుగలేదు. నిజ నలుని చేరుకున్నంతనే స్వయంవర సమావేశం ముగిసిపోయింది.

ఇందుమతి దమయంతి స్వయంవరముల్లో సమానధర్మా లున్నాయి. ద్రౌపతి సీతల స్వయంవరముల్లోని ధోరణి వేరు. సీతను వీర్యశుల్క అని ఆదికవి పెక్కు పర్యాయాలు రామాయణ మహాకావ్యంలో పేర్కొన్నాడు. ద్రౌపది స్వయంవరంలో గూడ అర్జున ప్రదర్శిత వీర్యమే శుల్కము. అయితే ఇంతటి వీర్యవంతు లీ స్వయంవర సమాగతులలో మరొకరుంటే ఏం గావాలి. రాముడు రంగ ప్రవేశం చేయటంతో సీతా స్వయంవరం ముగిసింది. అర్జుని ప్రవేశముతో ద్రౌపది స్వయంవరం ముగిసిపోయింది. అసలివి స్వయంవరాలు గాదా? స్వయంవరాలే సమాగత రాజలోకంలో నిర్దిష్ట వ్యక్తి కోసం ఉద్దిష్టమయినవే తన కూతురు నిర్దిష్ట వ్యక్తియందాసక్త చిత్తమయినదని తెలిసిన రాజులు స్వయంవరాన్ని ప్రకటించటం – అపుడా వ్యక్తి వస్తే వివాహం జరిపించటం వీర్యశుల్కమైన స్వయంవరంలో గూడ జరిగిందిదే. అభ్యర్థనకు భంగం కలుగుతుందనే భయంతో

వీరిలాంటి మార్గాన్ని అచరించేవారు. దమయంతికి ద్వితీయ స్వయంవరం ప్రకటించటంలో నిర్దిష్ట వ్యక్తియొక్క రాక ముఖ్యాంశం. ఆ వ్యక్తికి తప్పని సరిగా బాహుకుడు సారథిగా వస్తాడని స్వయంవరం ఏర్పాటు చేసినవారి అభిప్రాయమనేది సుస్పష్టం గదా.

శ్రీరామ అర్జున ఆజాది రాజులు జనక విరాటాదుల పుత్రికలకు వరులయితే బాగుంటుందని వారు తలంచారు. కాని మాట పోతుందనే భయంతో వారి నడుగ నిష్టంలేక, వీర్యాదులను శుల్కంగాను స్వయంవరంగానూ ఏర్పాటు గావించి అభీష్టాన్ని గుంభనగా సఫలం గావించుకున్నారు.

ప్లేటో సూచించిన వెల్ఫేర్ ప్లేటులోవలె రామాయణ కాలంనాటి భారతీయులు, ముఖ్యంగా క్షత్రియు లావశ్యమూర్తులు వారిలో ప్రప్రథమ స్థానాన్నాక్రమించేవాడు శ్రీరామచంద్రుడు. ఆనాటి శిశువులు నియతంగా విద్యాభ్యాసం చేసేవారు. ఆ నాటికున్న చతుర్దశ విద్యలను వారు కరతలామలకం గావించేవారు. విద్యాభ్యాసం ఆశ్రమాల్లో సాగుతుండేది. విద్య పూర్తి అయ్యిందని మహర్షికి నమ్మకం గలిగితే అప్పు డతనికి శైశవదశ తొలగిపోతుంది. అతడు నగర జీవనం ప్రారంభించవచ్చు. ఆశ్రమవాసులకు ఎలాంటి సమస్యలు రాకుండా రాజు కాపాడాలి. మహర్షుల తపస్సుకు విఘ్నం గానీ, ఆశ్రమ వాసంలో సుఖ గా జీవించే మృగాలను ఎవరును వేటాడరాదు. ఆశ్రమంలో ఉండే చెట్లు, లతలు సకాలంలో సక్రమంగా ఆకు దొడిగి, మొగ్గవేసి పుష్పించాలి. అలా జరగక పోయినా, పుష్పించటంలో విలంబం జరిగినా, ఆ దోషానికి రాజుగారి దుష్ప్రవర్తన కారణమై ఉంటుందని నాటి మహర్షుల నమ్మకం. రాజులందరు ఈ యంశాలను నమ్మి తదనుగుణంగా నడుస్తుండేవారు.

విద్యావంతులయినవారికి రాజాస్థానంలో ఆదరం లభించేది. బాధ్యతాయుతమైన పదవులను వారలంకరించేవారు. తమ విధులను శక్తివంచన లేక వారు నిర్వహిస్తుండేవారు. విద్యా విషయకంగా ఏ క్రొత్త సిద్ధాంతాన్ని ఎవరు ప్రతిపాదించినా దాన్ని వారు పరిశీలించి గ్రహించేవారు. ఎదుటివా రెవరైనా తన పాండిత్యాన్ని శంకిస్తూ ప్రసంగం చేస్తే దాన్ని సహించటం గౌరవప్రదం గాని యంశం. వారితో వివాదానికి తలపడి తన ఘనతను నిరూపించుకోవాలి. అలాగాని విద్యోద్యోగికి సంఘంలో గౌరవ ముండేది గాదు. అట్టివానిని జ్ఞానము నమ్ముకుని

బ్రదికే వ్యాపారిగా పరిగణిస్తారే గాని పండితునిగా తలంపరు. ఈ విధంగా సాగిన వివాదంలో పరాభూతు డయినవాడు తా నున్న పదవిని కోల్పోతాడు. గెలిచినవాడీ పదవి నలంకరిస్తాడు అనే యంశం అనంతర కాలంలో ఈ సంఘంలో జరుగు తుండేది.

రాజీవ్ సంస్కృత మాస్టారి సహాయంతో రఘువంశ మహాకావ్యంలోని ప్రథమ సర్గ నధ్యయనం గావించాడు. ఇది వారి పాఠ్యగ్రంథం గాకున్నా, ఉత్సాహపూర్వకంగా ఈ పని కుద్యమించాడు. ఒక దినం ఉదయం తరగతులకు పోయే ముందు హరి రాజీవ్ గదికి వచ్చాడు. అతని రాకను గూడ గుర్తించక రాజీవ్ తదేక ధ్యానంతో తన ముందున్న గ్రంథా న్నధ్యయనం గావించటంలో నిమగ్నుడై యున్నాడు. ఏదో గ్రూపుకు సంబంధించిన అపూర్వ గ్రంథం అని తలంచిన హరి ఊహ నిరర్థకమని తొందరలోనే అతని కవగతమయినది. ఆ గ్రంథం సంస్కృత భాషకు సంబంధించినది. లిపి గూడ ఆ భాషకు చెందినదే. దాని నామాన్ని రాజీవ్ చెప్పగా హరి విన్నాడు. ఇంతగా రాజీవ్ సంస్కృతా న్నధ్యయనం గావించటంలో గల అంతరార్థం హరికి తెలియరాలేదు. ఎంతగా సంస్కృతాన్ని పఠించినా తాను ముమ్ముందు చదువ నున్న వాస్తుశాస్త్రాదుల కే మాత్రం ఉపయోగపడదు గదా? రసాయన భౌతికశాస్త్రాలలో విశేష పరిశ్రమగానీ, గణిత శాస్త్రంలో లోతుపాతులను తెలుసుకోవటం గానీ ముమ్ముం దాతని విద్యాభ్యాసంలో ఉపకరిస్తుంది. రాజీవ్ చేస్తున్న కృషి నేల విడిచిన సాములా అతని కనిపించింది. ఈ పరిశ్రమను సరైన మార్గానికి మరల్చితే బాగుండు ననిపించింది కాని అలా మార్చటం ఎలాగనే విషయంలో అతనికి దిక్కు తోచ లేదు. రాజీవ్ మానసికంగా ఆరోగ్యంతో ఉన్నాడా లేక ఏదేని మానసిక వ్యధకు గురి అయినాడా అని అతని కనిపించింది. ఇంతగా ఆలోచిస్తున్న హరిని రాజీవ్ గమనించనైన లేదు. తన ధోరణిలో రఘువంశ పఠనంలో తలమునకలవు తున్నాడు. గ్రంథనామం హరికి రాజీవ్ చెప్పిన పది నిమిషాలకు హరితో రాజీవ్ మాట్లాడటం మొదలుపెట్టాడు. ఆ మాటలు గూడ తరగతులలో బోధకులనుగాని, పాఠ్యాంశాలను గాని, గ్రంథ సంచయాన్ని గానీ గురించి కాదు. సంస్కృత కవి కాళిదాసు రఘు వంశంలో ప్రతిపాదించిన యంశాలను, ఆనాడున్న సమాజాన్నీ, వారి నియమావళిని గూర్చి చెప్పటం మొదలుపెట్టాడు.

రాజీవ్ : రాజరికాన్ని విమర్శించారు రాముడికూడా. ముఖ్యంగా శ్రీశ్రీ దృష్టిలో రాజులకు ఆనాటి ముఖ్యవృత్తి పరమధ్యేయం పరపీడన పరాయణత్వం నాటి రాజులు కాలానికి కత్తుల వంతెనలను నిర్మించారు. గత కాలంలో యుద్ధం జరగని భూభాగం సూదిమొన మోపదగినంత ప్రదేశంలోనన్నా లేదని ఆయన తలంపు. గత కాలంలో ఈ భూమి అప్తుల మరణాలతో, వ్యథిత చిత్తులయిన వారి కన్నీటితో తడిసింది లేదా రణరంగంలో జన సమూహంతో పాటు గజాశ్వాల రక్తపాతంతో సిక్తమయ్యిందంటాడు.

హరి : శ్రీశ్రీ రచించిన దేశ చరిత్రలనే కవితా ఖండికలో ఉన్న ఈ యంశాలన్నీ హైస్కూలు తరగతుల్లో నేను విన్నాను. ఇదంతా నిజమని నా నమ్మకం.

రాజీవ్ : నీవే కాదు హరీ, ఈ యంశాలను నూటికి నూరుపాళ్ళు యథార్థాలుగా చాలామంది నమ్ముతారు. శ్రీశ్రీ రచనలో భాషలో భావ ప్రతిపాదనలో ఉత్తేజం ఉన్నది. ఈ ఉద్వేగానికి మనవారు ముఖ్యంగా నెత్తురుమండే శక్తులు నిండే మన సోదరులు లోనవుతారు.

హరి : అంటే నీవీ యంశాలను నమ్మటం లేదా? నీలో మండే నెత్తురు లేదా? ఈ వయస్సులోనే వార్ధక్యం వచ్చిందా?

రాజీవ్ : నీ మాటలవల్ల వయస్సు వికారం వల్లగలిగే భావావేగానికి శ్రీ శ్రీ రచన దోహదాన్ని కలిగిస్తుంది. పసితనంలో వివిధ విషయాలను, వాస్తవాలను అవగతం చేసుకుంటే సమగ్ర దృష్టి గలుగుతుంది. ఈ సమీచతను యువవీరులు వార్ధక్యంగా అంటున్నారు.

హరి : అంటే సమీచతను నీవు చేరుకున్నావన్నమాట. అంటే ఈ వయస్సులోనే నీవు పెద్దల మనస్తత్వాన్ని అలవాటు చేసుకుంటున్నావని నీవంటున్నావా? అని హరి నవ్వేశాడు.

రాజీవ్ : ఇందులో నవ్వవలసిందేముంది నాకంతటి సమీచీనత లేకున్నా ఈ నాటి యువకుల్లో ఉండే పొంగుపాల పొంగులాంటిది లేదని మాత్రం చెప్పగలను.

బ్రదికే వ్యాపారిగా పరిగణిస్తారే గాని పండితుడుగా తలంపరు. ఈ విధంగా సాగిన వివాదంలో పరాభూతు డయినవాడు తా నున్న పదవిని కోల్పోతాడు. గెలిచినవా డీ పదవి నలంకరిస్తాడు అనే యంశం అనంతర కాలంలో ఈ సంఘంలో జరుగు తుండేది.

రాజీవ్ సంస్కృత మాస్టారి సహాయంతో రఘువంశ మహాకావ్యంలోని ప్రథమ సర్గ నధ్యయనం గావించాడు. ఇది వారి పాఠ్యగ్రంథం గాకున్నా, ఉత్సాహపూర్వకంగా ఈ పని కుద్యమించాడు. ఒక దినం ఉదయం తరగతులకు పోయే ముందు హరి రాజీవ్ గదికి వచ్చాడు. అతని రాకను గూడ గుర్తించక రాజీవ్ తదేక ధ్యానంతో తన ముందున్న గ్రంథా న్నధ్యయనం గావించటంలో నిమగ్నుడై యున్నాడు. ఏదో గ్రూపుకు సంబంధించిన అపూర్వ గ్రంథం అని తలంచిన హరి ఊహ నిరర్థకమని తొందరలోనే అతని కవగతమయినది. ఆ గ్రంథం సంస్కృత భాషకు సంబంధించినది. లిపి గూడ ఆ భాషకు చెందినదే. దాని నామాన్ని రాజీవ్ చెప్పగా హరి విన్నాడు. ఇంతగా రాజీవ్ సంస్కృతా న్నధ్యయనం గావించటంలో గల అంతరార్థం హరికి తెలియరాలేదు. ఎంతగా సంస్కృతాన్ని పఠించినా తాను ముమ్ముందు చదువ నున్న వాస్తుశాస్త్రాదుల కే మాత్రం ఉపయోగపడదు గదా? రసాయన భౌతికశాస్త్రాలలో విశేష పరిశ్రమగానీ, గణిత శాస్త్రంలో లోతుపాతులను తెలుసుకోవటం గానీ ముమ్ముం దాతని విద్యాభ్యాసంలో ఉపకరిస్తుంది. రాజీవ్ చేస్తున్న కృషి నేల విడిచిన సాములా అతని కనిపించింది. ఈ పరిశ్రమను సరైన మార్గానికి మరల్చితే బాగుండు ననిపించింది కాని అలా మార్చటం ఎలాగనే విషయంలో అతనికి దిక్కు తోచ లేదు. రాజీవ్ మానసికంగా ఆరోగ్యంతో ఉన్నాడా లేక ఏదేని మానసిక వ్యధకు గురి అయినాడా అని అతని కనిపించింది. ఇంతగా ఆలోచిస్తున్న హరిని రాజీవ్ గమనించనైన లేదు. తన ధోరణిలో రఘువంశ పఠనంలో తలమునకలవు తున్నాడు. గ్రంథనామం హరికి రాజీవ్ చెప్పిన పది నిమిషాలకు హరితో రాజీవ్ మాట్లాడటం మొదలుపెట్టాడు. ఆ మాటలు గూడ తరగతులలో బోధకులనుగాని, పాఠ్యాంశాలను గాని, గ్రంథ సంచయాన్ని గానీ గురించి కాదు. సంస్కృత కవి కాళిదాసు రఘు వంశంలో ప్రతిపాదించిన యంశాలను, ఆనాడున్న సమాజాన్ని, వారి నియమావళిని గూర్చి చెప్పటం మొదలుపెట్టాడు.

రాజీవ్ : రాజరికాన్ని విమర్శించా రాఘునికులు. ముఖ్యంగా శ్రీశ్రీ దృష్టిలో రాజులకు ఆనాటి ముఖ్యప్రవృత్తి పరమధ్యేయం పరపీడన పరాయ ణత్వం నాటి రాజులు కాలానికి కత్తుల వంతెనలను నిర్మించారు. గత కాలంలో యుద్ధం జరగని భూభాగం సూదిమొన మోపదగినంత ప్రదే శంలోనన్నా లేదని ఆయన తలంపు. గత కాలంలో ఈ భూమి ఆప్తుల మరణాలతో, వ్యధిత చిత్తులయిన వారి కన్నీటితో తడిసింది లేదా రణరంగంలో జన సమూహంతో పాటు గజాశ్వాల రక్తపాతంతో సిక్తమయ్యిందంటాడు.

హరి : శ్రీశ్రీ రచించిన దేశ చరిత్రలనే కవితా ఖండికలో ఉన్న ఈ యంశా లన్నీ హైస్కూలు తరగతుల్లో నేను విన్నాను. ఇదంతా నిజమని నా నమ్మకం.

రాజీవ్ : నీవే కాదు హరీ, ఈ యంశాలను నూటికి నూరుపాళ్ళు యథార్థాలుగా చాలామంది నమ్ముతారు. శ్రీశ్రీ రచనలో భాషలో భావ ప్రతిపాదనలో ఉత్తేజం ఉన్నది. ఈ ఉద్వేగానికి మనవారు ముఖ్యంగా నెత్తురుండే శక్తులు నిండే మన సోదరులు లోనవుతారు.

హరి : అంటే నీవీ యంశాలను నమ్మటం లేదా? నీలో మండే నెత్తురు లేదా? ఈ వయస్సులోనే వార్థక్యం వచ్చిందా?

రాజీవ్ : నీ మాటలవల్ల వయస్సు వికారం వల్లగలిగే భావావేగానికి శ్రీ శ్రీ రచన దోహదాన్ని కలిగిస్తుంది. పసితనంలో వివిధ విషయాలను, వాస్తవాలను అవగతం చేసుకుంటే సమగ్ర దృష్టి గలుగుతుంది. ఈ సమీచతను యువనీకులు వార్థక్యంగా అంటున్నారు.

హరి : అంటే సమీచతను నీవు చేరుకున్నావన్నమాట. అంటే ఈ వయస్సు లోనే నీవు పెద్దల మనస్తత్వాన్ని అలవాటు చేసుకుంటున్నావని నీవంటున్నావా? అని హరి నవ్వుతాడు.

రాజీవ్ : ఇందులో నవ్వవలసిందేముంది నాకంతటి సమీచీనత లేకున్నా ఈ నాటి యువకుల్లో ఉండే పొంగుపాల పొంగులాంటిది లేదని మాత్రం చెప్పగలను.

హరి : అంటే నీకు నవభావాలు, విప్లవరచనలు తన్మయతను పారవశ్యాన్ని కళ్ళిన సంఘంలోని అన్యాయాన్ని తలంచి దుఃఖంతో, సిగ్గుతో తలవంపును కలిగించటం లేదన్నమాట.

రాజీవ్ : నవభావాలను నేను అర్థం చేసుకున్నాను. కాని దానిలో ఉద్రేకం, రెచ్చగొట్టే స్వభావం తప్ప ఏం లేదన్నమాట. మన ప్రాచీనులు గూడ నవభావాలను చవిచూచారు, కవిత్వంలో ప్రతిపాదించారు. వారి మార్గంలో ఆడబరం లేదు. రెచ్చగొట్టటం వారి ఉద్దేశం గాదు.

హరి : అసలు ఆనాటి వారీనాటి వారివలె ఆలోచించారనటానికి ఆధారాలెక్కడైనా దొరుకుతాయా?

రాజీవ్ : అనేకానే కోదాహరణాలున్నాయి.

హరి : ఒక్కదాన్ని చెప్పు.

రాజీవ్ : సావధానంగా విను హరీ తొందరపాటు తగ్గించుకో.

హరి : వినటానికి సిద్ధంగా ఉన్నాను. త్వరగా చెప్పు.

రాజీవ్ : వెనుకటి రాజులను వారి చరిత్రలను శ్రీశ్రీ కత్తుల వంతెనలు మొదలయిన పరిభాషలో వివరించాడు గదా, అది అవాస్తవం. రక్తపాతాన్ని సహించలేక యుద్ధాన్ని త్యజించిన అశోకుడు మన దేశంలోనివాడే గదా. మానవ సంతాపాన్ని, దుఃఖభూయిష్ట జీవితాన్ని సహించలేక రాజ్యత్యాగం చేసి మానవుల కందరికి దుఃఖ విరానక మార్గాన్ని ప్రతిపాదించిన బుద్ధుడు ఈ నేలపై పుట్టినవాడే గదా.

హరి : ఇలా ఒక రిద్దరున్నారేమో గాని గుప్తుల స్వర్ణయుగంలోని రాజులందరు రక్తపాతాన్ని ప్రోత్సహించి విజయయాత్రల పేరుతో శ్రీశ్రీ చెప్పినట్లుగా పుడమి తల్లిని తన పుత్రుల రక్తంతో సిక్తం గావించారనేది వాస్తవమే గదా.

రాజీవ్ : యుద్ధం చేసి తన భుజబలాన్ని ప్రకటితం చేసుకోవటం ఆనాటి రాజకీయాల్లో అతి ముఖ్యమయిన అంశం. అలా కాకుంటే ఆ నాటివారు రాజును యుద్ధ భీరువుగా, భుజబల రహితుడుగా, సుసంఘటిత సైన్యబలం లేనివాడుగా తలంచటం పరిపాటి. అలా తలంచటంవల్ల

దేశంలో శాంతి సుస్థిరతలకు భంగంవాటిల్లే ప్రమాదం ఉండేది. ఆ నాటి రాజులు వీలైనంతగా రక్తపాతాన్ని వారిస్తుండేవారు. ఆ నాడు భారతదేశీయు లయిన రాజులు తమ భుజబలాన్ని, శౌర్య పరాక్రమాలను ప్రకటించుకోవటం కోసం మాత్రమే యుద్ధం చేస్తుండేవారు. తమ రాజ్యాన్ని విస్తరించాలని మాత్రం కాదు.

హరి : తమ తమ రాజ్యాలను విస్తరింపజేసే ఉద్దేశం లేనినాడు యుద్ధాలను చేయటం దేనికి?

రాజీవ్ : తమ ఇరుగు పొరుగు దేశాలను జయించటం మరల ఆ దేశాల నాయా రాజులకే అభిషేకాది సంస్కారాల మూలాన సంక్రమింప చేయుట ఆ నాటి యుద్ధాలలో పర్యవసానం. ఈ యంశాన్ని కాళిదాసు సుస్పష్టం గావించాడు. జైత్రయాత్ర గావించిన రఘు మహారాజు తాను జయించిన దేశాలను మరల తత్పాలకులకే ఇచ్చాడని తెలిపాడు. ఈ సందర్భంలో కాళిదాసు ప్రయోగించిన ఉపమ హృద్యం. వరి నారును పీకి మరల నాటటం వ్యవసాయంలో నిత్యం జరగుతుంటుంది. అందువల్ల దిగుబడి ఇబ్బడి ముబ్బడి అవుతుంది. అలా కాక నారు నలానే ఉంచితే వచ్చే పంట చాలా తక్కువ. అలాగే రాజులను తమ తమ రాజ్యాధికారం నుంచి తొలగించి మరల వారి కాయాదేశ పాలనాధికారాన్ని సంక్రమింపజేస్తే వారు తమ్ము జయించిన రాజులకు విధేయులయి ఉండటమేగాక, యజ్ఞాది సత్కార్యాలను చేయ తలంచినపుడు పునః ప్రతిష్ఠాపితులైన రాజులు తమ్ము జయించిన మహారాజులకు తగు ధన ధాన్యా ద్యుపాయానాల నందజేస్తారు. అలా చేయటంవల్ల యజ్ఞం నిర్విఘ్నంగా సాగుతుంది. ధర్మరాజు రాజ సూయం చేయ దలంచినపుడు, ఆయన తమ్ములు నలుగురు ఈ విధంగా కప్పాన్ని వసూలు చేశారు.

హరి : అసలు యజ్ఞం చేయటం దేనికి? దేవతల సంతృప్తికా? అలా అని యజ్ఞ నిర్వాహకుడు యుద్ధాల్లో ఎంతో మందిని చంపటం ఏం బాగుంది?

రాజీవ్ : ఆనాటివారు గావించింది ధర్మయుద్ధం. ఇంతగా సంఘం ముందుకు సాగిన ఈ యుగంలో జరిగే యుద్ధాలు యోధులుగాని వారిని, అమా

యక ప్రజలను, స్త్రీ శిశు వృద్ధులను హతమారుస్తున్నాయి. ఆనాడు యుద్ధరంగంలో ధనుస్సు ధరించి ప్రత్యర్థుల నెదుర్కొనే వారినే చంప దలంచేవారు గాని తదితరులను గాదు. ఇప్పటికి యాభై సంవత్సరాల క్రితం జపాను నగరాలపై అణుబాంబు ప్రయోగం ఎంతగ జన జీవి తాన్ని నశింపజేసిందో, ఇంకా ఆ ప్రాంతాల వారికి ఈ సంఘటన తరు వాత గలిగిన, కలుగుతున్న, కలుగనున్న సంతతిని వికలాంగులను చేస్తుందో మనకు తెలుసు. ఇలాంటి సంఘటనలు జన సంక్షయం నాడులేదు. ఆ నాటి వారిలా దుష్టమైన ఆయుధాలను తయారుచేయ లేమ

హరి : అణుబాంబులు మొదలయిన వాటిని నేటి శాస్త్రీయ పరిజ్ఞానం తయారు చేస్తుంది. కాని నాటివారి కంతటి పరిజ్ఞానం ఏక్కడిది ?

రాజీవ్ : నాటివారు అణువును గుర్తించారు. అణు విస్ఫోటనం వల్ల సృష్టి స్థితికే ప్రమాదం వాటిల్లుతుందని వ్యక్తీకరించారు. మానవజాతి మనుగడకు ప్రమాదకారియైన ఆయుధాల నిర్మాణానికి వారు ఉన్ముఖులు గాదు. నేడు గూడ మనదేశం మానవజాతి మనుగడకు ప్రమాదం గలిగించే ఆయుధ నిర్మాణాన్ని నిషేధించటం వైపే మొగ్గు చూపు తూంది.

ఇంక యజ్ఞం చేయటంలో లౌకిక అలౌకిక ప్రయోజనాలున్నాయి. దేవతల సంతృప్తి అనేది అలౌకికం. ఈ తృప్తికోసం హోమగుండంలో నెయ్యి మొదలయిన తైలాలనే గాక సుగంధ ద్రవ్యాల కాల్చుతుంటారు. దీనివల్ల యజ్ఞం చూడటానికి వచ్చిన జన సందోహానికి సుగంధ భరితమయిన వాయువు నాస్వాదించే వీలు గలుగుతుంది. యజ్ఞవేదిక నగరానికి సుదూరంగా, జన పదాలకు తొలగి ఉంటుంది. ఆ ప్రదేశమంతా అరణ్యం. అందులో సాధు జంతువులే గాక క్రూర మృగాలు, విషసర్పాలు, క్రిమికీటకాదులెన్నో ఉంటాయి. ఈ సుగంధం అలాంటి వాటికి ప్రాణాపాయం కలిగించకుండా అక్కడినుండి సుదూరం తీసుకుపోతుంది.

అంతేగాక ఆ నాటి యజ్ఞం ఒక విధంగా, ఈనాడు అభివృద్ధికి ప్రయ త్నించే దేశాలవారు ఆచరణలో పెడుతున్న వార్షిక పంచవార్షిక ప్రణాళికల్లాంటివి.

హరి : రాజీవ్! నీకు సంస్కృతమంటే అభిమానం ఉండవచ్చు గాని, ఆనాటి భారతీయ సమాజంలోని ప్రతి యంశం నేటి సాంఘిక నియమాలకు, రాజకీయ స్థితిగతులకు సమానమని నిరూపించటానికి చేసే ప్రయత్నం సమంజసంగా లేదని నాకనిపిస్తుంది.

రాజీవ్ : నీవు పరిస్థితులను అవగతం చేసుకోవటానికి ప్రయత్నించు ఏ యంశానికైనా బొమ్మ బొరుసు అని రెండు అంశాలని వార్యంగా ఉంటాయి. సమీచీన మయిన భావనవల్ల విశేష పరిజ్ఞానం గలుగు తుంది. అందుకే మనవారు 'విద్యాదదాతి వినయమ్' అన్నారు. గ్రంథపఠనం, తదనుశీలనం వల్ల వినయం గలుగుతుంది. వినయ మంటే సమగ్రమైన అవగాహన.

హరి : సమగ్రమైన అవగాహన వల్ల నీవు యజ్ఞాన్ని పంచవర్ష ప్రణాలిక లనటంలోని సామంజస్యాన్ని వివరిస్తావా?

రాజీవ్ : తప్పకుండ నేను చెప్పేపుడు నడుమ నడుమ సందేహాలను వ్యక్తీ కరించకుండా పూర్తిగ వినాలి. ఆ తరువాత నీ సందేహాలు నా సమాధానాలు.

హరి : అలాగే.

రాజీవ్ : ఆనాటి రాజు ఈనాటి ప్రభుత్వము తుల్యంగా ఉన్నట్లు తలంచు యజ్ఞం చేయటానికి తగిన ధాన్యాదులను, సువర్ణ రజత రూపంలో ధనాన్ని నాటి రాజులు సామంతుల ద్వారా ప్రజలపై సుంకం ద్వారా వసూలు చేస్తుండేవారు. ఈ నాడు ప్రభుత్వం ఆదాయపు పన్ను, అమ్మకపు పన్ను, భూమి శిస్తుల మూలంగా ధనాన్ని కూడ బెడు తూంది. ఈ నాటి ప్రభుత్వాలు విదేశాలనుంచి అప్పు తీసుకొంటాయి. నాటి రాజులకు సామంతులు వివిధాలైన ఉపాయినాలను అంద జేస్తుండేవారు. యజ్ఞానంతరం రాజు నిర్ధనుడవుతాడు. విశ్వజిద్యజ్ఞాన్ని నిర్వహించిన రఘుమహారాజు తన ప్రాసాదంలో సువర్ణమయ గృహోపకరణాలను వ్యయం గావించి వాటికి బదులుగా మట్టి పాత్ర లను వాడుక చేస్తున్న స్థితిని కాళిదాసు వర్ణించాడు. ప్రణాళిక నమలు పరచిన తరువాత ప్రభుత్వాల స్థితి యంతే ప్రభుత్వం లోటు బడ్జట్లో

నడుస్తుందంటారు. లోటు అంటే అప్పే ఖర్చుకన్న ఆదాయం తగ్గటం లోటు. ఈ లోటు పూడ్చడానికి వ్యయాన్ని తగ్గించుకొనుట, వేర్వేరు మార్గాల్లో ధన సంచయనం గావించటం నేటి ప్రభుత్వాలమలు పరుస్తున్న యంశాలు.

దేశ శ్రేయస్సు విషయంలో ప్రణాళికలకు, యజ్ఞానికి పోలికలున్నాయి. పండితులయిన వారందరూ తమతమ దేశాల్లో జరిగే యజ్ఞాలకు పిలుపునందుకునే వారు. వారంతా యజ్ఞ సమయంలో ఏకత్ర సమావేశమయ్యేవారు. వారువారు తమతమ శాస్త్రాది విషయాల్లో చర్చలు సాగించేవారు. శాస్త్రీయమైన అంశాలపై చర్చలు గావించటం, ఎదటి వారి తలంపులను అవగతం చేసుకొనటం, వారి వాదంలో ఉన్న ప్రత్యేకతలను పరిశీలించి సత్యమనిపిస్తే పరిగ్రహించటం జరుగుతుండేవి. ఈ నాడు మనం జరుపుకునే 'workshops, conferences, seminars' మొదలయిన వాటిని పోలి ఉన్నాయి ఈ విధానాలు. పండితులను యజ్ఞకాలంలో సత్కరిస్తుండేవారు. సంపద ప్రజా సందోహానికీ విధంగా చేరేది. ప్రణాళికలు గూడ ప్రజా సందోహానికి సిరిసంపదల నందజేయటానికి, తగిన జలాశయ నిర్మాణాలకు, విద్యుదుత్పాదక యంత్రాల స్థాపనకు, విశ్వవిద్యాలయాలకు, కళాశాలలకు ఆర్థికసాయం చేయటంలో కృషి చేస్తుందని ఇంకా ఇంకా తన ధోరణిలో ప్రసంగిస్తుండగా తన ముఖాన్నదో విధంగా పెట్టాడు హరి. ఈతని ముఖంలో గలిగిన మార్పు, తన మాటలను విని గ్రహించే శక్తి నన్నగల్లిందనే అంశాన్ని సూచిస్తుందని రాజీవ్‌కు సుపరిచితం. అయినా తన వాగ్ధోరణిని ఆపుకోలేని ఉద్రేకానికి లోనైనందున మరికొంత ఉపన్యసించి తన ప్రసంగాన్ని విరమించాడు.

**హరి** : నీ వంటున్న మాటల్లోని సారాంశాన్ని నేను గ్రహించలేక పోతున్నాను. తెలిపిన యంశాలను కొన్నింటిని నమ్మలేకపోవటం జరుగుతుంది. యజ్ఞాల్లోనే మానవజాతి సంరక్షణ అంటున్నావు. యజ్ఞాలకు పండితు లాహ్వానితు లవుతారంటున్నావు. మరి సామాన్య ప్రజలు యజ్ఞాలకు అనాహూతులు గదా? అలాంటప్పుడు వారక్కడకు రారు. రావాలనుకున్నా కుల వర్గ భేదాలున్న ఆ నాటి సంఘంలో జరుగుతుందా? ఆ నాటి సంఘంలో సామాన్యుని జీవిత విధానం ఏమిటనే

దానికి తగిన నిదర్శనాలు లేవు గదా? తాజ్‌మహల్ నిర్మాణంలో రాళ్లెత్తిన కూలీ లెవ్వరు అని శ్రీశ్రీ మాటను జ్ఞప్తికి తెచ్చాడు.

ఇంతలో ఆ గదిలోకి రాజీవ్‌కే గాక హరికి గూడ మిత్రుడయిన ఒక విద్యార్థి వచ్చాడు. అతను వారితో పాటు చదువుతున్నవాడే కాని అతని తల్లిదండ్రులు లా నగరంలో నివసించేవారు గాదు. అక్కడికి కొంత దూరంలో ఉన్న గ్రామవాసులు. ఆ గ్రామానికి బస్సులో పోవాలంటే చాల చిక్కుతో గూడిన పని. రోడ్డు సరిగా ఉండదు. నడుమ రెండు మూడు వాగులున్నాయి. వర్షాకాలంలో ఆ గ్రామానికి బస్సు పోయే ప్రశ్నే లేదు. మిగతా కాలంలో గూడ ఎంతో కష్టంమీద ఆ దారిలో బస్సు పోతుంది. ఆ రోడ్డుకు తగినట్టే ఆ దారికి ప్రభుత్వమువారు ఇచ్చిన బస్సు చాల పాతది. బ్రేకులు సరిగా పడకపోవటమే గాక ఇంకా చాలా లోపా లున్నట్లు డ్రైవరు తరచు ప్రయాణీకులకు చెబుతుంటాడు. మార్గ మధ్యంలో ఆ బస్సు తరచుగ ఆగిపోతుంటుంది.

అక్కడికి వచ్చిన విద్యార్థి పేరు చంద్రాయుడు. పేరునుబట్టె అతని తల్లిదండ్రుల విద్యావివేకాదుల నూహింపగలం. వారు దళితులకు చెందినవారు. అతని తండ్రి అతివాది. కొంతకాలం అజ్ఞాతవాసంలో గడిపాడు. తుదకు పోలీసుల తుపాకీకి బలియైపోయాడు. వాణ్ణి చూస్తేనే వాని తెలివితేటలు వ్యక్తమవుతాయి. నెమ్మదిగా ఉంటాడు. ఒకమారు విన్నంతనే గ్రహిస్తాడు. గ్రహించినట్లు గానీ, తెలివితేటలు గలిగినట్లు గానీ ఎదుటివారు గ్రహించలేరు. అన్నీ అర్థం చేసుకున్నా ఏమీ ఎరగనట్లుగా, అమాయకుడులాగా ఉండటం అతని సహజలక్షణం. హృదయం మధురాతి మధురం. స్నేహశీలి. అతడంతగా మాట్లాడడు. తన్నెవరైన పలకరిస్తే ముక్తసరిగ బదులు చెబుతాడు. అత డన్ని అవయవాలతో పరిసరాలను పఠనం గావిస్తాడు. తన భావాలను ప్రకటన చేయటంలో ఎకానిమీని పాటిస్తాడు. అలాంటివాడు శ్రీశ్రీ పంక్తి వినటంతో ఉద్రిక్తుడయినాడు. సాంఘిక న్యాయం సామాన్యునకు జరగటం లేని ఈ యంశంలో వెనుకటివారి బాధలకు గురయ్యారనీ చంద్రాయుడు, ఈ నడుమ ఆర్థిక శాస్త్రాన్ని, అందులోను మార్క్స్ సిద్ధాంతాన్ని చదివినందున గ్రహించాడు. అందువల్ల ఈ విషయంలో వివరణ

కోరాడు. ఈతని మాటను విని హరి విస్మిత వదనుడయినాడు. తన భావాలను ప్రకటించేందుకు మరో అవకాశం అందున చంద్రాయుని ముఖం నుండి వచ్చినందున, అతణ్ణి వివేకవంతుణ్ణి చేయగలననే నమ్మకంతో, రాజీవ్ చెప్పదలంచినా ఇప్పటికే కాలమతీతమయినందున వారు ముగ్గురు మెస్సుకు బయలుదేరారు. తరువాత వీలైతే సాయంకాలం గానీ, లేక మరునాడు గానీ రాజీవ్ చంద్రాయుని సందేహానికి సమాధానం చెబుతానన్నాడు. ఆ మాటకు చంద్రాయుడు మౌనంగానే తన అంగీకారాన్ని తెలిపాడు. హరికి మరల సుదీర్ఘమైన ఉపన్యాసం వినాలనిపించటం లేదు. ఇలా వారి ధోరణులలో వారుండగా మెస్సు వచ్చేసింది.

ధనవంతుల పిల్లల పోషణలో రూపుదిద్దుకున్నదీ మెస్సు. దీనికి ఏ హంగులోను తక్కువదనం లేదు. సువిశాలమైన మైదానంలో ఉందీ భవనం. దీని చుట్టూ నేత్రపర్వం గావించే పుష్పభరితాలయిన లతలు మొక్కలు ముద్దుగా పెరిగి ఉన్నాయి. ఆ ప్రాంతానికి మొదటిసారిగా పోయినవారికి కా ఉపన రామణీయకం నేత్రపర్వంగా ఉంటుందనేది వాస్తవం. అందులో నీటి సౌకర్యం ఉన్నా కూరగాయలను, ఫలవృక్షాలను వారు పెంచటం లేదు. ఆర్థికంగా స్తోమత గలవారి పిల్లల భోజనశాలకున్న ఉపవనంలో ఆలా ఆర్థిక దృష్టితో చూడవలసిన పనిలేదు. మరీ ప్రెష్‌గ ఉండే కొతిమేర మొదలైనవాటిని రంగు రంగుల రాళ్ళ మధ్య పెంచుతున్నారు. అందువల్ల ఆ ప్రాంతంలో పుష్ప సుగంధమే గాక కొతిమేరవల్ల జనించే సువాసన గూడా వ్యాపించి నాసికా రంధ్రాలకు సంతృప్తిని గలిగిస్తుంది. మెస్సు లోపలకు పోయే ద్వారానికున్న తలుపు అందంగా ఉంది. తెరచుకుని లోపలకు పోయినంతనే, ఆ తలుపు అప్రయత్నంగానే అంటే తనంత తానే మూసుకుపోతుంది. ఆ ద్వారాన్ని చేరుకునే మెట్లు ప్రక్కగా ఉన్నాయి. బయటివారికి మెట్లెక్కువారికి భోజనశాల లోపలి భాగం కనరానిదిగా ఉండేందుకీ నియమాలను భవన నిర్మాణంలోనే వీరు ఏర్పాటు చేశారనిపిస్తుంది. వెలుపలి సొగసుకు రూపానికి ఏ మాత్రం తీసిపోని నిర్మాణం లోపల ఉంది. అది ధనికుల ఇంటిలో ఉండే భోజనశాలలోని అమరికలకు ఏ మాత్రం తగ్గనిది. ఏ ఇంటియందు లేనంత వైశాల్యం గల దీ మెస్సు. నిత్యం అన్నపానాదులను ఎంతోమంది కందించే ఆ భోజనశాలను పరిశుద్ధి గావించటానికి ఎంత ప్రయత్నం చేస్తున్నా, కాలదోషం పట్టిన పదార్థాల నుండి వచ్చే అలతియలతి దుర్వాసన ఆ ప్రాంతంలో ఉంది,

విత్యం అక్కడుండే వారి కా వాసన అలవాటయినది గాని, కొత్తవారి కా గంధం స్వాగత మిస్తుంటుంది.

చంద్రాయు డంతటి ధనికుడు గాకున్నా, అసలతడు పితృ విహీనుడయినా ఆ భోజనశాలలో ఉండగలగటం ఎలా? ఎంతో వ్యయం చేయాలి గదా, అతనికి సాధ్యమా? అనే సందేహం మనకు గలగ నవసరం లేదు. చంద్రాయుడు ఇంటర్‌లో పొందిన మార్కులే గాక, ఆ కళాశాలలో చేరటానికి నిర్వహించిన పరీక్షల్లో మంచి మార్కులను పొందాడు. చేరేటప్పు డాతని ధనహీనతను విని అధికారు లతనికి earn while you learn scheam క్రింద ఉద్యోగా న్నిచ్చారు. అది రాత్రిపూట చేయదగిన ఉద్యోగం, రాత్రి కాపలావా రా కళా శాలకు నాలుగ్గై దుగు రున్నారు. అందులో ఎవడు సెలవు తీసుకున్నా ఆ పనికి చంద్రాయుణ్ణి నియమిస్తారు. అలా ప్రతి నెలలో కనీసం పదిహేను దినాలు చంద్రాయుడు ఉద్యోగి అవుతాడు. దానివల్ల వచ్చిన జీతం అతని భోజనాది ఖర్చు లకు పోగా కొంత మిగుల్తుంది. దాన్ని తన తల్లి కపుడపుడు అతడు పంపుతాడు.

చంద్రాయుడు కాపలాదారుగా ఉన్నపుడు ఆ వసతిగృహంలోనివారు కొందరు ఇబ్బందులకు లోనయ్యేవారు. కాపలావారు కాలాతీత మయినాక బయటి నుంచి లోపలికి రావలసిన విద్యార్థులను అపుకునేవారు గారు. ముందుగా వారికి అలా ఆలస్యంగా వచ్చే సందర్భాల్లో కాపలాదార్లు నిద్రలో మునిగి ఉండేవారు. అలాంటి సందర్భంలో వెలపలివారు ఏదో విధంగా లోపలికి వచ్చేవారు. చంద్రా యుడు తన విధి నిర్వహణలో అప్రమత్తుడు. అతడు నిద్రపోయే ప్రశ్న లేదు. కాలాతీత మయినాక వచ్చేవా రిచ్చే బహుమానాలకు, మెత్త మెత్తని మాటలకు, వాగ్దానాలకు చంద్రాయుడు లొంగేవాడు గాడు.

ఇంతేగాక రెండో సినిమా అయిన తరువాత ఒకటి ఒకటిన్నర గంటలకు ఒక్కో సందర్భంలో మామూలు కాపలాదారుని సమీపించే వనితలు రావటం, వారిని చూచి చకితుడయి చంద్రాయుడు తిరస్కరించటం, వారి రాక తన నుంచి డబ్బు గుంజటానికని తలంచి బింకంగా కూర్చోవటం, తన్ను సమీపించిన ఊర్వశిని నిరాకరించిన అర్జునునిలా పోజు పెట్టడం జరుగుతుండేది. కొంత కాలా నికి ఆ వనితల రాక ధనం కోసం గాదని తెలిసింది. అయినా అనుచిత కార్యానికి అతని మనస్సు సుముఖంగా లేదు. ఒకనాడు చంద్రాయుడు మనోదౌర్బల్యానికి

లోనయ్యాడు. వచ్చిన స్త్రీ ఎంత చెప్పిన వినక ఆతణ్ణి శారీరకంగా, మానసికంగా రెచ్చగొట్టింది. ఆ నాటి నుంచి ఆ వనిత చంద్రాయునిపై శ్రీకృష్ణునం దాసక్త చిత్తయయిన రాధలా అయిపోయింది.

భోజనం ముగించుకుని తన గదికి వచ్చిన రాజీవ్, వెనుకటి వాఙ్మయంలో సామాన్యుల జీవన విధానాన్ని వర్ణించే యంశాలను గుర్తించటానికి ఎంతగానో ప్రయత్నం సాగిస్తున్నాడు. ఎంతో విషయం లేకుంటే చంద్రాయుడంతటి ధీశాలిని ఒప్పించటం సాధ్యంగాదని రాజీవ్‌కు బాగా తెలుసు. ఎపుడెపుడో సంస్కృతం క్లాసులో విన్న యంశాలన్నూ, వాటి ఆకర గ్రంథాలను మరల మరల గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. 'జనపద' మనే మాటను దేశ వాచకంగా వాడుక చేస్తున్నారు. మన Indian Republic ను భారత జనపదంగా పత్రికల వారు పేర్కొనటం రాజీవ్‌కు గుర్తు వచ్చింది. జనపదు లంటే గ్రామ నగర వాసులనేదీ సువిదితం. గ్రామ నివాసులు కార్మికులు. కర్షకులు జనపద నివాసులు. నగరాల్లో యంత్రాలుంటాయి. అందులో శ్రామికు లుంటారు. నగర గ్రామ విభేదాలను అతి ప్రాచీన కాలంను చీ మనవారు గుర్తించారు. మాళవికాగ్ని మిత్రమనే కాళిదాస కృత నాటకంలో నాట్యాచార్యుల కిరువురకు పాండిత్య విషయమై తల ఎత్తిన వివాదాన్ని పరిష్కరించటానికి అగ్నిమిత్ర సార్వభౌముడు నాట్యము ప్రయోగ ప్రధానమయినందున, ఆ గురుద్వయం దగ్గర విద్యనభ్యసించే శిష్యుల నాట్య కౌశలాన్ని పరిశీలించి తర తమ భేదాల్ని నిర్ణయించటానికి పండిత కౌశికిని న్యాయ నిర్ణేతగా రాజు నియ మిస్తాడు. పత్తన వాసులు, వాజూాకు దనం గల యుష్మదాది రాజులుండ, అపరిణత మనస్కను గ్రామీణుని పోలిన నన్ను న్యాయ నిర్ణాయక పదవికి నియో గించుట సరిగాదని చెప్పుతూ 'పత్తనే విద్యమానే గ్రామే రత్నపరీక్షా' అని అన్నట్లు కాళిదాసు చెప్పాడు. నాగరికుల జీవన విధానానికి, పరిజ్ఞానానికి గ్రామీణులతి దూరంగా ఉంటారనే అర్థం వచ్చే అంశాలు హాలుని గాథా సప్తశతిలో చక్కగా పోషితాలయినాయనే యంశం రాజీవ్ స్మృతిపథంలో మెరసింది. ఈ విషయమై ఒక మహా పండితుడీ నడుమ ప్రచురించిన వ్యాసం గల సంచికను తను శ్రద్ధ పరిచి ఉన్నాడు. దాన్ని తీసి అందులో సామాన్యుల జీవన విధాన వర్ణాత్మకా లయిన అంశాలనీ విధంగా గుర్తించారు. ఇందులో సామాన్యుల ముగ్ధమధుర

జీవన విధానమే గాక సున్నితమైన హాస్య రసం పోషితమైనది. మన ఆలంకారికులు వికారాత్మ కాలనే హాస్య రసాని కుదాహరణలుగ ఇచ్చారే గాని, ఇలాంటి సున్నితమయిన సందర్భాలనుంచి జనించే వికార విదూరమైన హాస్యం వైపు పోనేలేదు. ఆ వ్యాసంలో మొదటి యంశం, వేపుడు నువ్వులను పంట పొలంలో చల్లటం. ఒక గ్రామీణుడు తనకు దగ్గర్లో ఉన్న నగరానికి ఒకనాడు పోయాడు. ఆ నగరంలో అతని మిత్రుడొకడు నువ్వులను ఆ యతిధికి ఫలహారంగా పెట్టాడు. ఆ నువ్వులు చాల రుచిగ ఉన్నాయి. తాను తన పొలంలో పండించే నువ్వుల వలెనే ఇవి గూడ ఉన్నాయి. కాని రుచిలో మాత్రం చాల భేదం కనిపించింది. ఆ నువ్వులంత రుచిగా ఉండటానికి కారణాన్ని గ్రామీణుడు అడుగగా, వేయించినందున ఈ నువ్వులు రుచిగా ఉన్నాయని ఆ నగరవాసి చెప్పాడు. ఈ యంశాన్ని గ్రహించిన గ్రామీణుడు తన పొలంలో రుచికరమైన నువ్వులను పండించాలనే నిర్ణయానికి వచ్చాడు. ఆ తరువాత నువ్వులను తన భూమిలో జల్లే తరుణంలో వాటిని వేయించి జల్లాడు. అలా అయితే రుచికరమైన నువ్వులు లభిస్తాయని అతని తలంపు. అంతేగాని వేయించిన నువ్వులకు మొలక రాదని ఆ గ్రామీణునకు తెలియదు. అంతేగాక తన పొలంలో పండిన నువ్వులనే వేయించుకోవాలి గాని, వేయించిన నువ్వులనే పంట చేయటం జరగని పని అనే విషయం ఆయనకు తెలియదు. ఈ రైతు పొందిన నిరాశను, మొలక రానందున, అతని అవివేకమును గూర్చి విన్న గ్రామీణులు పక్కిలిగా నవ్వుకొన్నారు.

## ప్రత్తిని శుభ్రపరచుట :

ఒక గ్రామ నివాసి తన పొలంలో ప్రత్తిని పండించాడు. దాన్ని అమ్ముకోవటానికై సమీప నగరానికి పోయాడు. ప్రత్తిని కొనుగోలుచేసే వర్తకుణ్ణి కలుసుకుని తన సరుకును చూపించాడు. ఆ ప్రత్తిలో ఆకు-అలం, చెత్త-చెదారం ఎక్కువగా ఉన్నదని ఆ వ్యాపారికి కనిపించింది. ఇంత మాలిన్యమున్న ప్రత్తిని కొనుగోలు చేయటం జరగదని ఆ వ్యాపారి రైతుకు చెప్పాడు. ఆ రైతు తన ప్రత్తి నా వ్యాపారి అంగడి సమీపంలోనే ఉంచి నగర వీధుల వెంట బయలుదేరాడు. తను తిరుగుచున్న నగర వీధిలో ఒక షరాబు కొట్టుంది. అందులో ఒక వింతను ఆ రైతు చూచాడు. కణకణలాడే బొగ్గుల్లో బంగారాన్ని ఆ షరాబు

వేశాడు. దాన్ని వింతగా చూస్తున్న రైతు అందుక్కారణం అడిగాడు. బంగారంలో ఉన్న మాలిన్యాన్ని తొలగించటానికై దాన్ని అగ్నిలోవేసి కరిగిస్తారని ఆ షరాబు చెప్పాడు. మాలిన్యాన్ని తొలగించటానికి నిప్పు నుపయోగించాలని ఆ రైతు తలంచాడు. ఈ విధమైన సంస్కారం ఖనిజాలకు సరిపోతుందేగాని తదన్యాలకు గాదనే యంశాన్ని రైతు గ్రహించనందున తాను గ్రామం నుంచి తెచ్చిన ప్రత్తిని అగ్నిలోవేసి శుద్ధి చేయాలని తలంచాడు. అలా చేయటంవల్ల ప్రత్తి బుగ్గి అయిపోయినది. ఈ యంశం తత్పరిసర ప్రజలకు నవ్వును కలిగించింది.

## పాలను నిలవ చేయటం :

ఒక గ్రామీణునికి ఒక ఆవుంది. అది రోజూ ఉదయం సాయంత్రం పాలిచ్చేది. ప్రతిదినం ఆయన రెండు శేర్ల పాలను పితుక్కునేవాడు. ఆ వూళ్లో ఇరవై రోజుల్లో ఓ ఉత్సవం జరుగనున్నది. ఆ యుత్సవం నాటికి ఆతడి ఇంటికి చాలామంది బంధువులు వస్తారు. వారికి కావలసిన సంబారాలను సమకూర్చుకొంటున్న ఆ గ్రామీణుడా యుత్సవంనాటికి తగినన్ని పాలను నిలవచేయాలని ఆ ఆవును ఉత్సవానికి 20 దినాల ముందు నుంచి పాలు పిండటం మానివేశాడు. ఉత్సవంనాడు నలభై శేర్ల (20 × 2) పాలు పితుక్కోపోయాడు గ్రామీణుడు. ఆ యావు అసలొక్క పాల చుక్కను గూడ ఇయ్యలేదు. తన దగ్గరకు వచ్చిన ఆతణ్ణి తన్ని పంపింది. ఈ యంశం అమాయకతపై ఆధారపడిన హాస్యంగా ఉంది. ఈ విధంగా వాఙ్మయంలో సామాన్యుని వృత్తాల సంఖ్యాకంగా ఉన్నాయి. మన ప్రాచీనులు సామాన్య మానవుని గూర్చి పట్టించుకోలేదనటం సరిగాదు.

ఆ నాడు రైతుల దీనస్థితిని, ఆతడు పొలాన్ని దున్నే పశువుల బలహీనతను, నిస్సహాయతను క్రీస్తుకు పూర్వం రచయితమైన 'బుద్ధ చరిత్ర' మనే సంస్కృత గ్రంథంలో ఉంది. దీని రచయిత అశ్వఘోషుడు. తనకు కలిగిన సుతుడు సన్యసిస్తాడు. రాజ్యసుఖాలను త్యజిస్తాడని జ్యోతిష్కులు శాక్యమహారాజుకు చెప్పారు. బాధాజనకమైన సన్నివేశాలకు దూరంగా, సుఖమయ వాతావరణంలో ఆతడు బుద్ధుని ఉంచాడు. ఒకనాడు నగరాన్ని చూడటానికి బుద్ధుడు రాజవీధులలో రథారూఢుడై బయలుదేరాడు. మార్గమధ్యంలో ఎన్నో సంతాపకరాలైన

అంశాలను చూడటమే గాక బురదలో నడవలేని రైతుయొక్క బక్కచిక్కిన శరీరాన్ని, మర్మావయాన్ని కప్పుకోదగిన వస్త్రాన్ని దాల్చి తనకన్న బలహీనములు శక్తిహీనములు అయిన పశువులను నిర్దయతో హింసించి పొలాన్ని దున్నే ప్రయత్నం చేయటాన్ని గమనించి సంతప్తచిత్తు డయినాడు.

అంతేగాక ఆప్తులను ఆత్మీయులను కోల్పోయిన తన రాజ్యము నందలి జనులందరికి తానే తండ్రి అని దుష్యంతుడు శాకుంతలంలో పలికిన వాక్యం ఆయన స్మృతిపథంలో మెరిసింది. సామాన్యజనుని యోగక్షేమాన్ని గూర్చి ఇంత శ్రద్ధగ స్వయంగా మహారాజే వహించియుండగా సామాన్య మానవుని మను గడను గూర్చి ప్రాచీనులు తలంపలేదనుకొనుట సమంజసం గాదని రాజీవ్‌కు నమ్మకం గలిగింది.

రాజీవ్ చంద్రాయుని కలదినప్పు డీ యంశాల నన్నింటిని సప్రమాణంగ వివరించాడు. జన్మ నిచ్చివాడు తండ్రిగాక మానడు. ప్రజలను సన్మార్గంలో ప్రవర్తించేలా చేస్తూ, రక్షిస్తూ, శిక్షిస్తూ, క్లిష్టకాలంలో ఆదుకొంటుండే వాడా నాటి రాజు. అందున జన్మ నిచ్చిన తండ్రికన్న, రక్షణ గల్పించిన రాజే ప్రజలకు తండ్రిగా ఉన్నాడని ఈ విధంగా రాజులు సామాన్యులను సత్పౌరులుగ తీర్చిదిద్దారనీ, ఈ విధంగా ఎన్నో అంశాలను వివరించినందున రాజీవ్ ధోరణిలో వాస్తవం వుందని, నేటివారు కొందరు తలంచినట్లుగా నాడు సామాన్యులకు ప్రాధాన్యం లేదనటం సరిగాదని చంద్రాయునికి నమ్మకం కలిగింది. అయినా ఆ యంశాన్నాతడు వాచా వివరించ లేదు. ముఖకవళికల వల్ల ఈ యంశం సువిదితమయ్యింది.

చంద్రాయుడు మళ్ళీ ఒక సమస్యను లేవనెత్తాడు. వెనుకటి కాలంలో శ్రీమంతులు, మహారాజులు సామాన్యుని దోచుకుతినేవారు. ఇది దాచేస్తే దాగని సత్యం. ఎందుకంటే మహారాజులు రాజబంధువులు, వారికి వందిమాగధుల లాంటి పరివారం అంతా ఉమ్మడిగా వీరస్వర్గమనే ఒక గగనకుసుమాన్ని గల్పించారు. సమరంలో వెనుదిరగ పోరాడి విజయం పొందకపోతే తన ప్రాణాలను పదాతి రణరంగంలో కోల్పోతే ఆతని వీరోచిత కృత్యానికి స్వర్గంలో దేవేంద్రుని ఆస్థానంలో వుండే జరామరణాల్లేని దేవవేశ్యలు సంతృప్త చిత్తలవుతారు. అంతేగాక అలాంటి వీరులను వరించటానికి చేత పుష్పమాలలను ధరించి నిరీక్షిస్తుంటా

రవి వెనుకటి వాఙ్మయంలో ఉంది. ఇది సత్యమని గలమా? ఈ దేవవేశ్య లెంత మందిని పరిణయమాడుతారు. సమరంలో వేల సంఖ్యలో జనులు విహతులవుతారు గదా. అందులో తొమ్మిది పాళ్ళు (పదింట) వీరులుగానే రణరంగంలో తిరోగమనాన్ని ఎరుగకుండానే మృతులవుతారు. ఈ విధమైన వీరస్వర్గం వీరికి సంక్రమించే వైవాహిక ఒడంబడిక ఎంతకాలం ఉంటుంది. ఈ రంభాదులు నిత్యం జరిగే వీరమరణాల నన్నింటిని చూచుకోవాలి గదా. మరి వీరిలా ఉంటే మహర్షుల తపస్సును భగ్నం చేసేనానికి, తన విలాసాలకు దేవేంద్రుడు ఎవరిని ఉపయోగించుకుంటాడు. ఇదంతా కృత్యమై, స్వార్థపూరితమై, అమాయక ప్రాణుల జీవితాలతో చెలగాటం ఆడుతూ వారి కుటుంబాలవారికి దుఃఖాన్ని గల్పిగిస్తుంది గదా. దీన్ని ఎలా మనం సమర్థించటం అని కంఠస్వరం సన్నగా వున్నా ఆందుల పౌరుష్యం కాఠిన్యం వ్యక్తమయ్యేటట్లు చంద్రారాయుడు అన్నాడు.

ఈ సమస్య నాకు అవగతమైనదే. ఇందులో మరో అంశాన్ని నీవు మరిచావు. ఒక వీరుని శిరస్సు రణరంగంలో ఖండితమయినది. అతని మొండంలో ఇంకా ప్రాణమున్నందున అది రణరంగంలో అటు ఇటు కదలాడుతూ నిలబడి ఉంది. మొండంలో ప్రాణ ముండటం చలన ముండటం రెప్పపాటు కాలం గావచ్చు, అంతకన్నా ఎక్కువకాలం ప్రాణమున్నా మొండం నేలకి ఒరిగిపోక నిలబడి ఉండటం జరగదు. ఇంతలోనే ఆ వీరుని ప్రాణం స్వర్గలోకానికి చేరుకుంది. ఈ వేగం ధ్వనితరంగాలను మించి ఉండాలి. అతని రాకకు నిరీక్షిస్తున్న దేవవేశ్య అతని పాణిని గ్రహించింది. తన చేతియందలి దివ్యపుష్ప విరచితమయిన మాలనాతని కంఠము నలంకరింప చేసింది. తదనంతరం అతడు పైనుంచి తలపోయిన తన శరీరమును చూచినట్లు కవి వర్ణించాడు. ఈ వర్ణన గావించిన కవి 'కవికుల తిలకుడుగ పేరుగాంచిన కాళిదాసు.' ఈ వర్ణన రఘువంశ మహాకావ్యంలో రఘు మహారాజు సాగించిన జైత్రయాత్రలోది. అయితే ఇదంతా నిజమని వారు నమ్మినా నమ్మకున్నా కాలానుగుణంగా దీన్ని వారు ప్రతిపాదించారు. అనంతర కాలం దీన్ని తెలుగు వాఙ్మయంలో గూడ వర్ణించారు. ఈ సందర్భంలో ఛటస్వర్గ మనేదాన్ని తెలుగువారు గల్పించారు.

అయితే ఈ వర్ణన అవాస్తవం, సత్యదూరం అని కాలాంతరంలో మనవారు తలంచారు. ఈ యంశాన్ని ఇప్పటికి అయిదారు నూర్ల సంవత్సరాలక్రి

మునుపే మనవారు ముచ్చటగా మెత్తని మెత్తని మాటలతో ఖండించారు. మన దేశంలో కోడి పందాలు ప్రసిద్ధమైన వినోదము. పందెంలో పుంజులే పాల్గొంటాయి. వెనుదిరగక పోరి రణరంగాన్ని నిజరక్తసిక్తం గావించి మృతి చెందుతాయి. వీరులయిన ఈ పుంజులను రంభాదులు ఆదరించాలి. పందాల్లో కోళ్ళు రంభాదుల పొందును పొందగలవని కవి చెప్పాడు. ఈ యంశం ఈ వీరస్వర్గం లేదా భటస్వర్గం అనే అంశం ఎంత కృతకమో, అసహజమో తెలియజేస్తుంది. రణరంగంలో గజాశ్వాల సంఖ్యాకంగా మృతి చెందుతాయి. వీరులయిన ఈ గజాశ్వాలను రంభాదులు స్వీకరిస్తారా? ఈ విధంగా ఈ యంశాన్ని తరువారు పరిహసించి ఇందలి యసత్యాన్ని ఎత్తి చూపారు. అని ఈ విధంగా చెప్పగా విన్న చంద్రాయుడు, జ్ఞానోదయమైనపుడు బుద్ధుని ముఖంలోవలె వికాసవంతము. వివేక నిలయము అయిన చూపులను ప్రసరింపజేసాడు. సహజంగా ఆకర్షణగల చంద్రాయుని చూపులు ఈ మార్పులతో దేదీప్యమాన మయినాయి ఆ చూపులను గమనించిన రాజీవ్, చంద్రాయుడులాంటి ఉగ్రవాది తలంపుల్లో వినూత్న దీప్తి గలిగినందుకు మిక్కిలి సంతృప్త చిత్తుడయినాడు. ప్రాచీన వాఙ్మయాన్ని అనుశీలన జేసేవారు లేనందున నేటివారు కొందరు దానిపై లేనిపోని అపోహలను పెంపొందించు కొంటున్నారని. తగిన రీతిని వాస్తవాలను వెల్లడిస్తే వారు గ్రహిస్తారని, దానివల్ల వారిలోని అపోహలు తొలగిపోతాయని, ముమ్ముందు తానీవిదంగా వెనుకటి తరాలవారి ఆలోచనా సరళిని వివరించి మన సంఘంలోని ఉగ్రవాదానికి స్వస్తి పలకాలనీ చంద్రాయుడు తలంచాడు.

తన దృష్టి నింతగా ప్రాచీన వాఙ్మయంవైపు మరల్చి, అందలి లోతుపాతులను కరతలామలకం గావించిన తన సంస్కృతోపాధ్యాయులకు తన హృదయంలో రాజీవ్ కృతజ్ఞతలను తెలుపుకున్నాడు. తన సంస్కృతోపాధ్యాయులు విశ్రాంతి జీవితాన్ననుభవిస్తున్నారు. వారు వేర్వేరు ప్రాంతాల్లో ఉంటున్నారు. చాలవరకు వారి నివాసాలు కుగ్రామాలు. అపుడపుడు వారి విలాసం మారుతుంటుంది. వారుంటున్న పుత్రాదుల కుద్యోగరీత్యా మారినపుడు వారి వెంటనుండే వారి విలాసంలో మార్పు సహజంగా వస్తుంటుంది.

ఈ నడుమ తాను రాసిన జాబుకు సంస్కృతోపాధ్యాయుడి నుంచి ప్రత్యుత్తరం వచ్చింది. ఉగ్రవాదులకు ప్రాచీన వాఙ్మయం పైగల అపోహలను తాను తొలగించిన యంశాన్ని రాజీవ్ ఉపాధ్యాయుడికి రాశాడు. దానికి వచ్చిన ప్రత్యుత్తరం ఆ ఉపాధ్యాయుడు రాజీవ్ సహనాన్ని పట్టుదలను ఎదుటివారిని ఒప్పించటంలో చూపిన నేర్పును వేనోళ్ళ ప్రశంసించారు. అంతేగాక తాము పుస్తకాల నెంతగా చదివినా అందలి వాస్తవాలను ఆధునిక కాలానుగుణంగా విడమర్చి సమన్వయించుకోలేక పోయామని, ఈ యంశంలో రాజీవ్ చేసిన కృషి ప్రశంసార్హమనీ వారుల్లేఖించారు.

# 5

ఆ మధ్య చంద్రాయుడు దళితుల మహాసభలకు వెళ్ళాడు. నవకువకుడు విద్యావంతుడు దళిత జనోద్ధరణకు కంకణం కట్టుకున్నవాడు అయినందున ఇలాంటి సభ లెక్కడ జరిగినా ఈతడు ప్రముఖపాత్ర వహిస్తాడు. చంద్రాయుడు వంటి వారా సభల్లో వేళ్ళమీద లెక్కింపదగినవారే అంటే పదికన్న తక్కువే. అందున చంద్రాయుడు ప్రముఖ పాత్ర వహిస్తాడు. మొన్న జరిగిన సభల్లో చంద్రాయుని పాత్ర బహుముఖంగా ప్రాముఖ్యాన్ని వహించింది. కొంద రాతనిలోని నూతన ధోరణి నవగతం చేసుకున్నారు. ఈ మార్పుకు స్వాగతం పలికారు. మఃకొంవరి కీ ధోరణి అసలు నచ్చలేదు. పదిమందికి లోగా ఉన్నవారిలోనే ఈతని విషయమై ఇన్ని వర్గా లేర్పడినాయి. అయితే చంద్రాయుడిలో గలిగిన నూతనతను మనం కొంత ఇక్కడ తెలుసుకోవాలి. ఇంతకు మునుపువలె చంద్రాయుడు ఉగ్రవాదాన్ని ప్రోత్సహించటం లేదు. దళితులకు సంక్రమిస్తున్న కష్టాలకు, పారంపర్యంగా వెంటాడుతున్న దారిద్ర్యానికి, అంటరానివారుగా వారు గుర్తింపబడటానికి ఉన్నత వర్గానికి చెందినవారే ముఖ్య కారణమని విశ్వసించటమే గాక, సమాజంలో ఉన్నతవర్గాలవారిపై ద్వేషభావాన్ని పెంపొందించే మాటలను తనవారికి బోధించటమే గాక, ఆ ద్వేషభావాన్ని క్రియాత్మకంగా చూపటానికి గూడ తనవారికి ప్రోత్సాహాన్నిచ్చేవాడు. ఈ విధమైన ప్రబోధానికి లోనై కొందరు దళిత యువకులు విద్యార్థి దశలో ఉన్నతవర్గాలవారికి చెందిన విద్యార్థులను పలువిధాలుగా అవమానిస్తుండేవారు. ఈ యంశాన్ని తాను అపుడపుడు వినేవాడు. కాని దీన్ని అనుచిత కృత్యంగా చంద్రాయుడు తలంచటం గానీ, తోటివారిని మందలించటం గానీ జరిగేది కాదు. ఇపు డాతడే ఇలాంటి విధానాలను ఖండించ మొదలుపెట్టాడు. తన తోటి కార్యకర్తల కీ యంశం ఆశ్చర్యాన్ని కలిగించింది. మరీ తీవ్రభావాలు గల కార్యకర్త లీతని వాదాన్ని ఎదుర్కొన్నారు. చాల వాగ్వాదం జరిగింది. ఎంతగ చర్చ జరిగినా చంద్రాయుడి వాదాన్ని వా రంగీకరించలేదు. అంతేగాక ఆతణ్ణి ఉగ్రవాది గాదనీ ఉన్నతవర్గాలవారికి దాసోహం అంటున్నాడనీ, అందువల్ల ఈతణ్ణి దళితుల క్షేమాన్ని కోరే కార్యకర్తల నుండి తొలగించుట చాల అవసరమనీ కొందరు తలంచారు. మరి కొందరు చంద్రాయుడి వాదంలోని వాస్తవాన్ని గ్రహిం

చారు. ఆతనికి సపోర్టు నీయటం మంచిదని తలంచారు. అతి తీవ్రవాది ఒకడు దళితులకు అనూచానంగా జరుగుతున్న అన్యాయాన్ని నొక్కి వక్కాణించాడు. తత్పరిసర గ్రామంలో అంతకు కొద్దిరోజుల ముందు దళితులపై అగ్రవర్ణాలవారు దాడి జరిపారనే విషయాన్ని చంద్రాయుడికి సవిస్తరంగా నివేదించాడు. ఆ ఘర్షణలో ఇద్దరు దళిత యువకులు మృతులు గావటమే గాక నలుగురు యువకులు తీవ్రమైన గాయాలను పొంది చికిత్స పొందుతున్నారన్న విషయాన్ని తెలిపాడు. ఈ విధంగా అన్యాయానికి గురౌతున్న దళితులు ఉన్నతవర్గీయుల స్త్రీ శిశు జనాన్నే గాక, వారి ఆస్తిపాస్తులను నాశనం గావించినా, హింసించినా మనం సంతాపాన్ని పొందరాదనీ, అయినా నీవు ఇంతగా మన విధానాలకు, లక్ష్యాలకు విరుద్ధంగా నడుస్తూ, నీకు జన్మనిచ్చి పెంచిన విద్యాబుద్ధులు నేర్పిన నీ వారికి అపరాధం చేస్తున్నావు. ఇది క్షంతవ్యం గాదు; అని ఇంకా ఏమేమో సుదీర్ఘంగా ఉపన్యసించటం సాగిస్తున్నారు. దీనన్నంతా సావధానంగా వింటున్న చంద్రాయుడు స్పందించాడు. తానుగా ప్రత్యుత్తరాన్నీయ మొదలుపెట్టాడు. గాయపడిన దళితులిద్దరు యువకులే, ప్రాణాలను కోల్పోయినవారు గూడ యువకులే. అంటే దళిత యువకులు గుమిగూడి అగ్రవర్ణాలపైకి దాడిగా పోయారనీ అందువల్ల నిహతులు, క్షతగాత్రులు అయిన దళితులంతా యువకులే గాని, ఇంతకు మునుపు జరిగిన ఘర్షణలందువలె స్త్రీ శిశు వృద్ధ దళితులు లేరని తలంచాడు. అగ్రవర్ణాలలో హతులు, క్షతగాత్రులు ఎందరు అని చంద్రాయుని ప్రశ్న.

అతి తీవ్రవాది : ఇద్దరు పురుషులు ఒక స్త్రీ ఒక బాలుడు.

చంద్రాయుడు : ఈ ఘర్షణకు కారణం ఏమిటి?

అతి తీవ్రవాది : ప్రత్యేకించి చెప్పదగిన కారణం ఏముంటుంది. షరా మామూలే.

చంద్రాయుడు : ఈ తగాదాకు పూర్వరంగాన్ని నే నడుగుతున్నాను.

ఒకడు : రైతులకు దళితులకు నడుమ ఎంతో కాలంగా భూమి దగ్గర సాగుతున్న తగాదా.

చంద్రాయుడు : ఎలాంటి దా తగవు?

ఒకడు : బంజరు భూమిని ప్రభుత్వంవారు మనవారి కిచ్చింది. అందులో తర తరాలుగా బండిబాట ఉంది. దాన్ని నిలిపివేయాలని మనవా రంటు

న్నారు. మీరు ధన వ్యయం చేసి కొన్న భూమి గాదు. మేము సేద్యం చేసిన భూమి నుంచి ధాన్యాన్ని తోలుకుపోవాలన్నా, ఎరువులను పొలంలోకి చేర్చాలన్నా ఈ భూమి ద్వారా మా బండ్లు పోవాలి. మార్గాంతరం లేదు. బండ్ల బాటకు పోను మిగిలిన భూమిని మాత్రమే ప్రభుత్వంవారు మీకిచ్చారు. మీకిచ్చిన పట్టా చూచుకుంటే ఈ వివాదం తల ఎత్తదు. అందులో బండ్ల బాటకు మినహాయించి వుందంటారు వారు. ఒక సుదినాన మనవారు బండ్ల బాటను గూడ కలిపి భూమిని దున్నారు. ఏదో విత్తనం జల్లినట్లున్నారు. ఇంకా మొలక రాలేదు. ఆ సందర్భంలో రైతుల బండ్లా దున్నిన భూమి గుండా తమ బండ్లను తోలుకొని పోయారు. అందువల్ల ఈ తగాదా మొదలయ్యింది.

చంద్రాయుడు : మొదలయిన తగాదా ఎలా ముగిసింది.

ఒకడు : భూమి కొలతలవారు వచ్చి పాత రికార్డులను మనవారి కిచ్చిన పట్టాలను తనిఖీ చేశారు. బండ్లు పోవటానికి మార్గాన్ని వదలవసిందే గాని, బండ్ల నాపటానికి వీలులేదన్నారు. వారిముందు మనవారు అంగీకారసూచకంగా మిన్నకున్నారు.

చంద్రాయుడు : అలాంటప్పుడు అంతటితో ఆగిపోవాల్సిన పోరాటం మరల ఎందుకు తల యెత్తింది.

ఒకడు : బండ్లను తోలుకపోయినందున తా మెంతో శ్రమచేసి దున్ని పైరు వేసుకున్న పంటపొలానికి తీరని నష్టం వాటిల్లిందని మనవారు అనుకోవటం, రైతులతో వివాదానికి దిగటం నిత్యం వాగ్వాదాలు కొన్నాళ్ళు సాగాయి. తరువాత నాలుగురోజుల నాడు....అని ఏమో చెప్పబోగా అతి తీవ్రవాది కనుసన్నతో అతని మాటలను నిలిపివేసి తానే మొదలుపెట్టాడు.

అతి తీవ్రవాది : ఒక సాయంత్రం పొలానికి పోయిన రైతులు, పశువులు తిరిగి రావటానికి కొంచెం ముందుగా ఉశిత యువకులు పదిమంది తీవ్రమైన ఉద్రేకంతో రైతుల యిళ్ళపై దాడి చేశారు. అందుకు రైతువృద్ధులు వీరికి అడ్డుగా నిలిచారు. వారిని అతి తీవ్రంగా గాయపరిచారు, వారిని

అడ్డుకోను వచ్చిన ఒక యిల్లాలిని ఆమె చంకబిడ్డను అక్కడికక్కడే చంపారు. గాయపడిన రైతుల్లో ఇద్దరు కన్నుమూశారు.

చంద్రాయుడు : మరి దాడికి వోయిన దళిత యువకుల మరణానికి కారణం రైతులేనా?

అతి తీవ్రవాది : రైతులు వయసుమళ్ళినా తెగించి పోరాడారు. దొరికినదాన్ని తీసుకుని తిరగబడ్డారు. కొంతవరకు మనవారికి గాయా లయినాయి.

చంద్రాయుడు : మనవారు మృతి చెందారు గదా వారిని చంపింది రైతులు గాదా?

తీవ్రవాది : మనవారిలో ఒకరిపై ఒకరికి అసహనం ఉంది. ఆ ఈర్ష్యను ద్వేషాన్ని వారీ గలాటాలో చూపుకున్నారు. చనిపోయిన యువకులిరువురు పరస్పరం తమ తమ మరణానికి కారణమయినారు. వారిలా చచ్చి రైతులపై కేసును బలంగా మోపటానికి తోడ్పడింది వారి మరణం.

ఈ మాటలు విన్న చంద్రాయుడు తీవ్రంగా కంపించిపోయాడు. ఇంతగా కేసుల కోసం ఆత్మీయులను బలిచేసేవారిని ఆతడు లోలోపల అసహ్యించుకున్నాడు.

చంద్రాయుడు: ప్రభుత్వంవారు దళితులకు భూమిని ఇస్తున్నారు. మళ్ళీ ఎవరి దౌర్జన్యం వల్లా వారికి సంక్రమించిన భూమి అపహృతం కాకుండా ఉండటానికి పట్టాల నిస్తున్నారు. ప్రభుత్వం వారీ పట్టాలను పదేపదే పలు గ్రామాల్లో ఇస్తూ పత్రికా ముఖంగా దళితుల నాదుకున్నట్లు ప్రకటించుకొంటున్నారు. దీనివల్ల దళితులకు ప్రభుత్వంపై అభిమానం కలగాలి. ఆ యభిమానం ఓట్ల రూపంగా వారికి ఉపకరిస్తుంది. రానున్న ఎన్నికల్లో దీని ఫలితాన్ని వారు పొంది గద్దె నెక్కుతారు. ప్రజాస్వామ్యానికి పరిరక్షకులుగా ఉంటారు. ఈ విధంగా ప్రభుత్వం వారిచ్చిన పట్టాభూముల్లోగల నియమావళిని మనం పాటించకపోవటం, దౌర్జన్యానికి దిగటం, తరతరాలుగ రైతులు శ్రమవోడ్చి పండించి దేశంలో దారిద్ర్యాన్ని తొలగిస్తూ, అందరికీ అందుబాటులో ఆహార పదార్థాలుండేట్లు చేస్తూ, ప్రజలకు ప్రభుత్వాలకు ప్రజాస్వామ్య మను

గడకు అవిరతంగా సేవ చేస్తున్న రైతుల పొలాలకు పోయే బండ్ల
దారిని నేటి మనవారు స్వాధీనం చేసుకోవటం అన్యాయం. అహంభావ
కలుషితం. దళితులమయినందున మనకే ప్రభుత్వంవారి ప్రాపు
లభిస్తుందనే భావన మీకుంటే అది సరిగాదు. ప్రభుత్వం మనకు
చూపే ప్రాపు దళితులమయినందున గాదు, వారికి ఎన్నికల్లో సాయం
చేసే ఓట్ల బాంకులు మన చేతుల్లో ఉన్నాయి. మనమెంతగా కుటుంబ
నియంత్రణను గూర్చి విన్నా దాన్ని ఆచరణలో పాటించలేము. మన
వారికి సంతానం అధికం. ఆధునిక కాలంలో జనించిన శిశువును బ్రతి
కించటం ప్రభుత్వంవారి ప్రధాన విధి. శిశు మరణాలను తగ్గిస్తే, అక్ష
రాస్యతను పెంచితే మనం సభ్యదేశాల్లో తల ఎత్తుకోగలం. అయితే
ప్రతి పౌరుడు సంతతికి హద్దును పాటించి తీరాలి. ఈ విషయాన్ని
విస్మరించి మనవారు కంటున్నారు. ఇరవై కాదు, పద్దెనిమిది ఏళ్ళవా
డయితే ఓటు హక్కును పొందుతాడు దిన దిన ప్రవర్ధమాన మవు
తున్న ఓటర్ల సంఖ్య ప్రభుత్వానికి, దాని మనుగడకి చాలా ముఖ్యం.
రైతుల్లో జననాలు తక్కువ. వారు ఉద్యోగాలను చేయనో, వ్యాపారం
కోసమో గ్రామాలను వదలి పోతున్నారు. అందువల్ల వారివల్ల ప్రభు
త్వం ఆశించే ఓట్లసంఖ్య ప్రవర్ధమానం గావటంలేదు. ప్రభుత్వం
ఇచ్చిన సదుపాయాలవల్ల మనం వెనకటి కాలంలో మోతుబరులయిన
రైతాంగం దళితులపై దాడి జరిపినట్లుగా, మనం నేడు వారిపై యుద్ధాన్ని
ప్రకటిస్తున్నాం. ఒకనాడు రైతులు కొందరు కూలికి వచ్చే స్త్రీల
శీలాన్నపహరించటానికి ప్రయత్నించేవారు. ఈ నాడాస్థితి మారి
పోయింది. ఉన్నత వర్గాల స్త్రీలను, విద్యార్థినులుగా నగరాల్లో వివ
హించేవారిని మన యువకులు పలు పలు రీతుల్లో చేరబడుతున్నారు. ఇది
మనకు శ్రేయోదాయకం గాదు. ప్రస్తుతానికి ప్రభుత్వ యంత్రాంగం
కొంతవరకు మనకు సహకరించినా, ఈ విధానం కలకాలం కొనసాగదు.
నిందితులు దళితులయినప్పటికీ శిక్షార్హులవుతారు. న్యాయశాస్త్రంలో
స్వపర భేదాలులేవు. బండ్లబాటను మూసినందున గ్రామంలో కలత
రేగింది. దీనికి మనవారే కారణం. ఈ పోరు తరచు రగులుతుండ
టానికి మనవారే కారణం. ప్రశాంత వాతావరణంలో గ్రామం ఉండగా,

మనవారు రైతుల యిండ్లపై దాడిచేయుట, స్త్రీ శిశు వృద్ధులను హత మార్చటం ఆరోగ్యదాయకం గాని పని. దళితుల్లో ద్వేషాలుండి దాడిలో తమను తాము హింసించుకోవటం, అలా చచ్చినవారిని చూపి రైతులపై కేసును బలంగా మోపటం ప్రస్తుతానికి బాగానే ఉంటుంది. కాని ఇది శాశ్వతమయిన విజయం కాదు. పాండవులను కపట ద్యూతంలో ఓడించి, పరాభవించి రాజ్యాన్ని స్వాయత్తం చేసుకున్న కర్ణాది దుష్టచతుష్టయం కాలాంతరంలో ఏమైపోయారో మీకు తెలియనిది గాదు. సత్యం జయిస్తుంది. ధార్మికులకు పరాభవం తాత్కాలికమే.

సుదీర్ఘమయిన ఈ వాగ్ధోరణిలో ఏదో గొప్ప భావం ఉండే ఉంటుందని చంద్రాయుని అభిమానులు తలంచారు. కొందరి కిందులో కొంత అర్థమయ్యింది. ముఖ్యంగా కర్ణాది దుష్టుల విషయం సులభంగా అవగతమైంది. అతి తీవ్రవాదులా వాక్యాలను విని, ఈ ధోరణి ఉన్నత వర్గాలవారు ధనవంతులైన భక్తులకోసం చేసే నిరర్థకమైన ఉపన్యాసం అనిపించింది. ఈ విధంగా ప్రలాపిస్తున్న చంద్రాయునికి దళితుల్లో స్థానం ఉండరాదనిపించింది. సభా జనమంతా కొంత కాలానికి ఈ వాక్యవర్షం నుంచి తేరుకున్నారు.

అంతలో ఒకడు దళితులు క్షతగాత్రులైనవారు సభలు జరుపుకునే నగరం లోని వైద్యశాలలోనే చికిత్స పొందుతున్నారని చంద్రాయునితో చెప్పి వారిని పలకరించి రావటం ఆతని ముఖ్య కర్తవ్యమని సూచించాడు. ఈ యంశాన్ని చంద్రాయుడు అంగీకరించాడని ఆతని చూపులవల్ల తెలుస్తుంది. అయితే ఈ నగ రంలో వారికి వైద్య సహాయం చేయటానికి తగినంత స్తోమతగల ఆసుపత్రి ఎక్కడిదా అని ఆయన సందేహం. వారికి వైద్యం చేయాలంటే అన్ని హంగులు గల ఆసుపత్రి, తగినంతమంది సుశిక్షితులయిన డాక్టర్లు, పడక వసతి గలిగి ఉండాలి గదా? ఇత్యాదిగా తలుస్తూ, ఈ నగరంలో క్షతగాత్రులున్న వైద్యశాల ఎక్కడుంది అని జిజ్ఞాసాత్మకమైన చూపులతో అక్కడివారి నడిగాడు.

ఒకడు : ఈ చిన్న నగరంలో ఇంత పెద్ద వైద్యశాల మనం ఊహించలేం. సువిశాలమైన స్థలంలో ఈ నడుమ దీన్ని నిర్మించారు. నగరానికి దగ్గ రలో ప్రధాన రాజమార్గాన్ని ఆనుకుని ఈ వైద్యశాల ఉంది. ఇందులో వైద్యశాస్త్రంలోని వినూత్న విభాగాలన్నీ వేర్వేరు శాఖల్లో ఉండటమే

గాక, ప్రతి విభాగానికి తగినంత పరికరాలున్నాయి. వైద్యశాస్త్ర నిపుణులు పలు ప్రాంతాల నుంచి మంచి అనుభవం, తగిన యోగ్యతగల వారిక్కడ నియుక్తులైనారు.

చంద్రాయుడు: ఇంతటి వైద్యశాలకు నిర్మాత లెవరు. దీనికి తగిన ధనాన్ని ఎవరు చేకూర్చారు. ఇన్ని విభాగాలు ఇంత సమగ్రంగా ఉండటం మన దేశ చరిత్రలో, ముఖ్యంగా ఈనాటి స్థితిగతుల్లో ఊహింప శక్యంగాని అంశం. మనకు డాక్టరుంటే నర్సు లేక, ఇద్దరూ వున్నా పరికరాల్లేక, అన్నీ సమకూరినా మందుల్లేక రోగులు వైద్యంకోసం పోయి సద్య దేహాన్ని చాలిస్తుంటారు. మనదేశంలో కొన్ని ప్రధానమైన ఆసుపత్రులకు 'One way trafic' అనే ముద్దుపేర్లున్నాయి అంటే రోగ గ్రస్తులు ఆర్తిని పోగొట్టుకోవటానికి వైద్యశాలలో ప్రవేశిస్తారు, వారు తిరిగివచ్చే ప్రసక్తి లేనేలేదు. అందరు అందులో మృతి చెందటం అతి సామాన్యము సర్వజన విదితము అయిన అంశం గదా!

ఒకడు : చర్చివారు స్కూలును నడిపేవారు గదా. వారే తరువాత కాలేజీని ప్రారంభించారు. వారే చిన్న చిన్న ఆసుపత్రుల నక్కడక్కడ నిర్మించి ఈనాడు ఈ వైద్యశాలను నిర్మించారు. దీనికి ఎంత ఖర్చయ్యిందో తెలియదు గాని చాలా పెద్ద వైద్యశాల ఇది. ఇందులో అన్ని వార్డులూ ఎప్పుడూ నిండుగా ఉంటాయి. సుమారం నుంచి ఇందులోకి రోగులు వస్తుంటారు. ఇక్కడి నర్సులు, డాక్టర్లు, ఆయాలు, కాంపౌండర్లు మొదలయిన ఉద్యోగస్తులందరు చర్చిలో నిత్యం ప్రార్థన చేసేవారే. మతాంతరుల కిందులో రోగులుగా ప్రవేశం లభిస్తుందేగాని, ఉద్యోగులుగా ప్రవేశం దొరకదు. అన్యమతాలవారిందులో ఉద్యోగం సంపాయించాలంటే ముందుగా మతాన్ని మార్చుకోవాలి. క్రైస్తవ మతాన్ని స్వీకరించాలి. ఉన్నత పదవుల్లో ఉన్న వైద్యశాస్త్ర నిపుణుల్లో ఒకరిద్దరు క్రైస్తవులుగాని వా రున్నారు. క్రైస్తవుల్లో ఆస్థానానికి తగిన వైద్యులు దొరకనందున వారికిక్కడ అవకాశం లభించింది. వీరు ఎంత ఆత్మీయతను రక్షించుకోవాలన్నా తనదైన మత సంబంధమైన నమ్మ

కాల కనుగుణంగా నడుచుకొంటున్నా అభ్యంతరం చెప్పటం జరగదు గాని, వీసా లేకుండా విదేశాల్లో వసిస్తున్న వానివలె క్రైస్తవేతరులా వాతావరణంలో కాలం గడుపుతుంటారు.

చంద్రాయుడు నూరుమంది తెల్లవారిలో ఒకే ఒక నల్లవాడుండవలసివస్తే అను క్షణం పరీక్షగా ఉంటుంది. తెల్లవారి నడుమ తన నల్లదనం మాటి మాటికి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. తన నల్లదనం సహజమైనా, వేడి దేశాల్లో నల్లవారుండటం ప్రకృతి సిద్ధమయినా తాను ఏకాకిని, తన పరిసరాల్లో అందరు శ్వేతవర్ణంవారే అనే అంశం అనుక్షణం తీరని బాధను, ఒక విధంగా చెప్పాలంటే తీరని వ్యథను, మూగబాధను, ఆత్మ న్యూనతాభావాన్ని కలిగించవచ్చు. ఇలాంటి స్థితి శత్రువుకు గూడ రాగూడదంటారు.

వేరొకడు: ఈ వైద్యశాలలో చేరే రోగుల స్థితిగతులను, ఆస్తి పాస్తులను దృష్టిలో ఉంచుకొని వైద్యానికి ఖర్చులు వసూలు చేస్తారు. నిర్ధనులను మాత్రం వీరు ధనంకోసం బాధించరు. ఎంత వ్యయమయినా ప్రయా సను సహించి వీరికి ఈ వైద్యశాలవారు చికిత్స చేయిస్తారు. ఈ విష యంలో వీరి త్యాగశీలత, కరుణాదృష్టి ప్రశంసార్హము. మన ప్రభుత్వ రంగంలోగాని, ఇతరత్రా గాని ఇలాంటి వైద్యశాల ఒక్కటైనలేదని స్పష్టంగా చెప్పగలం.

ఒకడు : చికిత్సానంతరం నిర్ధనులను క్రైస్తవ మతాన్ని స్వీకరించమంటారు, లేకుంటే చికిత్సకయిన వ్యయాన్ని చెల్లించవలసి ఉంటుందంటారు. దానివల్ల వారందరూ మత స్వీకారానికి అంగీకరింతురు.

చంద్రాయుడు: ప్రపంచం మొత్తంలో గల జనాభాలో ఎందరు నిర్ధనులున్నారో అందులో పదింట నలుగురు భారతదేశీయులే. అందువల్ల ప్రతిదినం ఎందరో నిర్ధనులయిన అన్యమతాలవారు క్రైస్తవు లవుతుంటా రనుకుంటా.

వేరొకడు: ఈ వైద్యశాలవల్ల క్రైస్తవుల సంఖ్య పెరుగుతుంది, మనవారి సంఖ్య క్రమంగా తరిగిపోతుంది.

చంద్రాయుడు: ప్రజల నీవిధంగా మభ్యపెట్టి మతాంతరులను చేయటంవల్ల ఏమి ప్రయోజనం వస్తుంది.

ఒకరు : మత ప్రచారం కోసమే విదేశీయు లిలాంటి సంస్థలను నడపటానికి కావలసిన ధనాన్ని ఇస్తుంటారనీ, ఇలా క్రమంగా ఈ దేశం క్రైస్తవ మతానికి అలంబనమైతే ఆ మతంవారు నమ్మిన వారి దైవము ఎంత గనో సంతోషిస్తారు. క్రైస్తవాన్ని విశ్వసించినవారు తప్ప తక్కిన జనమంతా పాపులని, ఎంతమంది పాపులను మతాంతరులను చేస్తే వారు నమ్మిన దైవం అంతగా సంతోషిస్తాడని వారి తలంపు.

చంద్రాయుడు: చికిత్సతో మతం మార్పిడిని ముడిపెట్టటం మంచి పనిగా నా కనిపించటం లేదు.

వేరొకరు: వైద్యశాలను గూర్చిన వివరాలతో మొదలయి చర్చ మతం మార్పిడికి పోయిందిగాని, అందులో చికిత్స పొందుతున్న దళితుల విషాద వృత్తాంతము మరుగుపడి పోయింది.

చంద్రాయుడు అతి సహజమైన ధోరణిలో అక్కడివారు వెలిబుచ్చుతున్న అభిప్రాయాలను మిక్కిలి శ్రద్ధతో వింటూ, అందు మూలముగా ఎదుటివారి స్వరూప స్వభావములను గ్రహించ గలిగినందుకు తన లోలోపల సంతసిస్తూ ...

చంద్రాయుడు : ప్రసక్తాను ప్రసక్తంగా ఇంతదూరం ముచ్చటించుకున్నాం. అంతేగాని క్షతగాత్రులను చూడటానికి అవశ్యం పోయిరావాలి.

అంటూ సహజమైన వాక్ప్రవాహం అరణ్యంలోని వృక్షలతాదులవలె సహజంగా ఉందనీ, ప్రత్యేకించి మనం ప్రశ్నిస్తే ఎవరు చెప్పే సమాధాన మయినా వాస్తవానికి దూరంగా నగరాల్లో ధనవంతుల గృహాల ముందు నగర పాలక సంస్థవారు నిర్మించిన ఉద్యానవనాల్లో సహజతను కోల్పోయి కృత్రిమత అగపడే వృక్షసంపద లాగుంటుందని అనుకొంటున్నాడు.

ఒకరు : ఏం చంద్రాయుడు ఎక్కడున్నావు. ఏదో ఆలోచనలో మునిగిన ట్లున్నావు.

చంద్రాయుడు : లేదు లేదు. ఆ వైద్యశాల ఇక్కడి కెంతదూరం. ఏ దిశగా పోవాలి.

మరొకడు : దగ్గరే ఎక్కువదూరం పోనవసరం లేదు (చేతిని దక్షిణంవైపు చూపుతూ) ఇటు పోవాలంటాడు.

ఆయన నిర్దేశించిన దిక్కుకు చంద్రాయుడు, మరికొందరు బయలుదేరారు. వారిలో క్షతగాత్రులను ఇంతకు మునుపు చూడని చంద్రాయునివంటివారే గాక, వారిని పరామర్శించినవారు గూడ కొందరున్నారు. వైద్యశాలకు పోయే మార్గం సుసంఘటితమై, దారి కిరువైపుల నీడనిచ్చే చెట్లతో అందంగా ఉంది. మార్గ మధ్యంలో తెల్లని రంగుతో గుర్తించినది వాహనాల రాకను పోకను వేరుచేస్తు న్నాయి. బాట కిరుప్రక్కల నున్న చెట్లు రెండు మూడు సంవత్సరాలకు మించని వయస్సు గలిగి ఉన్నట్లు తెలుస్తుంది. వైద్యశాలను నిర్మించ పూనుకున్నపుడే ఈ వృక్షసంపదతో బాటను సుసంపన్నం గావించారనిపిస్తుంది. ఇంతలో బాట ఒక మలుపు తిరిగింది. కొద్దిదూరంలో వైద్యశాలకు వెలుపలిద్వారం గనపడుతుంది. దుమ్ము ధూళి సోకినా తెలియరాని రంగు (Smoke gray) ఆ గోడలకు వాడిన ట్లున్నారు. గోడలు నాలుగడుగులు మించి లేదు. పైన ఇనపకమ్మలకు మూడు వరసలు ముండ్ల (ఇనప) తీగ అమర్చినందున గోడను దాటి లోనికి ఇతరులు పోలేరు. నిందితులయిన హంతకులు, దొంగలు లోపల నుండి వెలికి పోవీలు లేకుండా కారాగారాలకు అమర్చిన రీతిని ఈ నిర్బంధం దేనికని చూచినవారి కని పించవచ్చును. వెలుపలివారు అనుమతి లేకుండా లోనికి పోవీలు గాన ట్లీ కట్టు దిట్టం గావించారని తలంపవచ్చును.

ప్రధాన ద్వారం దాటి లోపలకు పోయినంతనే ఉన్న మొక్కలు, వాని కున్న పుష్ప సంపద అతి రమణీయంగా ఉంది. లోపల బార్లు బార్లుగా చీకటి మాకు లున్నాయి. వైద్యశాలలోనికి దుమ్మును రానీయకుండ ఈ చెట్లుంచుతాయి. అంతేగాక చల్లదనాన్ని కలిగిస్తాయి. వైద్యశాలను సమీపించినంతలో క్షతగాత్రు లయినవారిని గూర్చిన ఆలోచనా పరంపరతో, ఆందోళనతో పరిసరాలపైకి చంద్రా యుని చూపును పోనీయటం లేదని ఆతని చూపుల ఆంతర్యానికి పరిచితు లయిన వారు గ్రహించటం కష్టం గాదు. చికిత్స పొందుతున్న దళిత యువకులున్న వార్డుకు చంద్రాయుడు యాంత్రికంగా నడచిపోతున్నాడు. పరిసరాల్లోని రోగులను గాని, చికిత్స చేస్తున్న వైద్యులను గాని, పరికరాల నందిస్తున్న నర్సులను గాని, పరిశుభ్రత కోసమై కశ్మలాన్ని తొలగిస్తున్న ఆయాలను గాని చూడటం లేదు,

ఒక్కమారుగా ఇంతమంది వైద్యశాల కరుదుగా వస్తుంటారు. అందువల్ల వైద్యశాల సిబ్బంది అంతా ఈ గుంపును పరకాయించి చూస్తున్నారు. ముందుకు సాగుతున్న ఆ గుంపు ఈ యంశాన్ని గమనించుతున్నట్లు లేదు.

క్షతగాత్రులున్న వార్డు రానే వచ్చింది. చికిత్స పొందుతున్న యువక వీరులు తమ తమ శయ్యలపై కూర్చుని కొందరున్నారు. ఇద్దరు మాత్రం పరుండి యున్నారు. వారైన కూర్చొనలేని స్థితివల్ల పరుండియుండ లేదనీ ఆగంతకులను చూచినంతనే కూర్చుని తమ శక్తిమత్తను విశదం గావించారు. చంద్రాయుడు తలంచినట్లు వారెవ్వరు బాధా సప్రదష్టులుగా లేరు. కన్ను కాలు మొదలయిన ఇంద్రియ గ్రామ మంతా మామూలుగా తమ తమ పని నిర్వహిస్తున్నాయి. వారి నందరిని వేర్వేరుగా యోగక్షేమాలను చంద్రాయు డడిగినాడు. వారు చెప్పిన మాటల ధోరణి వారి గాయాలను, దానివల్ల వారు పొందిన బాధలను గాక, తామ్రగ్ర వర్ణాలవారినే విధంగా ముట్టడించి ఎలా ఎలా అక్కడ ఆడ మగ వారినేగాక పసి కందులను ప్రాణం పోసుకొంటున్న గర్భస్థ పిండాలను చీల్చి చెండాడిందీ వివరించటం మొదలుపెట్టారు.

చంద్రాయుడు పేరుపేరున క్షతగాత్రులయిన దళితుల్ని పలకరించాడు. యోగక్షేమాలను వివరంగా తెలుసుకోవాలనుకున్నాడు. కాని వారిచ్చిన ప్రత్యుత్తరం ఆ క్షతగాత్రుల శరీర పాటవం, మానసిక స్వస్థత అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. నేటి రాజకీయాల్లో హత్యలు, నేరాలను చేసిన వారా నేరాలను ఎదుటి వారిపై రుద్దను, తమను తప్పించుకోనూ వైద్యశాలల్లో, ముఖ్యంగ ప్రభుత్వ పరంగా ఉన్న వైద్యశాలల్లో చేరుతారు ప్రభుత్వ రంగంలో వైద్యులు ముద్దాయిని రోగిగా చెపితే నమ్మేవారెక్కువ. అయితే ఈ దళిత యువకులూ ఆ వర్గానికి చెందినట్లున్న ప్రభుత్వంవారి వైద్యశాలలో చేరకపోవటానికి వారి కలాంటి సౌకర్యం లేనందునే సుదూరం పోతేగాని వారికి ప్రభుత్వంవారి వైద్యశాల దొరకదు. అందున వైద్యశాలలో చేరి మందును స్వీకరిస్తే తప్ప బతుకనంతటి సమస్యలుగానీ, తీవ్రమైన గాయాలుగానీ ఈ దళిత యువకులకు లేవు. ఈ విధంగా తమ వైద్యాలయంలో చేరిన వీరందరు ధనం చెల్లించలేనందున క్రైస్తవ మతాన్ని స్వీకరిస్తారనే నమ్మకంతో వీరికి ఈ క్రైస్తవుల వైద్యాలయంలో తావు దొరికింది; మొదలయిన యంశాలను తెలుసుకున్న చంద్రాయుడు 'సర్వః స్వార్థం

సమీహతె' అనే మాటను మననం చేయకుండా ఉండలేక పోయాడు. ఉన్నత వర్గం వారు దళితులను మట్టడించారనటం నూటికి నూరుపాళ్ళు అసత్యమని చంద్రాయుడికి వారిమాట తీరువల్ల తెలిసింది ఇరు వర్గాల నడుమ సాగిన ఘర్షణగా అయినా ఈ కోలాహలాన్ని అనడానికి హేతువు లేదు. దళిత యువకులు రైతుల ఇండ్ల పైకి దాడి చేశారు. నిస్సహాయ స్థితిలో రైతులు మృతులయ్యారు. వా రసలీ దాడిని ఎదుర్కొన లేదని క్షతగాత్రులయిన దళిత యువకుల మాటలవల్ల సుస్పష్టమయినది.

క్ష. గా. 1 : ఉన్నత వర్గంవారిని మేము జయించాం. వారు దిక్కుతోచని స్థితిలో ఉండిపోయారన్నా తమ కళ్ళముందు సాగుతున్న దళిత యువకుల తీవ్రతను వారు చూడలేక పోయారు. కొందరు తలుపు చాటుకు పోయారు. మరికొందరు పీటలను ముఖాన్ని కడ్డంగా పెట్టుకున్నారు.

చంద్రాయుడు: చేతికందిన పీట చెక్కలతో, రోకళ్ళతో ఉన్నత వర్గంవారు దళిత యువకులను ఎదుర్కొన్నట్టు పత్రికల్లో ప్రకటనను చదివినట్లు గుర్తు. సంశయాన్ని తెలిపేలా అతని చూపులున్నాయి.

క్ష. గా. 2 : అలా వ్రాస్తేగాని జనంలో మనకు సపోర్టురాదని మనవారలా రాయించారు.

చంద్రాయుడు: మనవారనగా?

క్ష. గా. 1 : ఈ ప్రాంతంలో ప్రభుత్వ పదవుల నలంకరించిన దళిత వర్గీయులు.

ఈ మాటలతో చంద్రాయుడు ఏ భావాన్ని వ్యక్తం చేయలేని చూపులను ప్రసరింపజేస్తూ నిలుచుని ఉండిపోయాడు.

క్ష. గా. 3: మనవారిద్దరు చనిపోయిన మాట వాస్తవమయినా వారి చావుకు రైతుల ప్రతీకార చర్య కారణం గాదు. అందులో ఒకడు విసిరిన కమ్మి రెండోవాడికి తగిలింది. ఉద్దేశ పూర్వకంగా అంటే తనతో విరోధిస్తున్నవానికి ఆ కమ్మి తగలాలనే కొట్టాడని కొందరంటారు. అక్కడి వృద్ధ రైతుపైకి విసరగా దురైవంవల్ల అది మనవాడికి తగిలి బలమైన గాయం గావించింది. దాంతో దెబ్బతిన్న మనవాడు రెచ్చిపోయాడు,

వాడు తీవ్రమైన గాయంతో బాధ పడుతు మరణానికి తెగించినవాడిలా తనకు గాయం గావించిన తన చిరకాల శత్రువుపైకి తిరగబడ్డాడు. వారి పెనుగులాటను మాన్పాలనీ, మన కన్నును మన వేలుతో పొడుచుకొంటున్న ప్రయత్నాన్ని నివారింప మేం ప్రయత్నించాం. వారి ఉద్రేకాన్ని తగ్గించటానికి ప్రయత్నం చేసిన మాకీ గాయాలు తగిలినాయి. వారు మాత్రం పరస్పరం పొడుచుకుని రణరంగంలో అసువులను కోల్పోయారు. ఆ ఉద్రేకంలో మేమేం చేయను తోచక, ఆ యింటి కోడలు చంకన బిడ్డతో తలుపు చాటున దాగిన మామను అదుకొనటానికై రాగా ఆమె చంక బిడ్డను నేను లాక్కున్నాను. ఆమె ఆ బిడ్డకోసం నామీదికి ఉరికింది. ఆ పెనగు లాటలో మనవారామెను వివస్త్రను చేసినా పట్టించుకోలేదు. బిడ్డకోసం పెంపరలాడుతుంది. మనవారామె పాలిండ్లలో పొడిచారు. మానంలో పొడవాలని ప్రయత్నించిన చాకు తొడకు తగిలి గాయమైనా ఆమె తన బిడ్డకోసం ముందుకు రాసాగింది. తుదకా బిడ్డను పొడిచి ఆ చాకుతోనే ఆమె కడుపులో మూడుసార్లు పొడిచాం. విలవిలలాడుతున్న ఆమె పైకి మృతిచెందిన బిడ్డను విసిరాం. ఆమె బిడ్డతోపాటు నేలకొరగటం, అక్కడి దడి కూలి ఆమెపై పడటం ఏకకాలంలో జరిగిపోయాయి.

ఈ వృత్తాంతాన్ని ఎంతో విజయం సాధించిన ధోరణిలో ష.గా. 3 చెప్పుతుంటే విన్న చంద్రాయుడు విల విల లాడాడు. సిగ్గుతో శిరస్సును వంచుకున్నాడు. ఇంతకంటే అసురకృత్యం ఉండదేమో అనుకున్నాడు. నవభారత దేశంలో నయసమాజ నిర్మాణానికి ఉద్యమిస్తున్నామని తలంచే మనం ఎటు ప్రయాణిస్తున్నామో ఊహించలేకపోయాడు. ఈ భావపరంపరను కన్నులవల్ల అక్కడివారికి తెలిపాడే గాని నోరు విప్పి ఒక పలుకైన పలుకలేదు. ఈ విధంగా మాతృమూర్తిని హింసించి చంపటం, గర్భవతియైన ఆమె కడుపులో కత్తిని దించటం, శిశువును చంపి ఆమెపైకి విసరటం మొదలుగా గల తీవ్రతను క్రౌర్యాన్ని సహించలేక భగవంతుడు సూర్యచంద్ర నేత్రుడు కన్ను మూసికొని నందున, ఆ దీనుల రక్త శరీరాలపై దడి విరుచుకుపడి ఉంటుందేమోననీ, ఇంకా ఎన్నో రీతులుగా చంద్రాయుడు తనలో తాను తలస్తూ ఈ వ్యవస్థపై దళితులు

అనే విభాగాన్ని గుర్తించి వివిధ రీతుల్లో ధన సహాయం, విద్యావకాశాలు, ఉద్యోగ భద్రతను కల్పిస్తూ పాలక యంత్రాంగం సమ సమాజం ఏర్పడటంలో అవరోధాలను కల్పిస్తున్నారేమో అని అతడికి కనిపించింది. దిన నిత్య కార్యక్రమాల్లో, అందరి కార్యక్రమాల్లో, అన్ని కార్యక్రమాల్లో దళితుల విషయానికి ప్రాధాన్యమిస్తూ రూపు మాసిపోబోతున్న కుల వ్యవస్థ అనే ఆరుకుపోతున్న అగ్నికి ఆజ్యాన్ని తోడు చేస్తున్నారని చంద్రాయుడు లోలోన తలంచాడు.

క్షతగాత్రులను పరామర్శింప వచ్చిన చంద్రాయుడు అతి తీవ్రము, ఏ మందులచేత శమింప వీలుగాని మానసిక గాయాన్ని పొందాడు. నిలువటం కష్టమైంది. ఇందుకే పూర్వులు ధ్యానాన్ని అలవర్చుకున్నాడు. ఆత్మ సంయమనం లేకుంటే తా నీ బాధకు తట్టుకోలేడు. ఆత్మ సంయమనం తనలో నుండి తనకు కలగాలి. సుఖదుఃఖాల కతీతము కర్తవ్యోన్ముఖము అయిన ఆలోచన మనిషి మనుగడకు కావాలనే ఉపనిషత్తుల సారాంశాన్ని, భారతీయుల భావనను, ఆర్ష సంప్రదాయాన్ని అతడు అభినందించకుండ ఉండలేకపోయాడు. ఈ భావన రాగానే కల్లోలితంగా ఉన్న చంద్రాయుని కన్నుల్లో ప్రసన్నత, గాంభీర్యము చోటు చేసుకున్నాయి.

ఇంత ఘనవిజయాన్ని సాధించిన క్షతగాత్రులను అభినందించక పోవటాన్ని ఆయనతో వచ్చినవారు కొందరు దుయ్యబట్టటం, లోలోపల తిట్టుకోవటం చేస్తున్నారు. మరికొందరు క్షతగాత్రులు చేసిన పనిని కొనియాడటం సరిగాదనుకున్నారు. దళితులపై సవర్ణులు ఇంతకు మునుపు వేర్వేరు కాలాల్లో, స్థలాల్లో గావించిన అగడాలను, హింసాత్మకకృత్యాల దృష్ట్యా సమర్థించారు. చంద్రాయుని యాలోచనా సరళిని అభినందించే కొందరు మాత్రం వెనుక దళితులు హింసకు గురి అయిన మాట నిజమైనా, ఈ నాడు దళితులు ఉన్నతవర్గాలవారి పీ విధంగా హింసిస్తే మనం మాత్రం ఏం తక్కువ తిన్నట్లు. కాలగతి, దేశ స్థితిగతులు మారుతున్నా మనం వెనుకటి చీకటి యుగాల్లో ఎవరో కొందరు వివేకరహితంగా ప్రవర్తించిన దురుసుతనాన్ని మళ్ళీ ఆచరణాత్మకంగా చూపితే దేశంలో ఈ వైరుధ్యం అంతరించదని బాధపడ్డాడు.

క్షతగాత్రుల పరామర్శ పూర్తయిన తరువాత వారందరు బరువు మనస్సులతో, ఆలోచనాత్మక చూపులతో అక్కడి నుండి వెనుదిరిగారు. ఈ మారీ జన

సందోహం వైద్యశాలలోని వార్డులవైపు దృష్టి మరల్చి నిదానంగా నడకను వరండాగుండా సాగిస్తున్నారు. వరండా కిరువైపులా వార్డులు, వార్డులలోని రోగ గ్రస్తులను, కొందరు వళ్ళు దాచుకోకుండా వస్త్రధారణ చేసి ఎదుటివారి నాకట్టు కొంటున్న నర్సులవైపు కొందరు, టిప్‌టాప్‌గ తయారై స్టెతస్కోపును వివిధ భంగిమల్లో ధరిస్తూ నర్సులు వెనుక పరికరాలను ధరించి వస్తుండగా ముందుకు సాగిపోతున్న స్త్రీ పురుష డాక్టర్లను చూస్తూ, ఇలాంటి పదవిని పొందనివారి అస్పృష్టానికి ఒక రకమైన అసూయాభావాన్ని పొందుతు కొందరు ముందుకు సాగిపోతున్నారు. వరండాలో నడుస్తున్నవారు అటు ఇటు వున్న వార్డుల్లోకి కిటికీలల్లో గుండా చూస్తూన్నా రా గుంపులో కొందరు. కిటికీలల్లో సగభాగం తెరను దించారు. అందువల్ల పండుకున్న రోగులు గానరాపు గాని నిలబడి నడుస్తున్నవారి ముఖాలు కనబడుతాయి. ఆలా సాగిపోతున్నవారిలో చంద్రాయుడికి తనకు తెలిసిన ముఖం ఒకటి ఆగపడింది. అక్కడనే దృష్టిని కేంద్రీకరించి కొన్ని సెకండ్లు చూచి నిశ్చయించుకున్నాడు ఆ వ్యక్తి తనకు తెలిసిన డాక్టరేనని. అయినా ముఖంలో వెనుకటి చిలిపితనం లేదు. పెద్దరికం, సీరియస్‌నెస్ చోటు చేసుకున్నాయి. శరీరం వెనుకటిలాగ గాక కొంత పుంజుకొన్నది. ముఖ్యంగా శారీరకమైన పెరుగుదల ముఖంలోను ఉదరంలోను గనబడుతుంది. ఇంతకు పూర్వంవలే నాజూకు వస్త్రాలను గాక తెల్లని చీరను, అదేవిధంగా ఉన్న జాకెట్టును ధరించి ఉంది. ఆమె శరీరం తెల్లగా ఉంటుంది కాబట్టి ఆ శరీరంతో సంవదిస్తుందామె వస్త్ర ధారణ. ఆమె చేతిలోని స్టెతస్కోపులోని తుదిభాగాలు, తలపై నున్న వెంట్రుకలు మాత్రం నల్లగా ఉన్నాయి. మిగతా శరీరం, వస్త్రం తెల్లగ ఉన్నందున ఆమె మహాశ్వేతను పోలి ఉంది. నర్సులు ఈమె వస్త్రధారణను పోలి ఉన్నా (తెలుపు విషయంలో) ఈమె నర్సులకువలె శిరస్సును తెల్లని వస్త్రంతో ఆచ్ఛాదన చేయ లేదు. వారు మోకాళ్ళ వరకు వేసుకునే గౌన్లు గాక ఈమె దాల్చింది చీరె. నర్సుల చేతుల్లో లేని స్టెతస్కోపు ఈమె చేతి కాభరణంగా ఉంది. సేవాభావంలో ఈమె నర్సులకు ఏ మాత్రం తక్కువ గాదని చూచినంతనే అనిపిస్తుంది. ఈ డాక్టరు మరెవరో గాదు హరి చెల్లెలు, రాజీవ్‌కు పరిచిత వ్యక్తి అయిన నరసిజ.

నరసిజ పూర్వ వృత్తాంతాన్ని, ఈ ఆసుపత్రిలో ఉద్యోగిగా చేరటాన్ని గూర్చి కొన్ని వివరా లీ సందర్భంలో చెప్పవలసి ఉంది. రాజీవ్ మిత్రుడయిన

హరి చెల్లెలి సరసిజ. హరి లెక్కల గ్రూపులో చేరగా ఈమె జంతు శాస్త్రాలను ఇంటర్‌లో తీసుకుంది. తరువాత వైద్యవిద్యలో ప్రవేశానికి జరిగిన పోటీ పరీక్షలో రాష్ట్ర మొత్తంమీద ఈమె మూడో స్థానాన్నాక్రమించింది. వైద్య విద్యలో పట్టభద్రతను పూర్తిచేసి స్నాతకోత్తర విద్యలో చేరటానికి మరల ప్రవేశ పరీక్ష రాసి రాష్ట్రస్థాయిలో రెండో స్థానాన్ని పొందింది. సైకియాట్రిక్‌ను ప్రధానాంశంగా తీసుకుని వైద్యవిద్యలో స్నాతకోత్తర పట్టాను పొందింది. వెంటనే రాష్ట్రంలోని ప్రముఖ నగరంలో గల ప్రభుత్వ వైద్యశాలలో ఆమెకు ఉద్యోగం వచ్చింది.

క్రైస్తవులు నిర్మించిన ఈ వైద్యశాలకు సరసిజ పొందిన పట్టాగలవారు క్రైస్తవుల్లో దొరకలేదు. అందువల్ల సరసిజను వారు ఎన్నిక చేశారు. ప్రభుత్వంలో ఆమెకు వస్తున్న జీతాన్ని మించిన జీతాన్నిచ్చి ఆమెను ఈ వైద్య శాలలో నియమించారు. ఆ శాఖలో ఆమె ముఖ్యమైన పదవి నలంకరిస్తుంది. మరొకరు ఈ యోగ్యతలు గలవారు వైద్యశాలలో లేరు. ప్రభుత్వ రంగంనుంచి ప్రైవేటు రంగంలో ఉద్యోగం చేయటానికి సరసిజ అంగీకరించటానికి పైన పేర్కొన్న పదవి, జీతంలో పెంపుదల కారణాలు గావు. దినదినం సుమారం నుండి విధి నిర్వహణకు రావలసిన స్థితి ఆమె ఉద్యోగం చేస్తున్న నగరంలో అనివార్యం. ప్రైవేటు రంగంవారు వైద్యశాలకు దగ్గరలోనే వైద్యులకు తదితర సిబ్బందికి నివాస గృహాలను నిర్మించారు. వాటిలో అన్ని సౌకర్యాలు ఉన్నాయి. అక్కడి ఉద్యోగస్తులేదో పని ఉండే వైద్యశాల అవరణ దాటి బయటికి వారానికి లేదా రెండు వారాలకు ఒకసారి పోవలసి రావచ్చు. అన్ని అవసరాలు ఆవరణం లోపలే అమరి ఉన్నాయి. ఈ యంశం సరసిజను ఎక్కువగా ప్రైవేటు రంగం వైపు ఆకర్షించింది. ప్రైవేటు వైద్యశాలలో పరికరాల కొరత ఉండదు. అధునాతన పరికరాలే దేశంలో ఉపయోగంలోకి వచ్చినా వాటిని వెంటనే ఈ వైద్య శాలకు తెప్పిస్తుంటారు. ఉన్న పరికరాలన్నీ నూతనంగా ఉంటాయి. కాల దోషం పట్టిన పరికరాలతో ప్రభుత్వరంగ వైద్యశాలల్లో వలె ఇందులో అవస్థ పడ వలసిన అవసరం ఉండదు. ఇంతేగాక తమ తమ వైద్య రంగంలో వినూత్న పద్ధతులను నేర్చుకోవాలన్న కోరికగల వైద్యుడు ఏదేశంపోయి అలాంటి విద్య నెంతకాలం అభ్యసించాలన్నా ప్రైవేటురంగంలోని వారు సులువుగ అంగీకరిస్తారు.

స్థికసాయం గూడ విదేశ ద్రవ్యరూపంలో చేస్తారు. ప్రభుత్వరంగ వైద్యా యాల్లో కలకాలం పనిచేసిన వారికైనా ఇలాంటి సౌకర్యాలు లభించకపోగా విధములైన అభ్యంతరాలు తల యెత్తుతుంటాయి.

ప్రభుత్వ రంగంనుండి ప్రైవేటు రంగానికి రావటానికివన్నీ కారణాలే కానీ, టన్నిటిని మించిన మరో కారణం ఉంది. అతి నిగూఢమైనదీ కారణము, ఒకో సారీ కారణాన్ని సరసిజ తనలో తాను పరాస్తం చేస్తుంటుంది. కానీ ఆమె హృదయం మాత్రం ఈ కారణాన్ని పదే పదే ఆమెకు జ్ఞాపకం చేస్తుంది. రాజీవ్ నివసించే నగరానికీ నగరం మిక్కిలి దగ్గరగా ఉండటమే కారణం. ఆ నగరం నుంచి వీచే వాయువు తన శరీరాన్ని తాకుతుందనే సంతృప్తి ఆమె హృదయంలో నిగూఢంగా దాగి ఉన్నట్లు తలంచటం సత్యదూరం గాదు. విరహావస్తలో ఉన్న యక్షుని నోట కాళిదాసు పలికించిన 'ఆ లింగ్యంతే గుణవతి మయా తే తుషారాద్రి వాతాః....' అనే అంశాన్ని స్థితి జ్ఞాపకం చేస్తుంది. సరసిజ ఈ విధంగా తలంపు లను నిగూఢంగా దాచుకున్నది. ఈ స్థితిని విరహం అనవచ్చునా? విరహం అంటే కొంతకాలం కలసి సంసార జీవితానన్నుభవించిన వారు ఏదో కారణాల వల్ల పున స్సమాగం లేకుండ ఉండటం. సరసిజ విషయంలో ఇది సమన్వయించదు. ఈ స్థితిని పూర్వానురాగ మనవచ్చు. అయితే పూర్వానురాగం స్త్రీ పురుషుల కిద్దరకు ఉంటే అది ఎప్పుడో ఒకనాడు రసంగా పరిణమిస్తుంది. ఈ సన్నివేశంలో సరసిజ రహస్యంగా రాజీవ్‌ను కోరుకుంటుందేగాని, రాజీవ్ విషయంలో ఇలాంటి స్పందనను ఏమాత్రం మనం గుర్తించలేం. ఇలా అనురాగం ఒకే వ్యక్తి నిష్టమైతే ఆ భావన తుదకు రసంగా పరిణమించక పోగా తదాభాసగా పేర్కొనబడుతుంది.

తన వర్గం దగ్గర సెలవు తీసుకొని చంద్రాయుడు వార్డులోకి ప్రవేశించాడు. అతని రాకకు కొంత వ్యవధి ఉంటుందని చెప్పినందున తక్కిన వారందరు నిష్క్ర మించారు. అంతకు మునుపు అంటే చంద్రాయ పురస్కారంగా దళితులు వరం డాలో నడుస్తున్నప్పుడే సరసిజ చంద్రాయున్ని చూడటం, వెంటనే గుర్తుపట్టి కున్నా, తనకు తెలిసినవాడే ననుకోవటం, మనస్సనే కంప్యూటరున్నంవి ఈ వ్యక్తి సామాదులను తెలుసుకోవాలంటే ఏ పిచ్చిని నొక్కడమా అని తలంచటం జరి గింది. అంతటితో ఆగక రెండు పిచ్చులను నొక్కి ప్రయత్నించింది. తరువాత పిచ్చి వేయాలనుకుంటుండగ కరెంటు లేనందున తన ఏక్షను నిలిపివేసిన

కంప్యూటరులా ఆమె మనస్సు ఆ యాలోచనలను నిలిపివేసింది. ఈ స్థితిలో చంద్రాయుడు దక్కడికి ప్రవేశించాడు. ఆమె పరీక్ష చేస్తున్న రోగి రక్త పోటుకు గురి అయ్యాడు. అధునాతనము విదేశీయము అయిన పరికరంతో ఆమె రోగి రక్తపోటులో పెంపుదలను తగ్గుదలను పరిశీలిస్తుంది. ఈ హెచ్చుతగ్గులకు మానసికములయిన ఏ సంచలనాలు, ఆనందాలు, అశాంతి ఎలా తోడ్పడతాయో తెలుసుకోవాలని ఆమె ఆయనతో వివిధాంశాలపైకి రోగి తలంపును మరల్చే ప్రయత్నం చేస్తూంది. ఇంతలో ఆయన రక్తపోటులో తగ్గుదల కనిపించింది. దీనికి తన ప్రసంగ ప్రభావం గాదనీ, నవాగంతకుడయిన వ్యక్తిని చూచినందున రోగికి కలిగిన ఆనంద కారణమనీ ఆమె గ్రహించింది. నవాగంతకుడు తానింతకు మునుపు చూచి గుర్తింప ప్రయత్నించి విఫలమైనవాడేనని ఆమె యెరుగును. రోగి మాత్రం ఆయనున్న పేరుతో పిలిచాడు. అపుడు సరసిజ అతణ్ణి గుర్తించింది. నవాగంతకుడయిన చంద్రాయుడు రోగిని గుర్తించనేలేదు. అతని రూపు రేఖలు మారిపోయాయి. మాట తీరులో మార్పు వచ్చింది. కేశ సంస్కారాదులకు అనారోగ్య కారణంగా వీలుకానందున అతని రూపం నివురులో దాగిన నిప్పు కణంలా నిగూఢంగా ఉంది. అతని నామధేయం రోగి మంచం దగ్గరున్న రికార్డు షీటులో ఉంది. రోగి రాజీవ్‌కు ఇంటరులో సంస్కృతాన్ని బోధించిన ఉపాధ్యాయుడే. చంద్రాయుడా ఉపాధ్యాయునకు నమస్కరించి, సవినయంగా ప్రక్కన నిలబడి ఆతని వ్యాధిని గూర్చి, ప్రస్తుత మాతడు నివసిస్తున్న ప్రాంతాన్ని గూర్చి వివరాలను తెలుసుకున్నాడు. ఆ ప్రసంగం ఇంకా సాగుతుండగానే ఆ డాక్టరును చంద్రాయునికి పరిచయం చేయ దలంచాడు. ఈ డాక్టరు రాజీవ్‌కు.... రాజీవ్ .... అని చెప్పి గద్గద స్వరంతో, రాజీవ్ మిత్రుడయిన హరి చెల్లెలు. పేరు సరసిజ అన్నాడు. ఈ మాటలతో రాజీవ్ తలంపుతో తన ఎదుటనున్న సరసిజ పొందుచున్న అవ్యక్తమైన సంతాపాన్ని తన దిగా భావించినందున గలిగిన సంతాపం వల్ల రక్తపోటు చాల అధికమైనది. ఈ పెరుగుదల రోగి మానసిక స్థితికి గల సంబంధాన్ని తెలియ చేయటం అవ ఒక వినూత్నాంశాన్ని సరసిజకు తెలియజేసింది. ఇమె సరసిజ అని తాను గుర్తించాలనీ, అందుకే తాసీ వార్డులోకి వచ్చాననీ, తాసీ నగరానికి వచ్చిన పనిని, మిగిలిన వివరాలను చంద్రాయుడు ఆ మాష్టారికి సవివరంగా నివేదించాడు. ఆ తరువాత మాష్టారు రాజీవ్ గురించి వివరాలనడిగి తెలుసు

కున్నాడు. మాష్టారి కొడుకును జిల్లా పరిషత్తు తరచు మార్పు చేస్తున్నందున, వారితోపాటు నిలకడ లేకుండా గ్రామాలను మారవలసి వస్తుందని, అందువల్ల రాజీవ్‌ను చూడలేక పోతున్నాననీ, అతన్ని చూడాలనే కోర్కె బలంగా ఉందనీ చెప్పాడు. ఇంతలో రోగి పడకను, తక్కిన పనిముట్లను పరిశుభ్రం చేసే ఆయాలు తమ తమ పరికరాలతో అక్కడకు వచ్చారు. అందువల్ల చంద్రా యుడు బయటికి వెళ్ళాడు. అతనితోపాటు వెలుపలికి వచ్చి వరండాలో ఉన్న చంద్రాయుణ్ణి సరజిజ గుచ్చిగుచ్చి రాజీవ్ విషయం అడిగింది. ఆమె మాటలు, కంఠస్వరం, కనుచూపులు రాజీవ్‌కు తాను శాశ్వతంగా అంకితమైనట్లు చెప్పక చెబుతుంది. ఇంతలో మాష్టారి దగ్గరనుండి ఆయాలు వెళ్ళిపోయినందున చంద్రా యుడు మరల మాష్టారిని సమీపించాడు. సరసిజ వ్యధాతప్త చిత్తంతో, నడకకు సహకరించని కాళ్ళతో బలవంతంగా ముందుకు సాగిపోతూందని చంద్రాయునికి కనిపించింది. 'తల్లి దగ్గరనుండి తన మెడకు పలుపేసి లాగబడ్డట్టి లేగలా సాగింది' అనే కవి వాక్యం ఈ సందర్భంలో చంద్రాయుని మనస్సులో మెదలింది.

ఆమె అలా వెళ్ళిన తరువాత చంద్రాయుడు వార్డులోకి వచ్చాడు ఉపాధ్యాయునికి సమీపంలో అతడికై వేసిన పీటపై కూర్చున్నాడు. అతని రాకను గమనించిన ఉపాధ్యాయుడు ఏవో విషయాలను చెప్పాలని ప్రయత్నిస్తు న్నాడు. నీరసం అతనికి గాద్గద్యాన్ని కలిగిస్తూంది. అతని మాటలన్నీ రాజీవ్‌ను గురించే. రాజీవ్ గొప్ప విజయాన్ని సాధించాడు. తన దగ్గర ఒకనాడు సంస్కృతాన్ని చదివి, తనకు తెలియని వివిధాంశాలను స్వయంగా నేర్చుకోవటం వంటి సమన్వయం అన్య దుర్లభం. అతడీ నడుమ రేడియోలో టి విలో చేసిన ప్రసంగాలు పాల్గొన్న చర్చా కార్యక్రమాలు మన సంస్కృతికి పునరుజ్జీవాన్ని గలిగిస్తున్నాయనిపించిందంటాడు. ఇంతటి వివేకవంతుడయినా తనకు సర్వ స్వాన్నిచ్చిన వనితను పరిగ్రహించాలనే ఇంగిత జ్ఞానం లేకపోవటానికి మరీ మరీ బాధను ప్రకటించాడు. సరసిజ అతనికోసం ఎంతగా తపిస్తుందో తానీ మూడు రోజుల్లో ఇక్కడ రోగిగా ఉండి గ్రహించానన్నాడు. ఇంతటితో విజిటర్సుకిచ్చిన వ్యవధి అయిపోయినందున ఆయాలు, కాంపౌండర్లు విజిటర్సును పొమ్మంటున్నారు. ఈ మాష్టారు ఎక్కువ మాట్లాడటం మంచిది గానందున్న అతన్ని పలకజేస్తున్న చంద్రాయుని బయలుదేరనున్నారు. అంతటితో చంద్రా

యుడు బయలుదేరి అప్పటికే కాలాతీతమయినందున హుటాహుటిని మీటింగు స్థలానికి బయలుదేరాడు.

ఆ రాత్రి సరసిజకు నిద్రపట్టకపోగా మానసికమైన అశాంతి మరీ అధిక మయినది. రాజీవ్ ఉపన్యాసాలను రేడియో, టి. వీలలో ప్రసారమైనపుడు గూడ ఆమె అశాంతికి గురయ్యేది. ఆయన ప్రసంగాలను ప్రశంసిస్తూ రేడియో టి. వి. వారికి వ్రాసిన జాబులను గూర్చి విన్ననాడు ఆమె మరీ అశాంతిని పొందేది. అలాటి ఉత్తమ వ్యక్తి తనవాడు కాలేదు. అస లతనితో తనకు పొందు కుదురుతుందా లేదా అవి ఆమెకు తరచు సందేహం కలుగుతుంది. తాను సాధించిన విజయపరం పర కన్న అతడు పొందిన పదవి అపూర్వమయినదని ఆమె నమ్మకం. తాను చదువుకుంది కళాశాలలో. అతడు స్వయంకృషితో ఇంతటివాడయినాడు. ఈ విష యాన్ని తలుస్తుంటే తనకు శాంతి పెరుగుతుంది. ఈ నాడు చంద్రాయుడు, సంస్కృతం మాష్టారు రాజీవ్‌ను గూర్చి అనుకున్న మాటలు ఆమెను అశాంతికి లక్ష్యం గావించాయి.

ప్రభుత్వ రంగంలోని ఉద్యోగానికి రాజీనామా చేసి ప్రైవేటు రంగంలోనికి డాక్టరుగా వచ్చేటప్పుడు తాను జీవితాంతం మానవసేవ చేస్తూ సన్యాసిగా ఉండాలనే దృఢ సంకల్పంతో ఉంది తను వలచినవాడు తనకు దక్కటంలేదు. వేరొకన్ని ఆ స్థానంలో తానూహించలేక పోతుంది. తను కోరుకుంటున్న జీవిత విధానానికి క్రైస్తవమతంవారు నడుపుతున్న వైద్యశాల ఎంతగానో తోడ్పడుతుందని ఆమె ఆనాడు నమ్మింది. తనలా అక్కడి జీవితాన్ని భగవత్సేవ కంకితం చేసిన నర్సులు చాలామందితో పాటు, తాను గూడ మానవసేవతో ఆర్తుల నాదుకుని చికిత్స చేయ టంతో గలిగే సంతృప్తితో తన జీవిత శేషాన్ని గడపాలనుకొంటుంది. కాని అక్కడకు వచ్చిన తరువాత కొంతకాలంలోనే తన ఊహ సరిగాదేమ అని తెలుసుకుంది. సరసిజకు విశాలమైన భవనాన్నిచ్చారు. మిగిలిన స్త్రీ లందరికీ ఆ భవనం వెనుక ఉండే గృహాల నిచ్చారు. రాత్రిపూట సరసిజ ఇంటి ప్రక్కగా పురుషులు పోవటం రావటం ఆమె గమనించేది. క్రైస్తవ పరిభాషలో పురుషులంతా Brothers, స్త్రీలంతా Sisters. విశ్వజనీయమయిన ఈ సోదర ప్రేమ రాత్రుళ్ళు రాధాకృష్ణుల రాసలీలను పోలినదిగా ఉంటుందని ఆమె అచిరకాలంలోనే తెలుసు కున్నది. తక్కిన కులాలవారివలె క్రైస్తవులు గూడ ధర్మానికి వయఃప్రాభవానికి

లోనవుతున్నారని ఆమె అచిరకాలంలోనే గ్రహించింది. తను ఈ ప్రాభాల
కతీతంగా ఉండటానికి ఇక్కడి వాతావరణం సహకరిస్తుందని తాను తలచటం
వాస్తవం గాదని ఆమెకు స్పష్టమయింది. ఈ భావన వచ్చినపుడు మనోనేత్రానికి
అగపడేవాడు రాజీవ్. అతని హృదయం ఏమిటో తనకు తెలియదు. ఈ విష
యంలో తా నెలా నడచుకోవాలి. ఎదుటివారి మనోగతాన్నెలా అవగతం చేసు
కోవాలి. అని తనకు తరచు గలిగే ప్రశ్న.

దళితుల సభ ముగింపు చేసుకొని చంద్రాయుడు స్వనగరానికి తిరిగి
పోయాడు. పోయేపుడు క్షతగాత్రులయిన దళితులవల్ల విన్న యంశాలు అతనికి
నని బాధను గలిగిస్తున్నందున ఆతడు సభల్లో సరిగ్గా పాల్గొనలేదు. అసలు పాస
జనాదులందు గూడ అతనికి అయిష్టత ఏర్పడింది. రాజీవ్‌కు ఆప్తులయిన
మాష్టారిని, డాక్టరు సరసిజను చూచినందునందున గలిగిన ఆనందం, వారి మాట
ను విన్నందువల్ల జనించిన సంతృప్తి ఈ భారాన్ని కొంతకు కొంత తగ్గించినా
యనకు విషాదమే మిగులుగా ఉన్నట్లు ఆయన ప్రవర్తన వ్యక్తీకరిస్తోంది.
జీవ్ హృదయంలో సరసిజ విషయమై ఎలాంటి ఆలోచన లున్నాయి. అసలు
త డామెను గుర్తుంచుకున్నాడా లేక నిత్యం చదివే గ్రంథ పరంపరలో,
నచుగ కావించే రేడియో, T.V. ల్లో ప్రసంగాలే గాక దక్షిణ ఉత్తర భారత
నే భేదాలు లేకుండ అన్ని ప్రాంతాల్లో సంస్కృతంలోని సంస్కృతిని
ర్చి వారి వారి కర్థమయ్యేటట్లు వారి భాషలో గానీ, లేదా ఆంగ్లంలో
నీ లేకుంటే సంస్కృతంలో ప్రసంగాలు చేయటానికి తగిన విషయ
రణలో ఉపన్యాసాలను తయారుచేసుకొనడంలో, ఉపన్యాస కార్య
మాల్లో పాల్గొనటంలో ఆయన కాలమంతా అతీతమయి పోతుంది. గార్హస్త్య
తాన్ని గూర్చిన యాలోచన ఆయనకు రానేరాదు అంతే అది కేవలం
స్తవం. అలాంటపుడు సరసిజ విషయం తలంపుకు రాదు. అలాంటివానికి
సిజను గూర్చి తాను గ్రహించిన యంశాలను, సంస్కృతం మాష్టారివల్ల
సుకున్న అంశాలను వివరించినా ఉపయోగం ఉంటుందో లేదో తెలియటం
. ఈ విధమైన ఆలోచన పరంపరలో తలమునకలవుతూ చంద్రాయుడు తన
గానికి చేరుకున్నాడు. ఆనాటి సాయంకాలమే రాజీవ్‌ను కలుసుకోవటానికి
లుదేరి వెళ్ళాడు. రాజీవ్ ఊళ్లోలేడని చెప్పారు. ఆ రాత్రికి గూడ వచ్చే
న్నలేదు. మరునాడు ఉదయం వస్తాడని తెలిసింది. ఉదయం ఎన్ని గంటలకో

అని చంద్రాయుడు డడుగగా బయటి కాపలామనిషి లోనకు పోయి రాజీవ్ తల్లి నడిగి వివరంగా చెప్పాడు. మర్నాడు ఉదయం తొమ్మిది గంటలకు ఇంటికి చేరు కుంటాడు గాని పన్నెండు గంటల ప్రాంతంలో ఆ యాగంతకుడు వస్తే బాగుండు నని తెలిపాడు. వచ్చినంతనే ఈయనగానీ, ఇలాంటివారెవరైనా గానీ వస్తే స్నానంచేసి అన్నపానాదులను పట్టించుకోక వారితో గడుపుతుండటం రాజీవ్‌కు పరిపాటి. నెలలో సగం రోజులు మాత్రం ఇంటిపట్టున ఉండే రాజీవ్ సావధానంగా స్నాన భోజనాదులను ముగించుకున్నాకనే ఆగంతుకులతో కలియటాన్ని ఆమె సమ్మతిస్తుంది. వయస్సు మీరుతున్నా వివాహమును గూర్చి పట్టించుకోక, వయో ధర్మాన్ని పక్కకునెట్టి ప్రజాహిత కార్యాలలో వ్యగ్రతను చూపించే తనయులను గూర్చి సంతాపం చెందని తల్లి ఎవరుంటారు. రాజీవ్ తల్లి బాధ అదే. ఇంతగా వివరాలు చెప్పినా చంద్రాయుడు మర్నాడు ఉదయం పదిగంటలకే రాజీవ్ కోసం వచ్చాడు. రాజీవపుడే స్నానాన్ని ముగించుకొని టిఫిన్ తీసుకుంటున్నాడు. చంద్రా యుని రాకను గూర్చి విన్నందున పది నిముషాల్లో టిఫిన్ పని ముగించుకొని డ్రసు చేసుకొని తనకోసం ఎదురు చూస్తున్న చంద్రాయుణ్ణి కలుసుకున్నాడు.

చంద్రాయుడు వైద్యశాలలో చికిత్సకోసం సంస్కృత ఉపాధ్యాయుడున్న విషయాన్ని, అతనికి ప్రత్యేకించి చికిత్స చేస్తున్న సరసిజను గూర్చి ముక్తసరిగా చెప్పాడు. తనకు సంస్కృత భాషలో ప్రవేశాన్ని గల్పించిన ఉపాధ్యాయుడు ప్రస్తుతం ఎక్కడ నివసించునదీ తెలియక కొంతకాలంగా చింతిస్తున్నాడు రాజీవ్. అతని గూర్చిన వివరాలు రాజీవ్‌కి ప్రోత్సాహాన్ని గల్పించింది. అవశ్యం ఆయన్ని చూడాలని వెంటనే బయలుదేరాలనుకున్నాడు. సరసిజను గూర్చిన వివరాలు గూడా తనకు సంతృప్తిని గలిగించాయి. సరసిజ ప్రభుత్వ రంగంనుంచి ప్రైవేటు వైద్య శాలలో ఉద్యోగం చేస్తున్నట్లు రాజీవ్‌కు తెలుసు. ఈ నడుమ హరిని కలిసినప్పుడు అతడే స్వయంగా కల్పించుకుని తన చెల్లెలి వివరాలను తెలియజేశాడు. సంస్కృతం మాష్టారికి తానే స్వయంగా చికిత్స చేయటాన్ని సరసిజకు లభించిన సదవకాశమని అతని కనిపించింది.

సరసిజ పొందిన వైద్యశాస్త్ర వైదుష్యాన్నీ, ఆమె జీవితంలో పొందదగిన వన్నీ వున్నా, వైవాహిక జీవితానికి నోచుకోక పోయినందున పొందే అశాంతినీ,

తన హృదయంలో ఎపుడు ప్రతిష్ఠించిందో చెప్పలేని బాధను గూర్చి మాష్టారు చెప్పిన వివరాల నన్నింటినీ పూసగుచ్చినట్లు చంద్రాయుడు రాజీవ్‌కు చెప్పాడు. అంతేగాక సరసిజ ప్రత్యేకించి తమ్ను 'రాజీవ్'ను గూర్చిన వివరాల నడగటంలో పొందిన తడబాటు, తొందరపాటు పునరుక్తి చెప్పిన మాటనే మరల మరల వేర్వేరు రీతుల్లో చెప్పటం మొదలయిన వివరాల నన్నింటిని సవివరంగా చెప్పాడు. రాజీవ్‌తోపాటీ మాటలను ఆ ప్రక్కగదిలో ఉన్న రాజీవ్ తల్లి విన్నది. సరసిజకు తన పుత్రునిపై గల మమకారానికి సంతుష్టస్వాంత అయ్యింది. రాజీవ్ ఈ సంబంధాని కంగీకరిస్తే సరి. లేదా తానన్నా స్వయంగా కలుగజేసుకొని రాజీవ్‌ను ఒప్పించి ఈ బాంధవ్యాన్ని కలపాలనీ, అన్నీ అనుకూలిస్తే తన సుతుని వివాహం అతి వైభవంగా చేయాలనీ, తమకు ఎంత సంపద ఉన్నా, దినదినం ఎంత సంపాదన వస్తున్నా తమ ఇంట ఇంతకాలంగా ఒక్క శుభకార్యమయినా జరగక పోవటాన్ని ఆమె మిక్కిలి దిగులుపడుతుంది. చంద్రాయునికి తన యభిమతాన్ని రాజీవ్ వినేటట్లుగా చెప్పింది.

రాజీవ్ వెంటనే సంస్కృతం మాష్టారిని చూడాలని బయలుదేరాడు. మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతానికి మాష్టారున్న వైద్యశాలను చేరుకున్నాడు. వార్డునంబరు, పడక నంబరు తెలిపి తనకు లోపలికి పోవడానికి అనుమతిని కోరాడు. ఆ రోగి అచిరకాలంలో మృతుడవటం తప్పదని వైద్యశాస్త్రం ధృవీకరించింది. అలాంటి రోగులను చూడటానికి ఆప్తులెందరు వచ్చినా సమయా సమయాలను లెక్కచేయకుండ లోనికిపోవ ననుమతి యిస్తారు. అది ఆ వైద్యశాలకు సంబంధించిన ప్రత్యేక నియమము. ఆ నియమంవల్ల రాజీవ్ లోపలికి పోవ అనుమతి లభించింది అడిగినంతనే. లేకుంటే సాయంతం నాలుగున్నర తరువాత 'విజిటర్స్ అవరు' వరకు రాజీవ్ నిరీక్షించవలసి ఉండేది. లక్ష్యశుద్ధి గల ధానుష్కుడు వదిలిన బాణమువలె రాజీవ్ నేరుగ ఉపాధ్యాయుని పడక దగ్గరకు పోయాడు. వార్డులన్నీ నిశబ్దంగా ఉన్నాయి. బాధలు భరించలేని రోగుల ఆర్తనాదా లక్కడక్కడ వినవస్తున్నాయి.

తన ఉపాధ్యాయుని మంచం దగ్గరకు సమీపించినా ఆయన వచ్చిన వ్యక్తిని గమనించిన సూచనలేం గనరాలేదు. ఆయన అంతకు కొన్ని నిముషాల ముందుగా భోజన కార్యక్రమాన్ని పూర్తిచేసుకుని మాగన్నుగ నిద్రపోయినట్లుంది. కొద్ది

నిముషాం తరువాత ఆయన కన్నులు అర్ధనిమీలితాలయినాయి. రాజీవ్ మాస్టారూ అన్నంతనే ఆ మాస్టారు తన ప్రియశిష్యుని గుర్తించాడు. కంఠస్వరం విన్నంతనే ఆయన్ను గుర్తించాడని తెలుస్తుంది.

రాజీవ్ : ఎలా ఉంది మాస్టారూ? అని బాష్పవృత్తి స్తంభితమైన ధ్వని తెలిసే కంఠంతో అన్నాడు.

ఉపాధ్యాయుడు: నాకేం బాగానే ఉన్నాను. వీరందరు నన్ను గురించి యాందోళన చెందుతున్నారుగాని నాకేం ప్రమాదం ముంచుకురాలేదని ఎంత చెప్పినా వినిపించుకోవటంలేదు. నిన్ను చూచినందున నాకు ఏనుగుబలం వచ్చింది. ఇక్కడ నాకు వైద్యం చేస్తూంది సరసిజ. అని చెప్పి అంత టితో ఆగిపోయాడు.

రాజీవ్ : ఆహారం విషయంలో ఏమైనా నిషేధాలున్నాయా?

ఉపాధ్యాయుడు: లేవు అని ముక్తసరిగా చెప్పి, సరసిజ యొక్క గుణసంపద. వినమ్రత, సేవాదక్షత, వైద్యశాస్త్ర పాండిత్యం అన్నీ నాకు బాగా నచ్చినాయి కానీ....

రాజీవ్ : నచ్చనిదేదో చెప్పండి?

ఉపాధ్యాయుడు: ఆమెయొక్క వయస్సు అడవిగాసిన వెన్నెలలో అగోచర దుర్గమ దుర్గవల్లరీ కుసుమంలా వాడిపోతూంది. రూపురేఖలలో వయస్సువల్ల కలిగే అందచందాలు తగ్గిపోతున్నాయి. ఆమె హృదయం ఎవరి కంకిత మయ్యిందో తెలియదు. ఈ నడుమ చంద్రాయుడు ఆమెకు ఆరాధ్య వ్యక్తి మీ శిష్యుదేనని వ్యక్తావ్యక్తంగా చెప్పాడు. అంటే ఆ వ్యక్తి నీవేనా? ఎవరయినా పార్వతిని తపస్సు కుపక్రమింపజేసినట్లు ఆమె వైద్యవృత్తికి జీవితాన్నంకితం చేస్తూ ఇలాగే కాలం గడిస్తే వార్ధక్యం గాకున్నా పెద్దతనాన్ని కొనితెచ్చుకొన్నట్లవుతుంది. ఈ మాటలను చెప్పేటప్పుడు మూగబాధ ముఖకవళికల్లో చోటు చేసుకుంది.

అని ఇంకా ఏదో చెప్పబోతున్న ఉపాధ్యాయుడి మాటలను ఆపాలని రాజీవ్ ప్రయత్నించినందున ప్రసంగం మార్చాడు.

రాజీవ్ : మీ కిక్కడ ఎలా కాలం గడుస్తుంది.

ఉపాధ్యాయుడు: నేను నిద్రలేచిన తరువాత కొంతకాలానికే సరసిజ వస్తుంది. నా వ్యాధిపై ఆమె ప్రత్యేక శ్రద్ధవహిస్తుంది. తరువాత నర్సులు రావటం, మందు వేయటం అనంతరం భోజనాదులు, సాయంత్రం వరకు విశ్రాంతి. తరువాత మేం కొందరం అక్కడున్న వినోదశాలకుపోతాం. అందులో రేడియో, టి.వి. ఉంటాయి. ఆ ప్రోగ్రాములతో కాలం గడుస్తుంది.

రాజీవ్ : ఈ నాడు రేడియో, T. V. వారు ప్రసరించే కార్యక్రమాల్లో మీకు నచ్చినవంతగా ఉండవనుకుంటాను.

ఉపాధ్యాయుడు: నిజమే. అనడుమ రేడియోలో నీ ప్రసంగం వచ్చింది. T. V. లో నీ సంభాషణ చూచాను. వాటిని ఆ సరసిజ గూడ చూచింది. ఆమె నాకంటె అధికంగా సంతోషించింది. అని మరల ఉపాధ్యాయుడు సరసిజ విషయం ప్రస్తావించగా దానిని విరమింపజేయటానికై

రాజీవ్ : T. V. లో కొన్ని కొన్ని సినిమాలు వస్తుంటాయి గదా, వాటిని చూస్తుంటారా?

ఉపాధ్యాయుడు: ఔను బాబూ. నిన్న ఓ సినిమా వచ్చింది. చాలా అసహ్యమనిపించింది.

రాజీవ్ : అవును మాష్టారూ. ఇంతకు మునుపు విదేశాల్లో పచ్చి శృంగారాన్ని ప్రవహింపజేసే వాతావరణం ఉండేదంటారు. ఇపుడు మనవారింతకన్న శృంగారం విషయంలో ఏమాత్రం తగ్గిపోవటంలేదు. ఈ నడుమ తెలుగు సినిమాలను గూర్చి పత్రికారంగంలో చర్చ రావటం సాధారణం. అంతేగాక జోకులు గూడ వస్తున్నాయండి.

ఉపాధ్యాయుడు: ఒకటి రెండు జోకులను చెప్పు రాజీవ్. నీ నుండి వాటిని విని మనోభారం, వ్యాధి తీవ్రత తగ్గేలా నవ్వాలని ఉంది.

రాజీవ్ : పచ్చి శృంగారాత్మకంగా ఒక సినిమాను ఓ నిర్మాత తీయగా దాన్ని చూచి పారవశ్యాన్ని పొందిన ఆ నిర్మాత కూతురెవరితోనో లేచిపోయిందట. కొత్తగా అద్దె ఇంటికి వచ్చిన ఓ గృహిణి ఆ యింటిలోని ప్రేరే వాటాల్లో ఉన్న యిల్లాలితో ఇలా అంది. అమ్మా పసి

పిల్లల్ని తెలుగు సినిమాలకు తీసుకుపోవటం మాన్పించండి అని వారి ముందే అంటుంది. ఆ కొంటెకోణంగు లిరువురు దిక్కు తోచని మొగాలతో ఉండ ఆ గృహిణి మరలా ఇలా చెప్పింది. తాను స్నానం చేస్తుంటే ఆ విసుగులు మేడపై నుండి తొంగి తొంగి తనను చూస్తున్నారని ఆ గృహిణి బాధతో విన్నపం గావించింది. మరో జోకు. ఒక అవ్వ తన యింటికి వచ్చిన యువతితో ఇలా అంటుంది. మా వారు కొంచెం చిలిపిగా ప్రవర్తిస్తూ ఉంటారు. నువ్వేం పట్టించుకోవద్దమ్మా. మా వారు తరచుగా తెలుగు సినిమాలు చూస్తుంటారు. అని తన భర్త చిలిపితనానికి కారణాన్ని తాను వివరించింది.

ఈ జోక్సును విని ఉపాధ్యాయుడు నవ్వు ముఖం పెట్టాడే కాని, ఇందులో ఉన్న జుగుప్సాకరమైన యంశాలాతనికి బాధా జనకాలయినాయి. అందువల్ల అతనికి రక్తపోటు పెరిగినందున విస్పహాయంగా ఉడిపోయాడు. అతనిలో ఇంతగా వచ్చిన మార్పుకు రాజీవ్ ఖంగారు పడిపోయాడు. అపుడా వరండాలో పోతున్న నర్సుకు రాజీవ్ తన యాందోళనను వ్యక్తంచేశాడు. ఆ నర్సు వార్డులోకి వచ్చి రోగిని పరీక్షించి ఇప్పటికి ప్రమాదం తగ్గింది గాని ...అని ఇంకా ఏదో చెప్పబోయి అక్కడ ఉన్న క్రొత్త మనిషికా విషయం చెప్పటం దేనికని మాటను మార్చి అక్కడ నుండి తిరిగిపోయింది. ఉపాధ్యాయుడు తేరుకున్నట్లు అతని చూపులవల్ల గ్రహించి, అసభ్యమయిన యంశాలతనికి ఆనందాన్ని గాక అసహ్యాన్ని గలిగించు నందులకు వ్యధ చెందాడు. ఈమారు చలన చిత్రాలకు మూలమైన రంగ స్థలం అందాడే నాటకాల, ఆ నాటకాల వివరాలను సంపుటీకరించిన భరతుని నాట్యశాస్త్రాన్ని గూర్చి చెప్పాలనుకుంటాడు.

రాజీవ్ : పంచమ వేదమైన నాట్యశాస్త్రం నేటి చలన చిత్రాలకు మూలం. కాని అందులో ఉన్న యంశాలతి ఉదాత్తాలు.

అని రాజీవ్ ఈ విధంగా తన ప్రసంగాన్నారంభించాడు. ఇంతలో ఉపాధ్యాయుడు కలుగజేసుకుని నాట్యారంభంలో గావించే దైవ ప్రార్థనవల్ల దేవతలు మిక్కిలి సంతుష్ట స్వాంతలవుతారనీ, పూజా పురస్కారాలవల్ల కలుగని సంతోషాన్ని, నాటకారంభంలో మంగళాత్మక స్తోత్రంలో ప్రవర్తమైన దైవప్రార్థన వల్ల వారు పొందుతారని నాట్య శాస్త్రాంతంలో భరతుడు చెప్పిన యంశాన్ని తాను

చిన్నతనంలో వినియుండటాన్ని స్మరణకు తెచ్చుకున్నాడు. మానవజాతి నాటకాలను చూచి ఆనందాన్ని పొందాలనీ, సుఖ సంతోషాలతో జీవితాన్ని గడపాలనీ దేవతల తలంపని మనం ఊహించగలం. వయో భారానికీ, వ్యాధి తీవ్రతకు గురయినా ఉపాధ్యాయుని జ్ఞాపకశక్తి రాజీవ్‌కు ఆనందంతోపాటు ఆశ్చర్యాన్ని గలిగించింది. భరతముని నాటకాన్నీ, దాన్ని చూచి ఆనందించే సామాజికులను గూర్చిన యంశాలను తాను చెప్పి ఉపాధ్యాయునికి ఉత్సాహాన్ని గలిగించాలని—

రాజీవ్ : సత్ప్రవర్తన గల జనాదరాభిమానాలను నాటకం పొందగలిగి ఉండాలి. అంతేగాక నాటకం ఎట్టి పరిస్థితుల్లోను దుష్టచిత్తులకు వినోదాన్ని గల్పించేదిగా ఉండగూడదు. నాటకాన్ని చూచిన జనసందోహం సుఖంగా, శాంతచిత్తతో ఉండటానికి తగిన వాతావరణాన్ని కల్పించ గలిగిందై ఉండాలి. ఇంతే కాక నాటకంలో ప్రయోగించే భాష సరళంగా ఉండాలి. అంటే ద్రాక్షాపాకాన్ని నాటకాలల్లో వాడాలి.

ఉపాధ్యాయుడు: దుష్టులకు గాక సజ్జనుల కాహ్లాదకం గావలసిన నాటకం నుంచి ఏర్పడినట్టి రంగస్థలం ముఖ్యంగా చలన చిత్రం దుష్ట హృదయ రంజకం, సుజన హృదయ భంజకం ఆయి ఉండటం మనమెరిగిన యంశమే.

రాజీవ్ : నాటకంలో వస్తువు మహర్షులకు, దేవతలకు సంబంధించినదై ఉండాలి. అప్రసిద్ధము, కల్పితము అయిన కథ నాధారంగా చేసుకుని నాటక నిర్మాణం జరగటం నిషిద్ధం. లోక స్వభావాన్నీ, జన సందోహం యొక్క శక్తి సామర్థ్యాలను దృష్టియందుంచుకుని నాటకంలో సంభోగ శృంగారాదుల ప్రదర్శించాలి.

ఉపాధ్యాయుడు: ప్రస్తుతం చలనచిత్రాల్లో కథ కల్పితం. వింత వింత ధోరణులిందులో చోటు చేసుకొంటున్నాయి. అంతేగాక శృంగారాది రస సన్నివేశాలను చూచిన సామాజికుడు తన్నుతా నదుపులో పెట్టుకోగల మానసిక శక్తి గలిగి ఉండాలి. ఇపుడీ చలన చిత్రాల్లోని ఘట్టాలు హద్దుమీరి ఉన్నాయి. ప్రేక్షకులకు సంయమనం అసలే లేదు. అందువల్ల పైన మనం చెప్పుకున్న జోక్పును పత్రికలవా రందజేస్తున్నారు ఇందులో కొంతకు కొంత వాస్తవం లేదనలేం,

రాజీవ్ : నాటకంలో ప్రదర్శిత వ్యంగ్య భావాలను ఆస్వాదించటం వలన మనస్సు ద్రవీభవించటం సామాజిక సామాన్య లక్షణాలు. భావ పరంపర అనంతం. మానవ జీవితం పరిమితం. ప్రేక్షకుని పాండిత్యానికీ వివేచనకు హద్దులుంటాయి. నాటక ప్రదర్శిత భావాల నన్నింటినీ ఒకే ఒక వ్యక్తి గ్రహించలేడు. ప్రేక్షకుల్లో ఉత్తమాధమ మధ్యములనే త్రివర్గా లున్నాయి.

ఉపాధ్యాయుడు: నాటకాన్నాస్వాదించటం ఉత్తమాది భేదాలెందుకు?

రాజీవ్ : ఉత్తమ అభిరుచులను, వారు గ్రహించే భావాలను, అధముడైన ప్రేక్షకునకు అవగతాలు కావు గదా? వ్యక్తులు జీవించే పరిసరాలు, ఇరుగు పొరుగువారు, సహాధ్యాయులు, మిత్రులు కళలయందుండే ఆస్వాదనా యోగ్యతలు అంతరువులు జీవనాన్ని గడిపేందుకు ఆచరించే విధానం, చేపట్టిన వృత్తి, నాటకంలో ప్రయోగించే భాష, సామాజికులకు పరిచితమైన భాష కాకపోవుట ఇవన్నీ ఆస్వాదనలో సామాజికుడు ఎదుర్కొనే సమస్యలు. అంటే సామాజికుని ఆస్వాదన వీటన్నిటిపైన ఆధారపడి ఉంటుంది. మనము చెప్పుకున్న భావాల ననుకరించటంలో ఏ వ్యక్తి ఎంత ఆసక్తుడో వానికా సామాజికుడనే పేరు లభిస్తుంది.

ఉపాధ్యాయుడు: ఈ విధంగా గుర్తింపదగిన సామాజికు లీనాడున్నారా?

రాజీవ్ : క్రమంగా నరుల పాండిత్యం తగ్గుముఖం పడుతుంది. శాస్త్ర పాండిత్యంతో పాటు విచక్షణా జ్ఞానం క్షీణదశకు చేరుకుంటాయి. ప్రేక్షకుల శారీరక పాటవాన్నీ వారి భావాలను అర్థం చేసుకుని రంగస్థలము నందు వ్యక్తీకరించే భావాలను సులభగ్రాహ్యాలుగా చేయాలి. ముఖ్యంగా నాటకీయ భాష ప్రసన్నము, సర్వసామాజిక పరిచితము అయి ఉండాలి.

ఉపాధ్యాయుడు: సుదీర్ఘ సమాస భూయిష్ట రచనకేగాక ప్రాంతీయమైన భాషా వైలక్ష్యాలను నాటకాల్లో వాడరాదని గదా దీని సారాంశం. ఇన్ని వివరాలను నీ వెక్కడ గ్రహించావు.

రాజీవ్ : భరతుని నాట్యశాస్త్రం నుంచి.

ఉపాధ్యాయుడు: మీరెన్నో గ్రంథాలను చదివి, అందలి సారాంశాన్ని గ్రహించి అందరికి సమయం వచ్చినపుడు వివరించి మన సంప్రదాయానికి జనాదరణ కలిగిస్తున్నావు.

అని అంటున్నంతలో ఉపాధ్యాయునికి గలిగిన ఆనందంతో రక్తపోటు అధికమైంది. ఆయన వాస్తవ స్థితికి రావటానికి కొంత వ్యవధి పట్టింది. ఇంతలో గడియారం మూడు గంటలు కొట్టడం రాజీవ్ వింటున్నంతలో ఎదురుగా హరి ప్రత్యక్షమయినాడు. అతని రాక రాజీవ్‌కు ఆశ్చర్యాన్ని గలిగించలేదు. సరసిజను చూడటానికి వచ్చాడని తలంచాడు. బాల్య మిత్రుల యోగక్షేమాలతో కొంతకాలం గడచిపోయింది. హరి చేస్తున్న ఉద్యోగంలోని సాదక బాధకాలను సవివరంగా అడిగి రాజీవ్ తెలుసుకున్నాడు. రాజీవ్ రేడియోలోను, T. V. లోను ప్రజల నందించిన ప్రసంగాల తీరును హరి ప్రశంసించాడు. తన యభిప్రాయాన్నే గాక, తనకు తెలిసినవారి ప్రసంగాలపై వెలిబుచ్చిన యభిప్రాయాలను గూడ హరి సావధానంగా రాజీవ్‌కు వివరించాడు. ఇంతసేపు మాట్లాడుతున్నప్పటికి రాజీవ్ సరసిజను గూర్చి ప్రసంగం చేయకపోవటం హరికి మూగసాధను గలుగజేసిందని చెప్పాలి. ఇంతలో మగతలో ఉన్న ఉపాధ్యాయుని కన్నులు తెరుచుకున్నాయి. ఆతడు హరిని గుర్తించాడు. మామూలు ధోరణిలో ఉభయులు యోగక్షేమాలు తెలుసుకున్నారు. హరి ఆ ఉదయం ఆ నగరానికి వచ్చి తనకు పరిచితమైన ఒక వ్యక్తి ఇంట్లో బస చేసినట్లు ఉపాధ్యాయునితో చెప్పాడు. తనకు వసతి నిచ్చినతడు ఆ విద్యశాలలో కాంపౌండరని చెప్పాడు. హరి రాకను విన్న సరసిజ ఆ మధ్యాహ్నం తన డ్యూటీ అయినాక కాంపౌండరింటివద్ద తన్ను కలుసుకున్నట్లు చెప్పాడు. ఇంతలో సరసిజ అక్కడకు రానే వచ్చింది. తన్మయాశ్చర్యాలతో, మెలిగొన్న చూపులతో ఆమె రాజీవ్‌ను చూచింది. చక్షుప్రీతి మొదలయిన మన్మథావస్థలకు నిర్వేదాది సంచార భావాలకు, ఇంకా ఎన్నెన్ని భావాల కామె మనస్సు లక్ష్యమై శరీరంలో వానివల్ల తన్మయ పారవశ్య తాదాత్మ్యాదులను పొందింది. కాళిదాసు చెప్పిన 'జాని కానివ చకార లజ్జయా, అనే అంశానికి తన్ను మ లక్ష్యం గావించుకున్నదని రాజీవ్ తలంచాడు. యౌవనారంభ దశను దాటియున ఆమె శరీరం రంగు గుర్తించదగిన పూర్వులను గ్రహించిన రాజీవ్ చిరకాలం ఏకాంత జీవితాన్ని గడుపుతున్న సరసిజ విషయంలో మనస్సు ద్రవీభవించినట్లుంది.

హరి కాతిధ్యం ఇచ్చిన కాంపౌండరు అక్కడికి వచ్చి, తనింతకు ముందు చూడకున్నప్పటికి, వివిధ ప్రసంగాలవల్ల, హరి చెప్పిన మాటలవల్ల పరిచితుడయిన రాజీవ్‌ను గూడ తన యింటి కాహ్వానించాడు. మిత్ర సమ్మేళనం శుభప్రదం కావాలని ఉపాధ్యాయుడు ఆశిస్తున్నాడు. ఇంతలో సరసిజ తన నివాసానికి హరి, రాజీవ్ లా కాంపౌండరుతో పాటు వారింటికి బయలుదేరారు.

ఆ యింటిలో చిర మిత్రులకు విందు ఘనంగా ఏర్పాటయినది. విందారగించిన యనంతరం ఆ కాంపౌండరు సరసిజను, ఆమె శీలసంపదను, వృత్తితో బాధ్యతను, నైపుణ్యాన్ని ఎంతగానో వివరించాడు. చిన్నతనం నుంచి రాజీవ్ - హరి అనే వారి మైత్రి హరి మూలంగా సరసిజకు రాజీవ్‌తో గలిగిన పరిచయం వేర్వేరు దృక్కోణాల్నుంచీ సవివరంగా చెప్పాడు. సరసిజ మనసులో రాజీవ్‌కు స్థానం ఏర్పడిందనే అంశాన్ని వాచ్యం గావించలేదు. గాని సూచ్యార్థ సూచనాత్మకంగా చెప్పాడు. అంతగా అతని మాటలను నడుమ నడుమ హరి చేసిన వ్యాఖ్యానాలను వింటున్నాడే గాని రాజీవ్ పెదవి కదలించలేదు. ఆతను బయలుదేరేటప్పుడు రాజీవ్ వివాహాన్ని బ్రహ్మాండంగా జరిపించాలని తన తల్లి అన్న మాటలాతని మనస్సులో ప్రతిధ్వనిస్తూ వున్నాయి. మౌనం అంగీకారమనుకుంటున్నామని కాంపౌండరు ఒక విసురు విసిరాడు. ఈ మాటలకు రాజీవ్‌లో కొంత స్పందన గనిపించింది. దాన్ని అతనికి గలిగిన అంగీకారంగా వారిరువురు తలంచారు. అర్థాంగీకారమని రాజీవ్ భయపడుతున్నాడేమో నని హరి చమత్కరించాడు. నీవన్నట్లు అర్థాంగి కారమయితే భర్త ఉప్పు గావాలి. అలా అయితే వైవాహిక జీవితం సక్రమంగా సాగుతుంది. లేకుంటే ఇబ్బందులను ఎదుర్కోవాలి. వివాహమంటే ఇద్దరు నూతన వ్యక్తుల నడుమ సర్దుబాటు. ఇరు వర్గాలకు చెందిన ఆత్మీయులు, ఆప్తులు ముఖ్యంగా వధూవరుల తల్లిదండ్రులు గూడ ఆదరించవలసి ఉంటుంది.

కాంపౌండరు చొరవ తీసుకుని రేపు ఉదయం ఎనిమిది గంటలకు హాస్పిటలులో ఉపాధ్యాయుని పడక ముందు రాజీవ్ సరసిజలకు దండల పెళ్ళి గావింతమన్నపుడు హరి "మా నాన్న సరసిజ వివాహాన్ని వైభవంగా జరిపించాలనుకొంటున్న సంగతిని గూర్చి ప్రసంగించాడు. మీ కందరికి ఆప్తుడయిన ఉపాధ్యాయుని ఎదుట దండలను మార్చుకున్నాక వారికి శాస్త్రీయ పద్ధతిలో వివాహం

జరిపించవచ్చును అని తుది నిర్ణయానికి వారంతా వచ్చారు. రాజీవ్‌కు భారతీయ సంస్కృతిపైన, సంప్రదాయాలపైన మమకారం ఎక్కువ. కాళిదాసు చెప్పినట్లుగా 'ప్రజాయై గృహమేధినాం' అనే అంశాన్ని ఆచరణలో పెడితే అని హరి అనగా, ఈ నాడా యంశం సమాజానికి ద్రోహమవుతుందని నవ్వుతూ రాజీవ్ అన్నాడు. ఈ మాటతో రాజీవ్ స్పందించి ముందున్న దాన్నంతా ఆచరణలో పెట్టాలని నా తలంపు గాదు. ఆ నాటి సంఘంలో మనకు ఏయే అంశాలు రుచిస్తాయో, అనుకూలిస్తాయో వాటిని మాత్రమే ఆచరించటం నా యభిమతం. క్రొత్త పాతల మేలు కలయిక నా ధ్యేయం అంటాడు. ఈ మాటను నేటి కవి అయిన గురజాడ పలికాడని కొందరొండ రనగా, ఈ యర్థాన్నిచ్చే సూక్తిని 'పురాణ మిత్యేవ నన సాధు స్వరం....సన్త పరీక్ష్యాన్యతరత్ భజంతే' అనే విధంగా మహాకవి కాళిదాసు ప్రయోగించి ఉండటాన్ని వివరణాత్మకంగా రాజీవ్ చెప్పాడు.

మరునా డుదయం తలంచిన రీతిని దండల పెళ్ళి జరిగింది. ఈ సన్నివేశం అందరికీ ఆనంద సంధాయక మయినది. శిష్యుల అభ్యున్నతి కళ్ళార జూచిన ఉపాధ్యాయుని ఆనందం అతి వేల మైనది. 'తనోమము స్త్రతనక్తై టభ ద్విషస్తవో ధనాఖ్యాగ మీనంభూముదం.' అన్నట్లుగ తన శరీరంలో ఇమడని ఆనందాన్ని పొందిన ఉపాధ్యాయుని శరీరంలో ప్రాణవాయువుకు తావు దొరకనందున అవి కాస్త ఆనందమయ లోకాలకు తరలిపోయినవి. సుఖదుఃఖాలను నిందాక్షేపణలను పట్టించుకోని ఆనందమయ లోకాలకు ఉపాధ్యాయు డింతకు చేరుకుని ఉంటాడు.

శాస్త్రిగారు మరణించినట్లు సువ్యక్తమయినా వారిలోనే కొందరికి కొంత ఆశ లోలోపల ఉందనే చెప్పాలి. సరసిజకు శాస్త్రిగారి మృతి స్పష్టంగా తెలుసు, కాని అలా అని తా నీ యంశాన్ని ప్రకటితం చేయరాదు. అలా అని వాస్తవాన్ని వివరించకుండా ఉంచటం ఆ వైద్యశాలలోని నియమం. దానికి నిర్దిష్టమైన శాఖ ఒకటుంది. వారి కిలాంటి అంశాలను తెలుపటం వారి వారి బాధ్యత. తర్వాత సావధానంగా ఆ శాఖవారు తగిన పరికరాలతో మానవ వనరులతో వస్తారు. అనంతరం రోగిని పరీక్షించి, మృతుడని అధికారికంగా ప్రకటిస్తారు. అలా ప్రకటించినంతనే ఆ రోగికి మూడువైపుల వస్త్రంతో నిర్మించిన తెరలను నిలుపుతారు. నాలుగోవైపు గోడ ఉండనే ఉంటుంది, గోడకు ఉంటే కిటికీ తలుపులను మూస్తారు. ఆ తెరలో క్రైస్తవ గురువు మాత్రం ప్రవేశించి చనిపోయిన వ్యక్తి ఆత్మకు శాంతిని

గోరుతూ ప్రార్థనలు చేస్తాడు. ఆ తరువాత ఆ మృతకాయాన్ని కోల్డురూముకు తీసుకొనిపోతారు. ఆ తరువాత మృతిని బంధువులు శవాన్ని అధికారికంగా స్పృశింపవచ్చును. తన వివాహముహూర్తంతో శాస్త్రిగారి అంతిమ ఘడియలు ముడిపడి ఉండటాన్ని రాజీవ్ ఊహించలేదు. ఈ విషాద సంఘటనము తప్పించ టానికి తానా జన్మాంతము బ్రహ్మచారిగ ఉన్నా బాగుండునని, తనలో తాను తలంచుచున్నాడు రాజీవ్. ఇంతలో హరి కలుగజేసుకొని రాజీవ్ వెన్ను తట్టి ఈ లోకంలోకి అతని మనస్సును మరల్చే ప్రయత్నం చేస్తూ —

హరి : శరీరధారులకు మరణం అతిసహజం, అనుల్లంఘనీయము (మరణం ప్రకృతిః శరీరిణాం వికృతిర్జీవితము చ్యతే బుధైః) మొదలైన మహా కవి వాక్యాలను నేను నీకు ప్రత్యేకించి చెప్పనవసరం లేదనుకుంటా. ప్రాణికోటి అవ్యక్తాదని భూతాని. అది మన కేమాత్రజ (జన్మకు మునుపు) తెలియదు. మరణానంతరం ప్రాణి ఎక్కడకు పోతుందో తెలియరాదు. జననానంతరం మరణానికి మునుపు ప్రాణిని మనం గుర్తించటం, మన, తన అనే ఆప్యాయతతో చూసుకోవటం జరుగు తుందని శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన (అవ్యక్తాదీ విభూతాని వ్యక్త మధ్యాని భారత, అవ్యక్త నిధనాన్యేవనాత్రతపరిదేవనా) అనే గీతా శ్లోక సారాన్ని విడమర్చి చెప్పాడు.

వివాహమయినంతనే తన్ను వరించిన రాజీవ్‌కు గురు వియోగాత్మకంగా ప్రాప్తించిన ప్రగాఢమైన సంతాపాన్ని తనదిగా భావించి, సరసిజ లోలోన మిక్కిలి కుమిలిపోతుంది. తన పతి మనోగతాన్ని అవగతం చేసుకునే శక్తి కలిగి ఉండటం, సత్వం, దానివల్ల గలిగే భావపరంపరకు (స్వాతిక భావాలకు) సరసిజ లక్ష్యగాకుండ ఉండటం కష్టంగా ఉంది. గురు వియోగాత్మకమైన సంతాపం యొక్క తాకిడికి ఆమె శరీరం కొయ్యబారినట్లనిపిస్తుంది (స్తంభము). వివాహము వలన ఆమెకు గలిగిన యానందము వెంటనే, మితిమీరిన శోకానుభవము. సరసిజ జ్ఞానేంద్రియాలను అన్నింటిని మొద్దుపారినట్లు చేస్తూ వచ్చినందువల్ల ఆమె ఎదుటి వారిని సరిగ చూడలేక, వారి మాటలను వినలేక ఉన్నట్లు హరికి తోచింది. వెంటనే ఈ సతీపతులను (సరసిజ, రాజీవ్‌లను) కర్తవ్యం వైపు ఉన్ముఖులను

గావించాలని, అలా అయితే [కర్తవ్యానిఖిలు దుఃఖితైః దుఃఖ నిర్వాపణాని] గాని వారిరువురు ఈ శోకసాగరం నుంచి వెలికి రాలేరని గ్రహించాడు. వెంటనే రాజీవ్‌ను తన వైపు మరల్చుకొని చెవిలో ఈ విధంగా చెప్పాడు.

హరి : శరీరాన్ని మంచం నుంచి క్రిందికి చేర్చినంతనే మృతుని శిరసు ప్రక్కన దీపాన్ని వెలిగించటం మన సంప్రదాయం. దాన్ని మన మింతవరకు నిర్వర్తించకుండ ఉండటం సరిగాలేదు.

రాజీవ్ : ఔను. నిజమేగాని అలా దీపాన్ని ఆరాధనాత్మకంగా వెలిగించే హక్కు మృతుని యాత్మీయులకు మాత్రమే మనవా రున్నట్లు చెబుతుంటారు.

హరి : నిజమే మృతుడు పెద్దవాడయితే కొడలు ఈ పనిని నిర్వర్తించదగును.

రాజీవ్ : మరి అలాంటివా రింకా ఇక్కడకు రాలేదు కదా.

[ఇంతలో శాస్త్రిగారి తనయు డక్కడకు చేరుకున్నాడు. వీరాతని కా సమస్యను వివరంగా చెప్పారు. తన భార్య రావటానికి కింకా వ్యవధి పడుతుందని, మరల తను వచ్చిన బస్సు తిరిగి పోయి వస్తేగాని ఆమె రాగలదని, అంటే కనీసం ఆరు గంటల వ్యవధి గావాలన్నాడు. అంతే గాక, నా కీయన జన్మనిచ్చిన తండ్రి (రాజీవ్‌ను చూస్తూ) నీకు విద్యాబోధనవల్ల తండ్రి అయినాడు అన్నాడు ]

హరి : మన ప్రాచీనుల సంప్రదాయంలో జన్య జనక సంబంధాలు ద్వివిధలుగ గుర్తించబడినాయి. మొదటి విద్యాసంబంధం, రెండోది రక్త (యోని) సంబంధం. విద్యా సంబంధానికే మన వారధిక ప్రాధాన్యాన్నిచ్చారు. [ఈ యంశంలో పాణిని సూత్రాన్ని సోదాహరణం (విద్యాయోనసంబంధేభ్యోవుఞ్ 4.3.77, ఔపాధ్యాయికః పైతామహకః)గా వివరించి రాజీవ్‌ను విషాదయోగం నుంచి కర్తవ్యయోగానికి మరల్చ ప్రయత్నించాడు.]

[హరి తలంచినట్లుగా రాజీవ్ మనస్సు ప్రస్తుత కర్తవ్యం వైపు మరలింది.]

రాజీవ్ : అయితే నా కీ బాధ్యతను మీరప్పగిస్తారా,

శాస్త్రిగారి కొడుకు: తప్పకుండ. నిండుమనసుతో

(ఈ మాటన్న తరువాత కొంత సేపటికి, దీపానికి కావలసిన వస్తు సముదాయాన్ని హరి అక్కడకు తెప్పించాడు. రాజీవ్ తన భార్యతో శాస్త్రీగారి శిరస్సు దగ్గర దీపాన్ని వెలిగింప నియోగించాడు. ఆతడు యిల్లాలి నుంచి మొట్టమొదటి సారిగా పనిగొనుట ధర్మకార్య నిర్వహణకు సంబంధించినది)

తల దగ్గర వెలుగుతున్న దీపం (ఉదరము నుంచి తొలగించిన) కౌస్తుభంగా దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది. మంచుగడ్డలపై పరుండియున్న శాస్త్రిగారి శరీరం పాల తరగల నురుగుపై పవ్వళించిన వటపత్రశాయిని తలపింపజేస్తుంది. తర్వాత ఉపాధ్యాయుని అంత్యేష్టి యథాశాస్త్రంగా జరిగిపోయింది.

దశాహస్సు ద్వాదశాహస్సు సక్రమంగా ముగిశాయి. అప్పటికి పదిరోజుల నుండి విశ్వేశ్వయ్యగారి యిల్లు కళకళ లాడుతుంది. కొడుకుతోపాటు కోడలు ఆ ఇంట్లో తిరుగుతుంటే చూడ ముచ్చటగా వుంది. రాజీవ తల్లి మాత్రం దండల పెండ్లి కంతగా సంతసించలేదు. ఇంతకాలంగా తాను ఎన్నో వివాహాలకు పోయి వచ్చింది. ఎన్నో మంచి పెద్దలను చూస్తుంది. కాని తన యింట యింత వరకు ఒక్క శుభకార్యమైన జరగకపోవటం ఆమెకు లోలోపల బాధాజనకంగా ఉంది. తన సుతుడు దండల పెళ్ళితో వివాహ సంస్కారాన్ని ముగించుకురావటం ఆమెకు నచ్చలేదు. అంతేగాక, ఆమెకు పరిచితులయిన వ్యక్తులు అప్తులు మరల ఘనంగా శుభలగ్నంలో పెండ్లి జరిపించవలసిందిగా శాసించారు. అంతేగాక అలా మూడుముళ్ళ తంతు ముగిసేవరకు, వధూవరులను కనిపెట్టుకోవల్సిన బాధ్యత రాజీవ్ తల్లిదేనని నొక్కి నొక్కి చెప్పారు. ఈ పది దినాల్లో ఈ వార్త ఊరూ వాడా పొక్కిపోయింది, ఎవరు అడగకపోయినా, ఈ దండల పెళ్ళిని గూర్చి ఆడ, మగా తేడాగానీ, వయస్సులో అంతరాలుగానీ లేకుండ అందరు తమ తమ అభిప్రాయాలను ప్రకటించారు. హేళనాత్మకంగా, అయోధ్యా నగరిలోని చాకలివాడు సీతను గూర్చి అన్న మాటల నుంచీ, పరమ పతివ్రతయైన అరుంధతి సీతను గూర్చి పలికిన (గుణాః పూజాస్థానం) ఇత్యాది మాటల వరకు, విభిన్న వర్గీయులకు చెందిన మాటలను ప్రయోగిస్తున్నారు.

విమర్శనా బాణాలన్నీ సరసిజ పైకే కేంద్రీకృతాలయినాయి. క్రైస్తవుల ఆసుపత్రిలో సరసిజ ఒంటరిగా ఉద్యోగం చేయటాన్ని గూర్చి కొందరు 'లంకా నగరంలోని అశోక వనంలో రాక్షసుల నడుమ నివసించిన సీత శీలాన్ని లాగా

కించారు. ఈ వార్తలు కొంతకు కొంత రాజీవ్ చెవికి సోకక పోలేదు. ఇది
త్రేతాయుగం కానందున తాను ప్రజారంజన తత్పరుడయిన మహారాజు గాకుండుట
వలన మిన్నకున్నాడేగాని లేకుంటే, అగ్ని ప్రవేశం వంటి పరీక్షను సరసిజకు
విధించే వాడేనని, ఆ విషయంలో వచ్చి అపవాదులు విన్న వారికనిపించింది.
విశ్వేశ్వరయ్యగారు తన ఏకైక తనయునకు అన్ని విధాల తగిన వధువుతో
వివాహం జరిగినందుకు మిక్కిలి సంతసిస్తున్నాడు. అయినా లోకం కోసం సరసిజ
వివాహాన్ని తానే స్వయంగా; తన నివాస నగరంలోనే వైభవోపేతంగా చేయా
లని తలుస్తున్నాడు. ఈ నడుమ విశ్వేశ్వరయ్య గారికి వైద్య వృత్తిలో పని మరీ
పెరిగిపోయింది. ఇంతకు మును పెంత కాలంగానో అపరిష్కృతంగా ఉన్న
కొన్ని వ్యాధులకు, మానసికమయిన అశాంతి, భయాందోళనలు కారణమై ఉండ
వచ్చునని, తాను తలంచినా తనకా విద్యయందు ప్రవేశము లేనందున కొందరు
శివుల వ్యాధులు బహు వత్సరాత్మకంబయిన కాలం, అపరిష్కృతంగా ఉండి
పోయాయి. ఈ విధమైన దీర్ఘ వ్యాధులతో సతమతమవుతున్న శిశువుల తల్లి,
దండ్రులకు, నేడు తరుణోపాయం లభించింది. అలాంటి వ్యాధులతో చిక్కి
శల్యం అయిన శిశువుల స్థితిగతులను చూసి, ఆ వ్యాధి నివారణలో ప్రత్యేక పరి
శ్రమ చేసిన సరసిజ పరీక్ష చేయటం జరుగుతుంది. ఆ తరువాత ఇరుమిద్దం గా
లిసినందున చికిత్స చేయటంవల్ల మరీ పేరు ప్రఖ్యాతిని, రోగుల తల్లిదండ్రుల
మన్ననలను ఇతోధికంగా పొందుతున్నాడు. సరసిజ రాకతో విశ్వేశ్వరయ్యకు
తీరిక మరీ తక్కువయి పోయింది. మొత్తానికి (సమాన శీలవ్య సనేషు). ఒకే
వృత్తివారైన మామ, కోడలు, దగ్గరివారై పోతున్నారని రాజీవ్ సరసిజతో
నవ్వుతూ అంటుండటాన్ని రాజీవ్ తల్లి విని, తనలో తాను మురుసుకొంటుండేది.
కులాతీత మయినా తన కొడుక్కు నచ్చిన వధువు లభించినందుకు రాజీవ్ తల్లి
మిక్కిలి సంతసించింది.

విశ్వేశ్వరయ్య తనకు తీరిక లేనందున చంద్రాయుని సాయంతో వివా
హానికి తగిన ఏర్పాట్లను చేయిస్తున్నాడు. ముహూర్తం దగ్గర పడుతుంది. చంద్రా
యునికి తీరిక లేని పని. ఇంక రెండు వారాలకు లగ్నము అనగా ఓ రోజు
సరసిజ తండ్రి, విశ్వేశ్వరయ్య గారింటికి వచ్చాడు. సరసిజ తండ్రితో ఎంతో
సౌహార్ధ్యంగా మాట్లాడింది. దండల పెళ్ళి అనుకోకుండా, జరిగిపోయినందువల్ల

తను ఈ వార్త వారికి అందించలేదనీ అనంతరం నేనిక్కడకు రావటం అనివార్యం అయ్యిందని చెప్పి తన తప్పిద మిందులో ఏమైనా ఉంటే, మన్నించమని ప్రార్థించింది. కూతురుని తండ్రి హృదయ పూర్వకంగా అభినందించాడు. ఇంతలో భోజనానంతరం విశ్రాంతి తీసుకొని, సాయంకాలం తేనీరు సేవిస్తున్న విశ్వేశ్వరయ్యగారితో సరసిజ తండ్రి ఈ విధంగా ప్రసంగం ప్రారంభించాడు.

సరసి. తండ్రి: బావగారూ సరసిజ పెండ్లిని మా గ్రామంలో మా గృహంలో జరిపించాలని మా అందరి తలంపు.

విశ్వేశ్వరయ్య: తప్పకుండా అంతకన్నా కావల్సిందేముంది.

సరసి. తండ్రి: మమ్ములను అన్ని ఏర్పాట్లు చేసుకోమంటారా.

విశ్వేశ్వరయ్య: అవశ్యం, మీ ఏర్పాట్లు లేకుండా మమ్ము పిలిపించి వియ్యాలవారిని ఎగతాళి పట్టించాలనా

సరసి. తండ్రి: ఎంత మాట, ఎంత మాట

విశ్వేశ్వరయ్య: ఇంతకీ ఏనాడు శుభముహూర్తం.

సరసి. తండ్రి: మిమ్మల్నడగకుండా ఎలాగండీ నిర్ణయం తీసుకుంటాం. అది సరే - అదిసరే.

విశ్వేశ్వరయ్య: నీ సందేహం ఏంటో చెప్పండి, నాకు అవతల పని ఉంది. త్వరగా వెళ్ళాలి. రోగులు వచ్చే వేళయ్యింది.

రా. తల్లి : అన్నయ్యగారు, ఇదండి వరుస. పెండ్లితరుణంలో కూడ మీ బావగారికి రోగుల గూర్చిన ఆలోచనే.

సరసి. తండ్రి: ఇక్కడే మీరు ప్రయత్నాలు....

విశ్వేశ్వరయ్య: చేస్తున్నట్లు విన్నానంటావు. అంతేనా

సరసి. తండ్రి: ఆ! అదేనండీ బావగారు నా సందేహం.

విశ్వేశ్వరయ్య: ఈ ప్రయత్నాలు మా తనయుని పెండ్లిని గూర్చి మీ పుత్రికకు మీరు పెండ్లి చేయటంలో ఆక్షేపణ ఏముంటుంది.

సరసి. తండ్రి: మీరు వింతగా మాట్లాడుతున్నారు. సరసిజ అంటే మా అమ్మాయికి రాజీవ్ అంటే మీ అబ్బాయికి పెండ్లి గదండీ, వేర్వేరుగా జరుగుతాయంటండీ.

విశ్వేశ్వరయ్య: మా అబ్బాయి ఒక వధువునందు ఆసక్తుడయినాడు. వారిరువురు మా యింటే ఉన్నారు. వారికింతకు ముందే దండల పెండ్లి జరిగింది. మేము దాన్నే మరల లాంఛనప్రాయంగా జరిపించాలనుకుంటున్నాము.

సరసి. తండ్రి: మా ఇంటనే ఈ శుభకార్యాన్ని జరిపించి కన్యాదానం గావించి సంతృప్తి పొందాలని నా కోరిక.

విశ్వేశ్వరయ్య: పరిణీతను దానం చెయ్యటం సంప్రదాయ సమ్మతం గాదు గదండీ, అని నవ్వుతాడు.

సరసి. తండ్రి: మీరు తలపెట్టిన వివాహానికి ఖర్చుగానే తోచిన మొత్తాన్ని సమర్పించుకుంటున్నా అని సంచిలో నుండి ఒక కట్టను తీసి విశ్వేశ్వరయ్య కిస్తాడు. దాన్ని విశ్వేశ్వరయ్య తీసుకోకుండ

విశ్వేశ్వరయ్య: మేం జరిపించే వివాహం మా ఖర్చుతోనే జరుగుతుంది, అంటూ అక్కడి నుంచి తన వైద్యశాల ఉన్న గదికి పోయాడు.

సరసి. తండ్రి: చెల్లెమ్మా. ఈ డబ్బును నీవు తీసుకో అమ్మా అని ఆమె చేతికిచ్చాడు.

తల్లి: ఆ ధనాన్ని తీసుకుందామె.

ఇంతలో చంద్రాయుడు అక్కడకు వచ్చి మేళ తాళాల వాళ్ళు ముందుగా యానా గావాలంటున్నారండీ. మనం తలపెట్టిన లగ్నం నాడింకా చాల లగ్నాలున్నాయట. అందువల్ల మేళాలకు గిరాకీగా ఉంది. తక్కినవన్నీ దొరికాయి. ంటవాళ్ళు మనం కోరుకున్న వాళ్ళే దొరికారని చెబుతుండగా రా. తల్లి, కలుగ సుకొని ఈ విషయం డాక్టరుగారికి చెప్పమని చంద్రాయుణ్ణి పురమాయిస్తుంది. ధూవరులకు బహూకరింప దలచిన సువర్ణాభరణాలకు ఆర్డరియ్యాలని వ్యవధి నందున తొందర పడవలసివస్తుందనీ సరసిజ తండ్రి తన గ్రామానికి బయలు రాడు. రాజీవ్ చేతికి రవ్వల ఉంగరం చేయించాలి అని ఆయన తలంపు. ఆయన లి సైజు తీసుకొని ప్రయాణ మయినాడు

అనుకున్న లగ్నానికి వివాహం విజయవంతంగా జరిగిపోయింది. ఎంతో కాలంగా వేచి ఉన్న వధూవరులు ఇరువురు విద్యావంతులు. ఇరుపక్షాల వారు మూడు తరాల క్రిందటి వరకు వివేకధనులు, విద్యావంతులు మరియు వివిధ సంస్థల్లో ఉద్యోగాలు నిర్వర్తించిన వారు వ్యయం విషయంలో విశ్వేశ్వరయ్య వెనుకాడటం ఎరుగనివాడు. ఆయన చేతికి ఎముక లేదని ఆయన వ్యయం చేస్తున్న తీరునుబట్టి చాలమంది చెప్పుకున్నారు. కన్య అనగా సరసిజ తాను తలచిన వాడినే పతిగా పొందింది. వరుని రూప, సౌందర్యం ఇక్కడ మరల చెప్పనవసరం లేదు. ఈ వివాహ విషయంలో (కన్యావరయతే రూపం) (కన్య అందగాణ్ణి కోరు కుంటుందనే) వైవాహికాంశ సఫలమయినది. కన్య తల్లి వరుని ధనాన్ని (మాతావిత్తం) కన్య తండ్రి వరుని పాండిత్యాన్ని, పాండిత్యాన్ని (పితా శ్రుతం) వధువు బంధువులు వరుని కులీనతను అలాగే వరుని బంధువులు వధువు యొక్క మలీనతను కోరుకుంటారు. (బాంధవాః కుల మిచ్ఛంతి) అనే అంశ ఈ వివాహ సంబంధంలో సార్థకమయినది. ఇతరులయిన జనులు అనగా ఆహ్వానాన్ని కాదనలేక, వుంటున్నా వ్యయానికి ప్రయాసకు ఓర్చి వచ్చేవారు. సంతృప్తి గలిగించే భోజనాన్ని (మృష్టాన్న మితరే జనాః) ఆశిస్తారనే యంశం ఈ వివాహ సందర్భంలో విజయవంతంగా సాగిపోయింది. వివాహానికి వచ్చి విందులో పాల్గొన్న వారందరు పాల్గొనలేనివారికి వారు ఎలాంటి విందును కోల్పోయారో సవివరంగా, చెప్పటం వినబడుతుందంటే ఆ భోజనం ఎంత రుచిగా ఉందో తెలుస్తుంది. ఇందులో వచ్చిన జనులను ఆప్యాయంగా ఆహ్వానించటం, విందు దగ్గర ఎలాంటి తొందరపాటు లేకుండ సర్దుబాటు చేయటం సాగాయి. ఈ విధానం ఇతరత్ర ఎవ్వరూ చూచి ఎరుగరు. ఈ విధంగా విందు భోజనం సంకులతకు తావు లేకుండ సాగటానికి చంద్రాయుడు నిర్వహించిన బాధ్యత అందరి ప్రశంసలను అందుకున్నది. వివాహానంతరం బంధువర్గం ఎక్కడి వారక్కడకు పయనమైపోయారు. మిక్కిలి దగ్గరివారలు సరసిజకు చిన్నతనం నుంచి తెలిసిన యువతులు కొందరున్నారు. వారిలో కొందరు సరసిజ వయసువారు, మరి కొంద రామెకన్నా చిన్నవారు, వారందరు తొలిరేయి నాటి తమ తమ అనుభవాలను కథలుగా చెబుతుంటే సరసిజ విన ఇష్టంలేనట్లున్నా, అన్నీ సావధానంగా వింటుంది.

ఈ వృత్తాంతాలన్నీ తన మనసుకు ఓ విధమైన అశాంతిని కలిగించి నట్లున్నాయి. యౌవన కాలం చాల వరకు నిరీక్షణలోనే గడిచిపోయింది సరసిజకు, తెలిసి, తెలియని వయస్సులో గాకున్నా ఆలోచన సరళి పెరగకముందే ఇలాంటివి జరిగిపోవటం మంచిది. సరసిజ పేరు గాంచిన డాక్టరు. శరీరం లోపల ఉన్న భాగాలన్నీ ఆమెకు తెలుసు. అంతేగాక ఎలాంటి శారీరిక చలనం, లోపల ఏ విధమైన మార్పుకు దారి తీస్తుందో ఆమెకు కరతలామలకము, ఎదుటి వాని మనస్సును, దాని తత్త్వాన్ని గ్రహించగల నేర్పామెకున్నా, సిగ్గువల్ల ఆ విజ్ఞానం ఈ సందర్భంలో అక్కరకు రాదనిపిస్తుం దామెకు. ఎవరు ఎలా తలంచుతున్నా ఎంతగా కాలగమనాన్ని ఆపాలని ప్రయత్నించినా, దాన్ని ఆపటం బ్రహ్మాదుల తరంగాదు. ఇలా తలుస్తుండగానే మొదటి రాత్రి గడిచిపోనూ పోయింది. మరు నాడు ఉదయం సూర్యోదయంగానూ అయ్యింది. ఈ దంపతుల అన్యోన్యానురాగం తల్లిదండ్రులకు సంతృప్తి గలిగిస్తుంది. అపుడపుడు తన ఉపన్యాసాది కార్యక్రమాలకు రాజీవ్ పోతుండేవాడు. ఏకదిన అంతకన్నా తక్కువ కాలవ్యవధిలో ఆతడు తిరిగి వస్తున్నప్పటికీ సరసిజ ఆ తాత్కాలికమైన ఎడబాటును గూడ సహించలేక పోయేది, క్లేశాన్ని పొంచుతుండేది అలా. ప్రవాసానికి పోయి తిరిగి వచ్చిన పతితో సతి అయిన సరజిజ ఒకనాడు ఈ విధంగా చెప్పబూనుకుంది.

సరసిజ : ఏమండీ; మన వయస్సులో బంగారు వంటి ప్రాయవతీతమయి పోయినది. ఇప్పుడు గూడ మీరు, మీ ఉపన్యాస కార్యక్రమాలకు పోతుంటే నాకు ఏదోగా అన్పిస్తుంటండీ నన్ను గూడ మీతోపాటు తీసుకుపోరాదా, అని మెల్లగా అని (దానిని అత డెలా తలుస్తాడోనని మానసిక పరీక్ష చేయ ప్రయత్నించింది) కాని అయన మనస్సులోని లోతు పాతులను గ్రహింప తన పరిజ్ఞానం చాలదని ఇట్టే గ్రహించింది సరసిజ.

రాజీవ్ : తీసుకుపోవాలంటే చాలా సమస్య లెదురవుతాయి సరసిజా. నేను తొందరగానే తిరిగి వస్తున్నాను గదా.

సరసిజ : ఈ ఉపన్యాస కార్యక్రమాన్ని ప్రస్తుతానికి మానివేయరాదా.

రాజీవ్ : ఈ కార్యక్రమాలకు నా అంగీకారాన్ని తెలిపి కొన్ని నెలలు గడిచాయి. ఇప్పుడు అనుకోకుండ మానితే వారు ఇబ్బందులకు గురౌతారు.

సరసిజ : పోనీ ఇపుడు అలాంటి కార్యక్రమాలు వస్తే మీ రంగీకరించకుండ ఉంటే ముందు ముందు (రానున్న నెలల్లో) మీరు ప్రయాణాలు చేయవలసిన అవసరముండదు గదండీ.

రాజీవ్ : నీ సలహా బాగానే ఉంది గాని ఒక్కమాట, ఉపన్యసించటం నా ధర్మం, వైద్యం చేయటం నీ ధర్మం. మన భారతీయులు మానవుడు సాధించవలసిన ప్రయోజనాల్లో (అర్థాల్లో) మొట్టమొదటి స్థానం ధర్మానికిచ్చారు. మనస్సులోని కోర్కెలను పొందటం మనవారి దృష్టిలో మూడోది. అందువల్ల, కామం కోసం ధర్మానికి గ్లాని దవిగింపరాదు, [ధర్మాతి రిక్తంగాని కామం సాక్షాత్తు భగవంతుని అనుమతిని పొందుతుంది. అందుకే గీతలో ధర్మాతరిక్తో కామో! స్మి భరతర్షభ] అని చెప్పబడి ఉంది.

సరసిజ : మీరు చెప్పిన తత్త్వం నాకు సరిగా అర్థం గాదు.

రాజీవ్ : అర్థమయ్యేలా చెబుతా విను.

సరసిజ : వింటున్నాను.

రాజీవ్ : అనగనగా అలకా అని ఒక నగరం ఉంది.

సరసిజ : కుబేరుని నివాస నగరం గదా అండీ.

రాజీవ్ : ఔను. ఆ నగరానికే గాక ఆ ప్రాంతాని కంతా ఆయనే అధికారి.

సరసిజ : దిక్పతి గదా.

రాజీవ్ : ఆయన అధికారం చెల్లుబడి అయ్యే ఓ కార్యాలయం ఉంది. అందులో ఉద్యోగస్తులు చాలమంది ఉండేవారు. వారందరు వేళ తప్పకుండ కార్యాలయమునకు వచ్చి అక్కడ తమ, తమ విధి నిర్వహణలో ఏమాత్రం జాప్యం కాకుండ పనులను కొనసాగించి, మరల సాయం కాలానికి తమ తమ నివాసాలకు చేరుకుంటారు. అన్ని పనులు కాల యాపన లేకుండా ఆ కార్యాలయంలో సాగి పోతుంటాయి.

సరసిజ : అంటే ఇపుడు అభ్యున్నతిగన్న దేశాలిందువలె అక్కడి వారందరు స్వకార్య నిర్వహణంలో వ్యగ్రత గలిగి త్రికరణ శుద్ధిగ తమ పన్లను నిర్వహించే వారన్న మాట.

రాజీవ్ : సరిగా గ్రహించావు. ఆ కార్యాలయానికి ఒకనాడు ఒక ఉద్యోగి కొద్ది ఆలస్యంగా రావటాన్ని కుబేరుడు గమనించాడు.

ఆతడు తన కార్యనిర్వహణలలో జాప్యానికి కారణం భార్యా వ్యామోహంలో పడటమని, ఈతడు మొన్న మొన్ననే గృహస్థాశ్రమ స్వీకారం చేశాడనీ, అలాంటివాని అలసతను వెంటనే తొలగించాలనీ తలంచిన కుబేరుడు ఆ ఉద్యోగికి ఒక సంవత్సరం పాటు ప్రవాసాన్ని శిక్షగా విధించాడు.

సరసిజ : ప్రావాసమంటే భార్యకు దూరంగా నివసించటమా,

రాజీవ్ : ఔను.

సరసిజ : ఈ విధమైన శిక్షవలన ప్రయోజనం ఏం గలుగుతుందండీ.

రాజీవ్ : ఈ ప్రవాసంవల్ల ఆలుమగ లిరువురూ బాధపడతారు. ఈ బాధ మరువరాని దవుతుంది. ఈ గుణపాఠం మరొకమారు విధి నిర్వహణలో జాప్యానికి కారణమయ్యే చర్య కా ఉద్యోగి తన దిన చర్యలో తావీయడు. ఒకవేళ ఏనాడైనా అలాంటివానికి ఆస్కారం వస్తుందని ఆయన భార్య తలంపుకు వస్తే ఆ చర్యను సర్దుబాటు చేసి తానే భర్తను కాలాతీతం గాకుండ విధి నిర్వహణకు పోవటానికి తోడ్పడుతుంది.

సరసిజ : ఇలాంటి శిక్ష నాకు విధింపబడకుండును గాక.

రాజీవ్ : నాకు ఈ శిక్ష విహితం గావాలని నీ తలంపా.

సరసిజ : నాకు విధించినా శిక్ష మీకు విధించినా మనిద్దరం తుల్యంగానే బాధపడవలసి వస్తుందనే విషయం నీకు తెలియనా. అని కిల కిల నవ్వింది.

రాజీవ్ : నీవు గ్రహించిన ఈ వాస్తవాన్ని నేనెందుకో గ్రహించలేక పోయాను. ఇలాంటి విషయాల్లో నీ కున్నంత వివేకం నాకు లేదు.

సరసిజ : ఏమీలేని దాని నుండి ఎంతో హేతుబద్ధంగా నిర్ణయం గావించుకునే మీకు సీ విషయాలలో ఈ విధంగా అంతర్దృష్టి లేకపోవటం వింతగా ఉంది.

రాజీవ్ : నా ఊహకు కాళిదాసుని కృత మేఘ సందేశంలోని తొలి పద్యం మూలం.

సరసిజ : కళ్ళుత్కంఠా ... అనే ఆ పద్యం నాకూ వచ్చుగాని నేను దాన్నుంచి ఇంత విశేషార్థాన్ని ఊహించలేక పోయాను.

రాజీవ్ : కావ్యాన్ని చదవటం ఒక ఎత్తు. అను శీలనం గావించటం మరో ఎత్తు. ద్వితీయ దశకు చేరుకున్న వారికి ఈవిధంగా విశేషార్థాలు స్ఫురిస్తాయి. నేను చెప్పిన ఈ మర్గం హేతుబద్ధంగా లేదా.

సరసిజ : లేకేం ఉంది. కాని నన్ను గూర్చి నీ వెపుడైన ఇంత కాలంలో ఒక నాడైన ఈవిధంగా ఆలోచించావా.

రాజీవ్ : లేదనే చెప్పాలి.

సరసిజ : ఎందుకని

రాజీవ్ : పురుషార్థాల్లో 'కామం మూడోది'. ముందుగా ధర్మాన్ని గూర్చి ఆలోచించాలి గదా.

సరసిజ : నీయందర్పిత భావంతో ఉన్న వ్యక్తి నా దృష్టితో గాకున్నా దయార్ద్ర దృష్టితో తలంచటం, నీ కవీన ధర్మం గదా.

రాజీవ్ : నీవనే ధర్మం వేరు, పురుషార్థంలో మొదటి స్థానానలంకరించిన ధర్మం వేరు.

సరసిజ : రెండూ నాకు అభిన్నంగానే అనిపిస్తాయి.

రాజీవ్ : అధర్మం పెరిగి ధర్మం పతనమైనపుడు తన్ను తాను సృష్టించుకుంటానని శ్రీకృష్ణపరమాత్మ గీతలో చేసిన ప్రబోధంలో గల 'ధర్మం' అనే దాన్ని దృష్టిలో ఉంచుకుని నేను మాట్లాడుతున్నాను.

సరసిజ : ఇంతకాలంగా నీవు ఉద్ధరించిన ధర్మమేది. ఏ యధర్మానికి నీ యీ ప్రయత్నం భంజకమయినది.

రాజీవ్ : అభ్యుదయాన్నధిగమించిన దేశాలవారు, వృద్ధిచెందుతున్న దేశాలవారూ భారతదేశంపై గౌరవభావం గలిగి ఉండటం నీకు తెలియని విషయం గాదు. ఎన్నో తరాలుగా సంస్కృతంలో బహు గ్రంథాలను వ్రాసి అందులో మన సంస్కృతిని ప్రతిబింబింప జేశారు మనవారు. ఈ నాడీ సంస్కృతిని తెలుసుకునే దృష్టి సన్నగిల్లిపోతుంది. అసలు సంస్కృత వాఙ్మయాధ్యయనం దిన, దినం క్షీణిస్తుంది. నా ప్రసంగాల

వల్ల సంస్కృతంలో ఘనతను లోకులకు తెలియజేయ నే నింతకాలం ప్రయత్నించాను. నా యీ ప్రయత్నం ధర్మాన్ని ఉద్ధరించలేక పోయినా కొందరి మనసులకు ఆలోచన గలిగించింది. ఈ విధంగా నేను కొంత విజయాన్ని సాధించాననే తలుస్తున్నాను.

సరసిజ : చంద్రాయుడులో గలిగిన మార్పు నీ విజయానికి సంకేతంగా తలంప వచ్చుననుకుంటా.

రాజీవ్ : నే నలా అనుకోవటం లేదు. నే నా మనసు కందించిన దంతగా లేకున్నా సహజంగా ఆయనకు గల సహృదయత, సహన శీలత ఆయన మనస్సును నావైపుకు మరల్చిందని నా కన్పిస్తుంది.

సరసిజ : మేఘసందేశంలోని మొదటి పద్యంలో అంశాన్ని నీ వింతగా వివరిం చావే. దాని కాధారం ఏముంది.

రాజీవ్ : దాని కాధారం చాలా ఉంది. వాస్తవం చెప్పాలంటే దాన్నుంచే నే నీ పద్యాల నీ్నవిధంగా వివరించగలిగాను.

సరసిజ : (జిజ్ఞాసతో) ఏమిటది.

రాజీవ్ : గుప్తుల కాలాన్ని స్వర్ణయుగంగా చరిత్రకారులు పేర్కొన్నట్లు మనం సాంఘికశాస్త్రంలో చదువుకున్నాం. ఆ విషయం నీకు గుర్తుందా.

సరసిజ : గుర్తుంది గాని, దానికీ మేఘసందేశ కావ్యానికీ పొత్తు ఎలాగండీ.

రాజీవ్ : కాళిదాసు గుప్తుల కాలంనాడు అతడు తన స్వతంత్ర కావ్యమైన మేఘ సందేశంలో తన నాటి సంఘాన్ని గూర్చి సూచనాప్రాయంగా చెప్పాడు. నాటి పెద్ద పెద్ద (బాధ్యత గల) పదవుల నలంకరించిన వారందరూ కుబేరునిలాంటి వారు. తన క్రింది ఉద్యోగు లెలాంటి చిన్న అశ్రద్ధ చేసినా క్షమించటం ఎరుగరు. తగిన శిక్ష విధించేవారు. వారు విధించే శిక్ష చేసిన తప్పు మరల వారి ఉద్యోగ కాలంలో చేయ కుండ ఉండేటట్లు, కీలెరిగి వాత పెట్టినట్లుగా విధిస్తారు. యక్షునకు మమకారాన్ని తొలగించే ప్రవాసాన్ని విధించాడు. ఇలాంటి జీవిత విధానానికి వారలవాటు పడియున్నందున రాజ్యం, మూడు పువ్వు లారు కాయలుగా విలసిల్లింది, ప్రజలు సిరి, సంపదలతో తులతూగారు,

అందుకే ఆ కాలాన్ని స్వర్ణయుగ మన్నారు. ఆ స్వర్ణయుగానికి చెందిన కవియైనందున కాళిదాసు ఏ విధమైన అలజడి, కలతలకు గురిగాక ప్రశాంతచిత్తంతో ప్రసన్న దృష్టితో సంఘంలోని వారి అభిరుచి ననుసరించి ఉత్తమ కావ్యాలను రాయగలిగాడు.

సరసిజ : మీ పరిశీలన సునిశితమూ హేతువాద సహితమూను.

రాజీవ్ : నేను వాఙ్మయం మూలాన ఇలాంటి పరిశీలన గావించగలుగుతున్నాను నీవు వైద్య శాస్త్రంలోనేగాక మనస్తత్వ శాస్త్రంలో గూడ సుదీర్ఘ కాలం కృషి గావించావు. వారికి వచ్చే వ్యాధులను విమర్శనాత్మకంగా పరికిస్తే వినూత్నమైన యంశాలను గ్రహించగలవని నా తలంపు.

సరసిజ : నా కున్న పరిజ్ఞానం నీ మనస్సు నర్థం చేసుకోవటానికి ఉపకరించటం లేదు.

రాజీవ్ : నాకు మనస్సంటూ ఒకటుంటేగా.

సరసిజ : వింతగా మాట్లాడుతున్నావు.

రాజీవ్ : కాదు సరసిజా! నేనంటుంది వాస్తవం. నీకు దూరంగా ఉన్నప్పు డెప్పుడూ, నీ తలంపులు నన్నంటిపెట్టుకు నుండేవి. బహుశ అప్పుడు నాలో మనస్సుండి ఉంటుంది, అందులో అంతట నీవే ఉండేదానివి. నాకు నీవు దగ్గరయిన తరువాత నా మనస్సును తెలుసుకోవాలని ప్రయత్నించినా వ్యర్థం. నాలో అసలు మనసంటూ లేనందున.

సరసిజ : నవ్వుతూ ఇంతటి గడుసువారనీ, చతురోక్తులలో నీకింతటి నేర్పుందనీ నా కింతవరకు తెలియనే తెలియదండీ.

రాజీవ్ : సరసిజ భుజంపై చేయివేసి, నవ్వుతుంటాడు. దాంపత్యంతో ధర్మ దృష్టి ఉండాలని మనవారి తలంపు.

సరసిజ : మనం ఇపుడేవిధంగా అధర్మాన్నాచరిస్తున్నామండీ.

రాజీవ్ : దాంపత్య జీవితంలో విద్యావంతుల మయిన మనం ఆర్థికంగా కొంత స్తోమత గల మనం అర్జనకు ఉపసర్జన తను అపాదించి ధర్మానికి కొంత ప్రాధాన్యాన్నీయవలసి ఉంటుందని నా తలంపు. నీ వైద్య మనస్తత్వం శాస్త్ర పరిజ్ఞానాన్ని, నాకు సంస్కృత వాఙ్మయ పరి

చయూన్నీ సమన్వయం గావించి రానున్న తరాల వారికి ఆ ధర్మ ప్రాయంగాకున్నా ఉపయోగపడే విశిష్టము, అపూర్వము అయిన గ్రంథాన్ని ఒక దానిని రచించాలని నా తలంపు. నే నొకమారు భరతుని నాట్యశాస్త్రంలో శోక, భయాదుల కనుపుగపడే సాత్వికాభినయంలోవి యంశాలను, మనస్తత్వ శాస్త్రంలోని సాదృశ్య సన్నివేశంలతో పోల్చి వివరించాలని ప్రయత్నించి మనస్తత్వ శాస్త్రంతో నాకు గల పరిచయం శూన్యం అయినందున ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాను. మన దేశంలో అతిప్రాచీన కాలం నుంచీ వాడుకలో ఉన్న ఆయుర్వేదంను పాశ్చాత్యులచిర పరిశ్రమల ఫలితంగా రూపుదిద్దుకున్న అల్లోపతి వైద్యవిధానంతో పోల్చి చూస్తే బాగుంటుందని నా తలంపు. ఈ విధమైన సమన్వయం, మీ సాహచర్యంవల్ల నాకు సాధ్యమవుతుంది.

రసిజ : ఎంత ప్రయత్నించినా తూర్పుతో పడమరను చేర్చలేం అనేది వాస్తవం.

జీవ్ : నీ వనే అంశం కాదనటానికి వీలులేనిది. కాని తూర్పుదేశం వారి వైద్య విధానంతో, పశ్చిమ వైద్యవిధానంతో పోల్చటం అసాధ్యమని నా కని పించదు.

రసిజ : తూర్పుదేశీయుల వైద్యవిధానంలో (ఆయుర్వేదం) ఆ 'ఆయుస్సనే మాట' ఉంది. పశ్చిమ దేశీయుల విధానంలో అలాంటిది ఉన్నట్లు నాకు తెలియదు.

జీవ్ : ఆయుస్సుకు క్షీణత, రాకుండ వృద్ధి పొందించుకోవటం అంటే రోగాలను నివారించుకోవటం అని తూర్పు దేశీయులు అయిన భారతీయుల తలంపని నాకనిపిస్తుంది.

సిజ : మీవు చదివిన సంస్కృతంలో వైద్య సంబంధ పరిభాషలు ఏమైనా గుర్తించారా?

జీవ్ : లేకేం. చాలా పున్నాయి.

సిజ : నేను చదివిన వైద్య మనస్తత్వ శాస్త్రంలో ఈ యంశాన్ని ఉదహరించినా దానికి మూలాన్ని గూర్చిన వివరాలు చెప్పాలి. లేకుంటే— మా శాస్త్రీయ పరిభాషలో చేసే నిర్ణయాలకు మతింపుండదు.

రాజీవ్ : అంటే ఏ విషయాన్ని మనం ఉట్టంకించినా ఆకర గ్రంథాలు వాని సంపుట పుటల సంఖ్యాదులు నియతంగా చెప్పాలని నీవు చెబుతున్నావు.

సరసిజ : అంతే. మీ రింతకు మునుపు ఎన్నో గ్రంథాల నుంచి వివిధాంశాలను మీ రిచ్చే రేడియో, టి.వి. ప్రసంగాల్లో జన బాహుళ్యాని కుద్దేశించిన ఉపన్యాసాల్లో రిఫర్ చేస్తూండేవారు. వాటి మూలాలు తద్రచయిత లను, ఆ గ్రంథాన్ని ప్రచురించిన వారి వివరాలను, మీరు పేర్కొన్న అంశాల యొక్క పుట లేదా పద్యసంఖ్యను చెప్పియుండలేదు. నాతో పాటు మీ ప్రసంగాలను విన్న వైద్యశాఖకు సంబంధించిన సిబ్బంది ఈ విధంగా రిమార్కులను చేయటం నేనే స్వయంగా వినియున్నం దున నీకింతగా ఈ యంశాన్ని గూర్చి చెప్పవలసి వచ్చింది.

రాజీవ్ : నేను చేసిన రేడియో, టి. వి. ప్రసంగాలు సామాన్య మానవున కుద్దే శించినవి. వాటిల్లో నీవు చెప్పిన వివరాలు చూస్తే వినేవారి ఆసక్తి భంజకాలవుతాయి. పరిశోధనాత్మకంగా వ్యాసాన్ని సిద్ధంచేసి పండితుల సభల్లో చదవవలసి వచ్చినపుడీ వివరాలనన్నీ పేర్కొంటాం. అయితే ఆ వ్యాసాన్ని చదివేటప్పుడీ యంశాలను చదివిన తరువాత ఈ వివ రాల దృష్టితో నా వ్యాసాన్ని పరిశీలించే వారికి ఈ యంశాలకు సంబంధించిన వివరాలు ఎంతగానో సహకరిస్తాయి. ప్రస్తుతమను సరావః. నేను అధ్యయనం గావించిన సంస్కృత వాఙ్మయంలో వైద్యానికి సంబంధించిన యంశాలనేకం ఉన్నాయి. వాటిల్లో ఆకర గ్రంథాల వివరణ నియ్యగలిగిన అంశాలనే నిప్పుడు వివరిస్తాను.

సరసిజ : అసలు మనం ఆయుర్వేదమంటున్నామే గాని వైద్యమనే పదాన్ని ప్రాచీనకాలంలో వాడినట్లు దాఖలా లున్నాయా.

రాజీవ్ : వైద్య పదాన్ని వాడారనటానికి ప్రాచీన వాఙ్మయంలో దాఖలాలు చాలా ఉన్నాయి.

"వైద్యరాజ నమస్తుభ్యం క్షపితా శేష మానవ
త్వయి విన్యస్తభారోఽయం - కృతాంత స్సుఖమేధతే."

అనేది ఒక చాటువు. అంటే దీని కర్త ఎవరో తెలియరాదు. అయితే దీని ఆకర గ్రంథ వివరాలు గావాలిగదా, ఎ. బి. కీత్ అనే ఆంగ్లేయ

రచయిత సంస్కృత వాఙ్మయ చరిత్ర అనే గ్రంథాన్ని ఆంగ్లంలో (History of Sanscrit literature) రచించాడు. దీన్ని ఆక్స్ఫర్డ్ యూనివర్సిటీవారు (Oxford University Press) ప్రచురించారు. దీనిలో ముక్తకాలనే ప్రకరణంలో గల శ్లోకాల్లో ఇది ఒకటి. ఇందులో వైద్య రాజ అనే పదం ఉంది గదా.

సరసిజ : నాకున్న సంస్కృత పరిజ్ఞానంతో దీన్ని అర్థం చేసుకోలేక పోతున్నాను.

రాజీవ్ : మార్కు లధికంగా వస్తాయని మీరు సంస్కృతాన్ని ఇంటర్‌లో పాఠ్యాంశంగా తీసుకున్నారేగాని, ఆ భాషలో ప్రావీణ్యం కోసం గాదనేది వాస్తవం. అందువల్ల మీకింత సులభమైన శ్లోకం గూడ అర్థం గావటంలేదు. అసమర్థుడు వైద్యశాస్త్ర ప్రావీణ్యంగానీ, హస్తవాశి గాని, లేనివాడు అయిన వైద్యుణ్ణి గూర్చి ఒక పౌరుడు చెప్పిన శ్లోక మిది. 'నీయొద్దకు చికిత్స కోసం వచ్చిన జన సముదాయాన్నంతను సంహరించే ఓ వైద్యోత్తమా! నీకు ఇవే మా నమస్కారములు. మాన వుల సంహరించే భారాన్ని నీ కప్పగించి నందున, యమధర్మరాజు, విశ్రాంతి తీసుకొంటున్నాడు, అని దాని భావము. ప్రతిపదార్థ తాత్పర్యాలను చెప్ప మంటావా.

సరసిజ : అవసరం లేదు లెండి. నేనంతగా మొద్దును గాను. మీరు గావించిన వివరణాత్మక అనువాదం నాకు తెలిసింది. వైద్య శాస్త్రానికి ఆయు ర్వేదమని పేరు ఉండటానికి గల కారణం.

రాజీవ్ : హింపించు, అనే అర్థాన్నిచ్చే 'రుజ్' అనే ధాతువు ఒకటి సంస్కృ తంలో ఉంది. దాన్నుంచి ఏర్పడిన నామమే 'రోగ' మనేది. రోగం లేకుండటం ఆ రోగం దాన్ని ఆధారంగా చేసికుని ఏర్పడిందే, 'ఆరోగ్యం, అనేది ఆరోగ్యంగా ఉండటం అంటే శరీరానికి ఏ విధ మైన బాధలు లేకుండుట. రోగాలు లేనివాడు చాల కాలం బ్రతుకు తారు. జీవిత కాలాన్ని 'ఆయుస్సు అంటారు.' ఆయుస్సు అంటే జీవిత కాలానికి (దాని పెరుగుదలకు) సంబంధించి తెలుసుకో దగిన ఆచరణాత్మకంగా పాటించదగిన అంశాల సంకలన

శాస్త్రమే ఆయుర్వేదమనేది. ఇంక ఆరోగ్య శాస్త్రానికి చెందిన పరిభాషలను వివరిస్తాను. ఈ సందర్భంలో నేను పరిగ్రహించిన పరిభాషకు ఆకరం వైయాకరణ సిద్ధాంత కౌముది అనేది. ఇది పాణిని నిర్మించిన అష్టాధ్యాయి అనే వ్యాకరణ సిద్ధాంత గ్రంధానికి వెలసిన వార్తికాలతో సమన్వయం గావిస్తూ, సూత్ర వార్తికాదులను వివరిస్తూ ఉదాహరణము లందు సమన్వయించటానికి భట్టోజీ అనేవాడు పూనుకున్నాడు. ఆతని వివరణాత్మక గ్రంధాన్నే వైయాకరణ 'సిద్ధాంత కౌముది' అంటారు. ఈతడు పదహారో శతాబ్దానికి చెందినవాడు. ఇంతకు మునుపు కాశీనగర ప్రాంతం వారష్టాధ్యాయి కి విధమైన వివరణను ప్రయత్నించారు. దానికి 'కాశికా' అని పేరు. నే నిచ్చే ఈ క్రింది వైద్యశాస్త్ర పరిభాషలన్నీ ఈ రెండు వ్యాకరణాల్లోను (చాలవరకు) చోటు చేసుకున్నవే. పాణిని సూత్రాన్ని సంఖ్యాత్మకంగా వివరించవలసినప్పుడు మూడు విభిన్న సంఖ్య లుంటాయి. అందులో మొదటిది అధ్యాయాన్నీ, రెండోది పాదాన్నీ, మూడోది సూత్ర సంఖ్యను తెలియజేస్తుంటాయి. శారీరికీయః అనే వైద్య పరిభాషకు చెందిన పరిభాషగా గుర్తింపదగిన ప్రయోగాన్ని అధికృత్యకృతే గ్రంధే (4-3-87) అనే పాణిని సూత్రానికి వివరణ గావిస్తూ భట్టోజీ ఇచ్చాడు. ఏ యంశాన్ని గూర్చి గ్రంధ రచన జరుగుతుందో తద్వాచి అయిన పదంపై 'ఈయ' అనే ప్రత్యయం చేరుతుంది. శరీరం నుంచి ఏర్పడిందే శారీరక అనేది. దాన్ని గూర్చిన విషయ వివరణాత్మకమైన గ్రంధానికి (శారీరక + ఈయ) ఈయ ప్రత్యయం చేరినందున శారీయకీయః అని ఏర్పడుతుంది. శరీర నిర్మాణాన్ని గూర్చిన వివరాలను గూర్చి ముచ్చటించే గ్రంధ మిది. మీరు నేర్చుకునే వైద్యశాస్త్రంలో 'అనాటమీ' అనేదాన్ని పాఠ్యంగా రెండేళ్ళు చదువుతా రనుకుంటా. ఈ నాడు ఈ గ్రంథంలో గల వివరాలు కొంత కొంత శారీరకీయ, అనే గ్రంథంలో ఉంటాయి. అనాటమీ అనే ఆంగ్ల పద నిష్పత్తిని గూర్చి నీ వేమైనా వివరించగలవా.

సరసిజ : నే నంతగా లోతుపాతులను తెలుసుకోలేదు. 'అనాటమీ'లో, పాసు గావటం ప్రాణాంతకంగా ఉండేది. అందువల్ల మేము వేలే విషయాలను గూర్చి ఆలోచించేవారం గాదు

రాజీవ్ : ఈ సందర్భంలోనే (4-3-88 సూత్ర వివరణలో) శిశు క్రందీయః అనేది ప్రయుక్తమై ఉంది. శిశూ నాంక్రందనం (పిల్లల ఏడ్పు) శిశు క్రందం, తమధికృత్యకృతో గ్రంథః (ఆ యంశంపై రచితమైన గ్రంథం అనే అర్థంలో) ఈ పదంపై 'ఈయ' చేరుతుంది. అందువల్ల శిశు క్రందీయః అనేది ఏర్పడుతుంది.

సరసిజ : పిల్లల ఏడ్పు పై గ్రంథమా. మేం చదువుకున్న శాస్త్రంలో ఎక్కడా ఉన్న గుర్తు అయినా లేదే.

రాజీవ్ : ఇక్కడ కొంత వివరణ గావాలి. సరసిజా, ఆరోగ్యంగా ఉన్న పిల్లలు తమ ఆకలిని తెలియచేయటానికి ఏడుస్తారు. అలాగాక అనారోగ్యంతో బాధపడే శిశువులు తమ బాధను ఇతమిత్థంగా మాటలతో చెప్పలేనందున ఏడుపుతో తెలుపుతుంటారు. అలా అనారోగ్యంతో ఏడ్చే పిల్లల ఏడ్పుకు కారణమైన వ్యాధిని కనుగొని దానికి నివారణను కనుగొనటం ఈ గ్రంథం యొక్క అంతరార్థంగా మనం గ్రహించాల్సి ఉంటుంది.

సరసిజ : అంటే ఈ గ్రంథం చిన్న పిల్లల వ్యాధుల నిపుణులకు చాల పనికి వస్తుంది. దీన్ని మామయ్యగారికి ఇస్తే బాగుంటుంది గదండీ.

రాజీవ్ : వెర్రి సరసిజా, ఈ గ్రంథాలన్నీ మనకు దొరుకుతున్నా యనుకోవటం కేవలం భ్రాంతే. తాళపత్ర ప్రతులను బహుకాలం అందుబాటులో ఉంచాలంటే వాటికి ప్రతులను కనీసం యాభై సంవత్సరాల కొకమారైనా తయారుచేయించాలి. అలా చేయించాలంటే ఆ గ్రంథం జనబాహుళ్యంతో ప్రాచుర్యాన్ని పొంది ఉండాలి. నిర్దిష్టమైన కొద్దిమంది వైద్య శాస్త్ర ప్రావీణ్యతను సాధించినవారికి మాత్రమే ఉపయోగపడే పై గ్రంథాలకు ప్రతులను రాయించటం సంభావ్యంగాదు. ఒకవేళ ఆలా రాయించినా ఆ నాడు గ్రంథా లంతరించిపోవటానికి కారణాలు అనేకం ఉన్నాయి.

రసిజ : మత ద్వేషంవల్ల అమూల్యమైన శిల్పసంపదను ఆయువు పట్టుల్లో అందమైన శిల్పచాతుర్యం, రూపు దిద్దుకున్న భాగాల్లో, ఏరి కోరి ఖండించిన అన్యమతీయులు ఇలాంటి గ్రంథాలు నసింపజేసి ఉంటారు.

రాజీవ్ : అంతేగాదు. పూర్వయుగాల్లో గ్రంథాలు నశించిపోవటానికి బహు కారణాలు ఉంటాయని రాజశేఖర డనే అలంకారికుడు కావ్యమీమాంశ అనే తన గ్రంథంలో వివరించి ఉన్నాడు. ఈ పద్యం ఏ ప్రకరణం లోనిదో తర్వాత చెబుతాను. ప్రస్తుతం నా కా వివరాలు జ్ఞాపకం లేవు.

సరసిజ : ప్రతి అంశానికీ ఆకరం చూపించాలని నా తలంపు గాదు. మేము శాస్త్రీయ విషయాల్లో మూలగ్రంథాలను గూర్చిన యంశాల కన్న మీరు మరిన్ని వివరాలను సేకరించుటయే గాక, మీరు గ్రహించిన యంశాలకు సహేతుకమైన వివరణ చేయగలుగుతున్నారు. మా శాస్త్రుల్లో విశేష కృషి చేసినవారు గూడ, వారు పరమప్రామాణికాలుగా గ్రహించిన గ్రంథస్థాంశాలను మీలాగ హేతుబద్ధమైన నూతన ధోరణిలో వివరింప ప్రయత్నిస్తే, ఆ శాస్త్రులు ఈ దేశంలో ఇంకా ఎంతో ముందుకు సాగిపోయి ఉండేవని నా తలంపు.

రాజీవ్ : గ్రంథాలంతరించి పోవటానికి నిక్షేప మొక కారణం. రచయిత తన గ్రంథాన్ని రక్షణ కోసం, సామంతులయిన వారి ఇంట దాచటం. తన గ్రంథాన్ని వారికి అమ్మటం రచయిత దారిద్ర్యం దీనికి కారణం. కొన్నవారీ గ్రంథాన్ని చదవరు. దేవతార్చన సామగ్రితో పాటు తర తరాలుగా పూజిస్తారు, కొంతకాలానికీ తాటియాకులు శిథిలమవుతాయి గాబట్టి గ్రంథం నశించి పోతుంది. కర్త తన గ్రంథాన్ని ప్రతిఫలాపేక్ష లేక, యోగ్యుడని తలంచిన వారికి దానం చేయవచ్చును. ప్రతిగ్రహీత కూడ గ్రంథాన్ని వెల పెట్టి కొన్న వానికి వలెనే దేవతార్చనలో చేర్చి, శిథిలమై పోయేంత వరకు పూజిస్తుంటాడు. దేశంలో వచ్చిన మత, రాజకీయాల కల్లోలాల వల్ల రచయితకు దేశ త్యాగం తప్పనిసరి అవుతుంది. అలాంటప్పుడు, కట్టు బట్టలతో, ప్రాణ రక్షణకై దేశాంతరానికి పయనమయ్యే రచయిత తన గ్రంథం విషయం పట్టించుకోకపోవచ్చు. అంతటితో ఆతని గ్రంథం అంతమొందవచ్చు. రచయిత తన రచనను పూర్తిగావించకుండానే, అకాల మృత్యువు వాత బడినప్పుడు గూడ అసమగ్రమయిన ఆతని గ్రంథం మగింపుకు

నోచుకోక పోవుటయేగాక, నశించిపోవటం జరుగవచ్చు. జల, అగ్ని, ప్రళయాలు, అరాచకత్వం దేశంలో తల యెత్తినపుడు గ్రంథాలు నాశనాన్ని పొందటం సంభావ్యం.

సరసిజ : ఇన్ని ప్రమాదాలకు లోను గాక, మిగిలిన గ్రంథాలు మాత్రం మనకు లభించాయి. అంటే కాలగర్భంలో కలసిపోయిన గ్రంథాలు, మనకు లభించిన గ్రంథాలకంటే కొన్ని రెట్లధికంగా ఉంటాయని తలంచటం యుక్తి యుక్తంగా ఉంటుంది గదా.

రాజీవ్ : నీ ఊహ సహేతుకంగానే ఉంది సరసిజా. ప్రస్తుత మనుసరావః వైద్య శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలే గాక కొన్ని వ్యాధులను గూర్చిన వివరాలను, వాటిని నివారించటానికి ఉపయోగపడే వనమూలికలను మనవారు నిరూపించారు. నామలింగాను శాసనము అనే అమర కోశంలో గల వనౌషధి వర్గమనే భాగంలో ఇలాంటి వివరాలధికంగా నిరూపితాలయి ఉన్నాయి. వన మూలికల వివరాలను చెప్పే ఈ వర్గ (వనౌషధి వర్గ) తొమ్మిదొందల పుటలకు పైగా ఉన్న ఈ గ్రంథంలో పదో వంతుకు తగ్గకుండా (అంటే) తొంభై పుటలకు పైగా ఉండటం గమనించాల్సిన అంశం. వనౌషధి వర్గంలోని విశేషాలను పరిశీలించే మునుపు, పాణిని రచిత వ్యాకరణంలో వ్యాధులను గూర్చిన వివరణను గూర్చి చెప్పటం చాల అవసరం. అష్టాధ్యాయిలో (తస్యనిమిత్తం సంయోగోత్పత్తౌ) (5-1-38) అనే సూత్ర సందర్భంలో గల వార్తికం, 'వాత పిత్త శ్లేష్మేభ్యః శమన కోపన యోరుప సంఖ్యానం' అనేది. ఈ సందర్భంగా వాతాదులు ఉండవల్సినంత కన్న తగ్గుదలను, పెరుగుటను చెప్పవలసివస్తే, వాతికం, పైత్తికం, శ్లైష్మికం అనే రూపాలేర్పడుతాయని గలదు. వాత పిత్త శ్లేష్మము సమపాళ్ళల్లో ఉంటే మనిషి ఆరోగ్యంగా ఉంటాడనీ, అలా కాక ఈ మూడింటిలో గణనీయంగా పెరుగుదల లేదా తగ్గుదల (Low and High B. P. లాగ) మనిషికి బాధాజనకమై వ్యాధిగా తయారవుతుందని చెప్పటం గమనించదగిన యంశం. ఆయుర్వేదమనే వైద్యశాస్త్రం వాతాదులైన మూటి నాధారంగా చేసుకుని రోగ నిర్ణయం చేస్తుందనీ, ఏ వ్యాధికైన ఈ త్రితయంలో గలిగిన మార్పు ఆధారమనీ అంటారు.

సరసిజ : మాకు చిరపరిచితమైన వైద్యవిధానంలో గూడ వాతాదులకు తగు ప్రాధాన్యం లేకపోలేదు.

రాజీవ్ : సన్నిపాతిక, అనేదాన్ని సన్నిపాత అనే పదాన్నుంచి పాణినీయం నిష్పన్నం గావించింది. అతి ప్రభావవంతాలైన మందులు గూడ సన్నిపాత జ్వర నివారణకు అసమర్థా లవుతాయని కాళిదాసు (వీర్యవంత్యౌషధానీవ వికారే సాన్నిపాతికే) కుమారసంభవ కావ్యంలో చెప్పాడు. మిక్కిలి ప్రభావం గల ఔషధాలు రాత్రిపూట అంటే బహుళ చీకట్లో దేదీప్యమానంగా ప్రకాశిస్తాయనీ (మహౌశధీం నక్తమి వాత్మ భాసం) అనే కాళిదాస ప్రయోగం తెలియజేస్తుంది. రాజయక్ష్మ (నేటి క్షయ వ్యాధి) రోగ సమూహం ఏకత్ర సమావేశం గావటమని శిశుపాల వధలో (రాజయక్ష్మేవ రోగాణాం ససమూహో మహీభుజాం) మాఘ మహాకవి వాడుక చేసి ఉన్నాడు.

చరణాద్యవయ లోపంవల్ల గమనశక్తిని కోల్పోయినవారికి ఈ కాలంలో వలె ఆ నాడు గూడ చక్రా లమర్చిన బండివంటి పీటలు గలవని (పర్పాదిభ్యష్టన్ 4-4-10) పాణిని రచిత వ్యాకరణ సూత్రంలో ఉన్నందున, వికలాంగులకీ సౌకర్యం పాణిని కాలానికి ముందే ప్రచారంలో రూఢి గావించిందని తలంప వచ్చును. పాణిని తన అష్టాధ్యాయిని క్రీస్తు శకానికి ముందే రాసినట్లు పండితులు తలుస్తారు.

నేటి వైద్య శాస్త్రంలో మనస్తత్వ శాస్త్రానికి ప్రాధాన్యం గలదని మనం గుర్తించాం. తెలుగు నేలపై అనాదిగా గ్రామీణులు పాదంలో ముళ్ళు గుచ్చుకొని విరిగినప్పుడు, దాన్ని తీసేటప్పుడు నొప్పి తెలియకుండ ఉండా లంటే 'పల్లవ ప్రసూన ఫల భరితంబైన' పచ్చని చెట్టును చూడమంటారు. దీనివల్ల నొప్పి తగ్గుతుందా అంటే కాదనే చెప్పాలి. ఈ మాట హేతువాదం ముందు విలువ లేనిది. ప్రకృతి ప్రసాదించిన రమ్యమైన వృక్షసంపదలో చూపు లగ్నం గావించటంవల్ల తన పాదంలో జరుగుతున్న శస్త్రచికిత్స లాంటి ప్రక్రియను భావించటానికి అంతరాయం గలుగుతుంది. అందువల్ల నొప్పిని అనుభవింపకుండ ఉండవచ్చు. ఇదొక విధమైన ఉపశమనం. ఈ ఉపశమన ప్రయత్నం మనస్తత్వానికి సంబంధించినదని నిస్సంశయంగా చెప్పవచ్చు.

ఇంతలో సరసిజ విశ్వేశ్వరయ్యగారితో పాటు వైద్యశాలకు పోవలసిన సమయమాసన్నమయినందున ఈ దంపతుల ఆలోచనా సరళికి కొంత అంతరాయం గలిగింది. వైద్యశాలలోకి పోయినా సరసిజ మనసులో రాజీవ్ సవివరంగా తెలియజేసిన ఆయుర్వేద విషయాలే మరల మరల స్ఫురణకు వస్తున్నాయి. అతని పరిశీలన, భావన, అధ్యయనము అన్నింటినీ మించి ధారణ తనకు దుర్లభములని ఆయన ముందు తాను నేర్చుకొన్న విద్యగానీ చికిత్సలో నేర్పుగానీ అతి స్వల్పమని తలంచకుండ ఉండలేక పోతుంది.

భోజనానంతరం ఆ యువక ద్వయం పడక గదిలో కలుసుకున్నారు. అన్ని భాషల కన్న మిన్న సంస్కృతమనీ అందువల్ల కంప్యూటర్‌లో వాడుక చేయటానికి సంస్కృత భాషకు మాత్రమే అనుకూలత ఉందనీ విన్న సరసిజ ఆ విషయంలో వివరాలు కోసం రాజీవ్‌ను అడిగింది. రాజీవ్ ఈ యంశంలో తెలిసిన విషయాలు చెబుతుండగనే సరసిజ విద్రలోకి వాలిపోయింది. 'రాత్రిరేవం, అనే భవభూతి ప్రయోగంలో బిందువును తొలగించమని' కాళిదాసు చెప్పిన యంశాన్ని పురస్కరించుకొని చతుర్యామ అయిన రాత్రి అవిదితగత యామమై జరిగిపోయింది. (రాత్రిరేవ వ్యరం సీత). రాత్రిర్గతా....ముంచశయ్యా మొదలయిన వంది మాగధల ప్రబోధ గీతాలతో పని లేకుండనే ఆ యువకులు నిద్ర మేల్కొని ప్రభాతపు కృత్యాదులను ముగించుకొని అల్పాహారాన్ని సేవించి, హాల్లో కూర్చున్నారు. నాడు ఆదివారమయినందున వైద్యశాలకు సెలవు కాబట్టి మిగిలిన యంశాలను వివరించమని సరసిజ రాజీవ్‌ను కోరింది. ఇప్పటి నుంచీ పదకొండు గంటల్లో నీ మాటలు ముగియాలి అని సరసిజ అనగా—

రాజీవ్ : ఆ తరువాత నీకేం పని ఉంది.

సరసిజ : అత్తయ్యకు వంటలో సాయం చేయాలి.

రాజీవ్ : నీ సాయాన్నామె కోరిందా.

సరసిజ : లేదు, నేనే ఆమెతో పాటుండీ వంటను నేర్చుకోవాలనుకొంటున్నా.

రాజీవ్ : నీ కింతవరకు వంట రాదా.

సరసిజ : వచ్చును గాని అత్తయ చేసే వంటను తెలుసుకోవాలని.

రాజీవ్ : మా అమ్మ వంటలో ప్రత్యేకత ఏమైనా ఉందా.

సరసిజ : అలా అని గాదు, మీకు ఇష్టమైన వంటలను రుచులను, ఆమెవల్ల నేర్చుకోవాలని.

రాజీవ్ : ఏమంత శ్రద్ధ.

సరసిజ : భర్త అభిరుచులను గుర్తించి దానికి తగినట్లు వంట చేసి ఆయనను సంతృప్తి పరచటం, ఇల్లాలి కనీస ధర్మమని తిక్కన కృత అనుశాసనిక పర్వం 'పతికి మెచ్చు వంటకములు - చవిగ వండియిడుదు' (IV-358) అని చెప్పిన పలుకులు నా స్మృతిపథంలో తరచు మెరుస్తుండేవి. ఇంత కాలానికి నా కా అవకాశం లభించింది.

రాజీవ్ : నీ యిష్టప్రకారం నీ కార్యక్రమానికి విఘ్నం రాకుండగనే నీ యంశాన్ని ముగిస్తాను. నేను గూడ పదకొండు గంటల తర్వాత బయటకు పోయిరావలసి ఉంది.

కరక్కాయను మనమందరం ఎరుగుదం. నా చిన్నతనంలో కరక్కాయను సిరా చేయటానికి వాడుక చేస్తుండేవారు. ఈ కరక్కాయకు సంస్కృతంలో పదికి పైగా పేర్లున్నాయి. అవన్నీ ఈ కాయకు వివిధ వ్యాధులను నివారింపజేసే శక్తి నాధారంగా చేసుకుని కల్పించినవే.

హరీతకి:- అనేదానికి కరక్కాయ అని పేరు. ఈనాడు హరించుట అనే అర్థంగల హృ ఞ్ అనే ధాతువునుంచి ఏర్పడిందనీ రోగాన్ని హరించే శక్తి దీనికున్నందున (రోగం హరతీతి) ఈపేరు (హరీతకి) ఎర్పడిందని అమరకోశంలో వివరింపబడినది.

పథ్యా. అనేది కరక్కాయలకు (ఆ చెట్టుకు) పేరు. వ్యాధి మార్గమునకు సుదూరముగ ఈ కాయ మానవులను ఉంచ గలదు గాబట్టి (నిరామమే పథి సాధ్వీ పథ్యా) ఈ పేరు సంక్రమించినదని నిఘంటువు నందలి వివరణ కాయస్థా అనేది మరో పర్యాయపదం.

(కాయ తిష్ఠత్యనే నేతి) దీనివల్ల కాయము నిలుచును. కాయ పర్యాయమైన శరీరం నశించిపోయేది. కరక చెట్టునుండి లభించే ఔషధములవలన కాయం చిర కాలం నిలవ గలుగుతుంది.

పూతన అనే దింకో పర్యాయ పదం.

దేహం దేనిచేత పవిత్రమగునో అది పూతన. ఈ వృక్షంవల్ల దేహం రోగాలవల్ల గలిగే వ్యతిక్రమాలు తొలగి యథాపూర్వ స్థితి గలుగుతుంది. ఈ విధంగా పునీతం గావించే శక్తి గల దీ వృక్షం. దాని ఫలాలు.

**అమృతా మరో పర్యాయం—**

దాన్ని సేవించినవారికి మరణ భయం లేదనే అర్థం దీనివల్ల గలుగుతుంది.

రేచకీ మరో పదం.

విరోచనమును గలిగించునది (రేచయి ఉరేచనం కరోతతి).

శ్రేయసీ, శివా అనేవి గూడ కరక్కాయకు పర్యాయలే దీనివల్ల శరీరానికి మేలు (శ్రేయస్, శుభం (శివ) కలుగుతుందని దీనికి అర్థం. ఇంతగా కరక్కాయ అను కాచే చెట్టును, వాని కాయలను ఆయుర్వేదంలో ప్రశంసించారని పరిశీలన వల్ల తెలుస్తుంది,

ఏరదం: వ్యడంబర, ఉరువాబుక, అనేవి అముదానికి పర్యాయ పదాలు ఇవన్నీ ఆముదంవల్ల మనిషికి గలిగే ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకునిగలిగినవే (ఈరయతి వాతం) వాతమును నివారించునది. (వ్యడతి రోగం హంతుం) రోగ మును తొలగింప ప్రయత్నించునది. (ఉరుః భృశం వాతం వాతి నాశయతి) వాత మును మిక్కుటముగా తొలగించునది అని ఈ పదాలకు ఆరోగ్య విషయకమైన వ్యుత్పత్తి దోషా భావమును గనిపించునది (కరతి దోషా భావమితి: కరక.)

కరక యనగా దానిమ్మకాయ.

ఈ విధంగా వనౌషధి వర్గలో ఆరోగ్యాన్నాధారంగా చేసుకుని కల్పితాలై ప్రయుక్తా లవుతున్న పదా లనేకం ఉన్నాయి. ఈ మొదలయిన వివరణమంత, ఆయుర్వేద శాస్త్రంలోని భాగంగా గుర్తించ దగును.

ఇలాంటి వివరాలను నీవు చదివిన వైద్య మనస్తత్వ శాస్త్రాల నుంచి ఇవ్వమని రాజీవ్ అడుగగా తన కంత సామర్థ్యం లేదంటుంది సరసిజ. వీలున్న పుడు నీవు గూడ ఇంతకు మునుపు పఠించిన గ్రంథాలను అనుశీలనం గావించి ఇలాంటి పదాలను సంకలనం చేస్తే మనం తలంచినట్లు వైద్యశాస్త్రం, తూర్పు, పడమర అనే గ్రంథాన్ని రాయగలుగుతాం.

అంతేగాక దివంగతులయిన శాస్త్రిగారి స్మృతిచిహ్నంగా మనం సంస్కృతాధ్యయన సంస్థను ప్రారంభిస్తే బాగుంటుందని రాజీవ్ అంటాడు. ఈ యంశాన్ని భోజన సమయంలో సరసిజ, విశ్వేశ్వరయ్యగారికి సూచనాప్రాయంగా అందించటం, ఈ కార్యం రాజీవుకు కలిగిన ఆలోచనా ఫలితమని గ్రహించిన విశ్వేశ్వరయ్యగారు దానికి తగిన ధనాన్ని మంజూరు చేయాలని నిర్ణయం తీసుకోవటం జరిగాయి.

దానికి తగిన భవన సముదాయ నిర్మాణానికి ప్రారంభం జరగటం, ఆ కార్య నిర్వహణకు చంద్రాయుని నియోగించటం జరిగాయి. ఈ సంస్థ ప్రచురించే తొలి కుసుమం రాజీవ, సరసిజ సాయంతో నిర్మింపదలచిన గ్రంథమని చంద్రాయుని తలంపు. ఈ గ్రంథం వెల మన కందుబాటులో ఉండే దీన్ని కొని త్వరలో మన మందరం అధ్యయనం గావించుదాం.

(వేంకటేశాయ మంగళమ్.)